శ్రీ మత్పరదేవతాయైనమః

# కథలు - గాథలు

## ప్రథమభాగము



రచయిత:

ప్రకాశకులు.

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిసన్సు

వేంకటేశ్వర పబ్లికేషన్సు

కడియము P. O.

తూర్పుగోదావరిజిల్లా.



రెండవ కూర్పు
**1958**
వెయ్యి ప్రతులు.

## గమనిక

కథలు-గాథలు అనబడే యీ ప్రథమభాగంలో ప్రచురింపబడిన వ్యాసములన్నీ తిరుపతి వేంకటకవులలో నొకరగు చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి శతావధానిగారిచే రచింపబడి ఆంధ్రపత్రిక కృష్ణా భారతి త్రిలింగ ఆంధ్రవాణి ప్రౌఢభారతి ఉదయలక్ష్మి ప్రజామిత్ర సమదర్శిని జాగృతి ఆదిగాగల తెలుగుదేశం పత్రికలలో ప్రచురింపబడిన భిన్న భిన్న శీర్షికల రచనలున్ను- అముద్రితములయిన వ్రాత ప్రతులలోని రచనలున్ను అని మనవి చేయుచున్నాము. ఆయావ్యాసముల విశేష శీర్షికలను "కథలు-గాథలు ద్వితీయభాగము"లో చదువగోరుచున్నాము.

ముద్రణ:
వేంకటేశ్వరప్రింటింగ్ ప్రెస్
[illegible]

# మొదటి మాట

—०—

కథలు-గాథలుఅనే శీర్షికతో లోగడ చిన్నవి చిన్నవిగా అయిదు సంపుటములు మాచే ప్రచురింపబడినవి. అవి లోకుల ఆదరాభిమానము లకు విశేషించి పాత్రములగుటచే ఈ రెండవ కూర్పున ఆ అయిదు సంపుటములలోని వ్యాసములేగాక మరికొన్ని క్రొత్తవ్యాసములున్నూ ఇటీవలనే మాచే గుర్తింపబడి యిందు ప్రకటింపబడిన వ్యాసములలో సంపూర్తిగా అతికికొనునట్టి మరికొన్ని వ్యాసములున్నూ చేర్చి యీ ప్రథమ భాగమును సశేషముగా ప్రకటించి యున్నాము.

తిరుపతి వెంకటకవులు సర్వతోముఖముగా కవితారచన సాగించి అజరామరణమైన యశఃకాయాన్ని ఆర్జించి సారస్వతజగత్తులో ఆ చంద్రతారార్కంగా ధ్రువతారలై మెఱయుచున్న కింకవీంద్రఘటాపంచాననులు. వారి జీవితభంగిమములలోని చారిత్రిక నగ్నసత్యాన్ని గుర్తించుటలో రకరకాల యైతిహ్యముల నూహాగానంచేసే చారిత్రికుల కిది యొక కాణాచి —

నానారాజసందర్శనం గావించిన ఆ "బాలసరస్వతీ కలానిధుల" ఆత్మరచనలలోని అనేక ఘట్టములను సక్రమంగా అర్థంచేసుకో గలుగుటలో పాఠకుల కిదియొక మార్గదర్శి—

"విద్వత్కవు"లైన ఆ "శతావధానుల" కాలములో దేశపరివ్యాప్తంగా ఉండే సంప్రదాయాన్ని కరతలామలకం గావించుకొనుట కిది యొక విజ్ఞాన సంపుటి —

"అద్భుతనాంధ్రకవి ప్రపంచనిర్మాతలైన" ఆ మహాకవి పరిపుష్టుల సమకాలికులైన భాషాపోషకుల - దాతల - విద్వాంసుల - ఉదార చరిత్రములను-పరిచయం చేసుకొనుట కిదియొక కరదీపిక— ఇంతేకాదు.

ఆ "కళాప్రపూర్ణుల" కాలంలోనే బయలుదేరిన పుక్కిటి పురాణ కథలనూ అసందర్భవిమర్శలనూ తునాతునుకలు గావించి సిద్ధాన్తరూపాన్ని ప్రతిబింబించుటలో ఆదర్శపాత్రి వహించిన సారస్వత ఉద్గ్రమున్న అనుటలో సందేహంలేదు —

సుమారుగా రెండు దశాబ్దుల కాలంలో ఆంధ్రదేశపు సుప్రసిద్ధ పత్రికలలో ప్రచురింపబడినవిన్నీ అముద్రిత గ్రంథసామగ్రిలో మా తండ్రిగారిచే భద్రపఱుపబడినవిన్నీ అనేక వ్యాసములు సందర్భోచితముగా సమన్వయ క్రమంలో ఇందు పొందుపరుపబడినవి గాని యింకను మా కృషి మిగిలియే యున్నది —

ఎంత ప్రయత్నించినను ఇంకను కొన్ని వ్యాసములు మాకు లభించలేదు. ఇప్పుడు ప్రకటించిన ప్రథమ భాగముకన్న పెద్దదిగా ఉండబోయే ద్వితీయభాగమునకు సరిపడిన వ్యాసావళి మావద్ద గలదు. అది గూడ అచిరకాలములోనే పాఠకలోకమునకు అందించుకోగలము —

ఇంకను మిగిలిపోగల వ్యాసావళిని గుర్తించి మాకు అందించి సహాయపడగల సారస్వతాభిమానులకు కృతజ్ఞులమై యుండి దీనితరువాతి ముద్రణలో గాని ద్వితీయభాగములోగాని చేర్చి ప్రచురింపగలమని విన్నవించుచు మాకృషికి చేయూత యివ్వవలసినదిగా రసజ్ఞులను ప్రార్థించుచు దీనిని ముగించుచున్నాను.

వేంకటేశ్వర పబ్లికేషన్స్
కడియము P.O.
తూ॥ గో॥ జిల్లా.

ఇట్లు.
విద్వాన్
చెళ్లపిళ్ల దుర్గేశ్వర శాస్త్రి
(గ్రంథకర్తకుమారుడు)

# విషయసూచిక



---

# పిఠాపుర ప్రభువు లేటు
# శ్రీ గంగాధర రామారావుగారి కథలు

పైని వుదాహరించిన ప్రభువరేణ్యుని అత్యద్భుతచర్యలు మాప్రాంతములలో తఱుచుగా చెప్పుకుంటూవుంటారు. నాకు కొంచెం ప్రాజ్ఞత కలిగేటప్పటికి వీరు తుట్టతుదిదశలో వున్నారు. వీరిని నేను చూడడం చూశాను. గాని, నన్నుమాత్రం వా రెఱుగడానికి తగ్గస్థితిలో అప్పటికి నేను లేను. నేను కాశీనుండి కాశీకావడి బుజాన్ని పెట్టుకొని వచ్చేరోజులలో తునికిన్నీ అన్నవరానికిన్నీ మధ్యగావున్న తేటగుంట, తిమ్మాపురంవద్దకు వచ్చేటప్పటికి యీ మహారాజు ద్వాదశాహస్సునాఁటి సంభావన పుచ్చుకొన్న బ్రాహ్మణ్యం యెదురుగావచ్చింది. నాకు నామరూపాలు కలగడం కాశీనుంచి వచ్చిన మఱుచటినాటినుండే కావడంచేత, వారిని నేనెరగడమేకాని నన్నువా రెఱింగి వుండే యోగం తటస్థించలేదు. అదిన్నీకాక యీ ప్రభువు సుమారు 5, 6, సంవత్సరాలకాలం అంత్యదశలో కొంత అనారోగ్యంగావుండి-"కాశ్యాంతు మరణాన్ముక్తిః" కనక, కాశీలో భౌతికదేహం చాలించేవుద్దేశంతో వకటి రెండుసార్లు కాశీకి వెళ్ళినట్లుకూడా వింటాను. కాని తుదకు వీరు తమ రాజధానియగు పిఠాపురంలోనే కోటలోనే భౌతికదేహాన్ని చాలించినారు. వీరు భౌతికదేహాన్ని చాలించేనాటికి కొంచెం పూర్వగాథలు నాకు తెలియటానికభ్యంతరం లేదుగాని, వీరు రాజ్యానికివచ్చిన కొలఁదికాలం నాటిచర్యలు నాకు వినికివల్ల తెలిసినవేకాని ప్రత్యక్షంగా తెలిసినవి మాత్రం కావు. బహుశః, గతించిన ధాత, ఈశ్వర సంవత్సరాల ప్రాంతంలో జరిగిన వక చర్యనుగూర్చి యిందు వ్రాస్తాను.

### బియ్యంగారిరాక

అప్పటికి నావయస్సు సుమారు ఆఱుసంవత్సరాలకు దాదాపు. అప్పుడు కఱవువచ్చింది. రూపాయిపెట్టి బియ్యంకొంటే చేటలోకి పూర్తిగా వచ్చేవికావు. యిటీవల బియ్యపుధర ఆమాదిరిగా వున్నరోజులు నా బాల్యా

సంతరం చాలావున్నాయి గాని కథవనిమాత్రం లోకం అనుకున్నట్టు లేదు. ఆ కాలానికి అదే పెద్దకథ. అప్పటికింకా మా పుట్టినవూరు పడిసం గ్రామంలోనేవుంది. నాకుతగుమాత్రం అప్పటి సంగతులిప్పటికీ స్మృతిలో వున్నాయి. గాని యిప్పుడు వ్రాసేదిమాత్రం యితరుల విన్నదాని అనుభ వించి జ్ఞాపకముంచుకొన్నదికాదు. అప్పుడు మా గ్రామం జియ్యంగారు వచ్చారని చెప్పుకోవడం మాత్రం జ్ఞాపకంవుంది. నేను జియ్యంగారిని “బియ్యం” గారని పాడినట్లు కూడా జ్ఞాపకంవుంది. యింక వ్రాసబోయే సంగతులేవిన్నీ క్షుణ్ణంగా ఎరిగి వ్రాసేవికావు. మాతండ్రిగారు మొదలైనవారి వల చెప్పుకొనేటప్పుడు విన్నవే.

జియ్యంగారంటే, బహుశః శ్రీవానమామల జియ్యంగారైవుండాలి. వీరు శ్రీవైష్ణవపీఠస్థులు. స్మార్తులకు శ్రీశంకరాచార్యపీఠం యేలాటిదో విశిష్టాద్వైతులకు యీ పీఠమున్నూ అలాంటిదే. యిటీవల నానాటను ఆ యీ పీఠస్థుల పవరు తగ్గిందికాని మా చిన్నతనంలో గవర్నమెంటువారి కన్న యీపీఠస్థులకు తక్కువ అధికారం వున్నట్టు లేదు. వారికి యివ్వవల సిన పాదపూజ సమర్పించకపోతే ఆయాగృహస్థుల యిండ్లో సామాను జప్తుచేయడం వగయిరా అధికారాలు పీఠస్థులకు గవర్నమెంటుతోపాటు వుండేరోజులు నేను కొంచెం ఎరుగుదును. క్రమంగా మా గోదావరి డిస్ట్రి క్టుకు పీఠమంటూ వుండడమే అంతరించి చాలారోజు లయింది. సుమారు నలభై యేండ్ల పరిమితిలోను మా ప్రాంతానికి శంకరాచార్యపీఠం వచ్చినట్లు గాని, పాదపూజ సమర్పించినట్టుగాని నేనెరుగనే యెరుగను. కాని సుమారు పదేండ్లనాడు కాబోలును, యెవరో శంకరాచార్యస్వాములవా రంటూ మాసమీపగ్రామం జేగురుపాడుకు వచ్చి నా పేర శ్రీముఖం పంపించారు. శ్రీముఖం అంటే గురుపీఠంవారు శిష్యులకుపంపే నోటీసు. దానిమీద నాకు తోచిన పాదపూజ పంపించుకొన్నానుగాని తీరికలేక వారి సందర్శనానికి వెళ్ళలేదు. మొత్తం చిరకాలాన్నుంచి మా జిల్లాకు పీఠస్థుల సందర్శనం లేకపోయిందన్నది ప్రస్తుతం.

## —• శైవం — వైష్ణవం •—

వానమామల పీఠస్థులు మాగ్రామం దయచేయడానికి కారణం శ్రీపిఠాపురం రాజావారే. మాప్రాంతం వెలమవారందఱున్నూ వైష్ణవ మతస్థులే. నేను వెంకటగిరి సంస్థానానికి వెళ్ళడానికిపూర్వం వెలమవారిలో శైవులున్నారనే సుతరామున్నూ యెఱుఁగను యీకారణంచేతనే వెంకటగిరి స్టేషనులో వక వెలమదొరగారితో నాకు నిష్కారణంగా పోట్లాట తటస్థించింది. ఆయన చాలా మంచివారుకనుక కాని, లేకపోతే నాకు ఆపోట్లాటలో "తన్వపరిహారణ" మహోత్సవంకూడా జరిగేదే. అసలు కథేమిటంటే, జంగందేవర వేషముతో వకాయన ఆ స్టేషనులో నాకు ప్రత్యక్షమైనారు. ఆయనతో నేను సామాన్యపు జంగాలతోవలెనే మాట్లాడుతూ వున్నాను. ఆయన మంచివారు కనుక మేము వెలమవారంఅని చెప్పారు పాపం. కాదు, మీరు జంగాలన్నాను నేను, యెఱుగనప్పుడు నేనేమన్నా, ఆయన యథార్థం చెప్పిన తరువాతేనా వెనక తగ్గవలసింది. కాని ఆయన వేషం, వకగంటా శంఖమూ యింతే తరవాయిగాని పూర్తిగా జంగం దేవరలా కనపడింది. పయిగా వెలమవారేమిటి? విభూతిరుద్రాక్షలు వేసుకోవడం ఏమిటి? అని వకశంక. అందుచేత ఆయన మాటను నేను బొత్తిగా నమ్మలేకపోయాను. తుదకు విధిలేక నమ్మి, "మావైపున వెలంవారు యెవ్వరూ విభూతివగయిరా ధరింపరు." అంటూ యేదో రెండు యథార్థమైనమాటలే చెప్పి ఆయనవల్ల కాళహస్తి ప్రాంతంలో శివభక్తులైన వెలంవారు వున్నట్టు తెలిసికొన్నాను. యిటీవల చాలారోజులకు గుంటూరుసీమపల్నాడు చేబోలు కమ్మవారిని చూచి కమ్మవారిలో శైవులుండడం తెలుసుకున్నాను. అలాగే హైదరాబాదు ప్రాంతంలో కంసాలులలో తిరుమణి ధారులున్నట్లు తెలుసుకున్నాను. అందుచే కూపకూర్మంగా వుండడం యెవరికీ కూడదు. కవికి బొత్తిగా కూడదని అనుభవజ్ఞులు చెప్తారు. "అపరిపాసినంచ బ్రాహ్మణంద్పృష్ట్వా సచేలస్నాన మాచరేత్" అనేవారట. మా గురువుగారి గురుపరంపరలో వకరైన

శ్రీ యింద్రగంటి గోపాలశాస్త్రులుగారు. అవి అట్లా వుండనిచ్చి ప్రస్తుతాంశం మాట్లాడుకుందాం.

## — వర్ణాశ్రమాచారాల పట్టుదల —

శ్రీ గంగాధరరామారావుగారు వైష్ణవ మతపుచ్చుకుందామని వారిని పిలిపిస్తే వానమామలై జియ్యంగారు శ్రీ రాజావారి ప్రధానగ్రామాల్లో ఒకటైన మాకడియం గ్రామం దయచేశారు. వారు దయచేసేటప్పటికి శ్రీ బులుసు పాపయ్యశాస్త్రులవారున్నూ శ్రీరాజావారి సముఖములోనే మకాం చేసియున్నారు. శ్రీ రాజావారికి గురుపద్యానికి వెళ్ళేటప్పుడు పాపయ్యశాస్త్రులవారి సహితంగా వెళ్ళాలని కుతూహలం వుండేది. కాని రాజావారికి వారు గురువులు గాని పాపయ్యశాస్త్రులవారికి వారు మతరీత్యా గురువులు కారుగదా? విద్యలోనో, యెవరూకారు. అట్టిస్థితిలో వారి సందర్శనానికి వీ రేలావస్తారు? స్వబుద్ధిచేత రారు. శ్రీరాజావారు మాత్రం రావలసిందని యేలా కోరుతారు? అప్పటి రాజులంటే వర్ణాశ్రమాచారాలను పరిపాలించడానికి బద్ధకంకణులుకదా? ఆరాజావారిరోజులలో మనగవర్నమెంటు యింత కట్టుదిట్టంలో లేకపోయినా కొంతేనా వ్యాపకంలో లేకపోలేదు. గవర్నమెంటు అధికారాలలో యేకొంచెమో తప్ప "నాన్‌బ్రాహ్మిన్సు" ప్రసక్తి లేదు. గొప్పగొప్పపదవులలో యేచిన్నపరీక్షలో ప్యాసయిన బ్రాహ్మణులే వుండేవారు. అప్పటికి ప్లీడర్ల ఆర్గుమెంటునుగూర్చి యిప్పటికిన్నీ కొంతలు వేళాకోళంగా చెప్పుకుంటూవుంటారు. కోర్టుమునసబుగారు మీ ఆర్గుమెంటు చెప్పండనేసరికి, యెవరో పక్కాలంకాయనట, పేరు జ్ఞాపకంలేదు. "నేను చాలా పెద్దకుటుంబీకుడను, పేటే పనవిచేసేదేమిటి? యీ కేసు కోర్టువారు నాకు వ్యతిరేకంగా చేస్తే నాదగ్గిరికి మరోకేసు రాదు, కాబట్టి అనుగ్రహించవలసిందని మీ ఘనతనుగూర్చి మిక్కిలిప్రార్థిస్తాను." అనిచెప్పేవారట! అట్టిస్థితిలో బ్రాహ్మణ ప్లీడర్లే వుండేరోజుల్లో "నాన్‌బ్రాహ్మిన్సు"కు చదువసందెక్కడ? ఉద్యోగాలెక్కడ? యెవరేనా ఒక వుద్యోగి వారిలోవుంటే జమీందార్లకు—అందులో క్షత్రియ వెలమ యీ జాతి జమీందార్లకు—వారికి దర్శనమివ్వడానికిన్నీగాని వారితో మాట్లాడటానికిగాని, దొత్తిగా ప్రాణసం

కటంగావుండేవంట. దీనికిసంబంధించిన గాథలు పిఠాపురం సంస్థానానికి చెందినవే చాలా వున్నాయి. వాట్లనుగూర్చి మరొకప్పుడు మాట్లాడుకొందాం. అప్పటి జమీందార్లకేమి ప్రజలకేమి వర్ణాశ్రమాచారాల విషయమై మిక్కిలి పట్టుదల వుండేదన్నది ప్రస్తుతం.

—• గజానికి గజమున్నర లెక్క •—

ఆ కారణంచేత శ్రీ పాపయ్యశాస్త్రుల్లుగారు జియ్యంగారి దర్శనానికి వెళ్ళావెళ్ళరు, వారిని శ్రీ రాజావారు రమ్మని అనాఅనరు. కాని ప్రస్తుతం అలా జరుగలేదు. దీనిలో మహాపాతక మేముందనే తాత్పర్యంతో, "మహా పండితులుగదా శాస్త్రుల్లుగా''రని ఆలోచించి, అయినా యేమంటారో చూతామని రాజావారు 'శాస్త్రుల్లుగారూ జియ్యంగారి దర్శనానికి మాతో తాము దయచేయడాని కేమైనా అభ్యంతరం వుంటుందా?' అన్నారట, విలాసంగా. దానిమీద పాపయ్యశాస్త్రుల్లుగారికి పచ్చివెలక్కాయ గొంతుకలో పడ్డట్టయింది పాపం! యేమంటే, నిన్నగాక మొన్న శ్రీ రాజావారిచే స్వయముగా "మీరు మా యెస్టేటులో యెక్కడ యెంతభూమి కావాలో కోరుకోవలసిం''దని కోరుకోబడి, "నె 1 కి ఒకపుట్టి భూమి చొప్పున వుంటే చాలును'' అనగా పుట్టి అంటే మా వైపున 8 యకరాలు కనుక "సంవత్సర గ్రాసానికి 12 పుట్ల భూమి 96 యెకరాలు యిప్పించవలసిం''దని కోరుకొని ఆ భూమి వారి స్వగ్రామానికి సమీపంలోవున్న కానపల్లె లంకలో పుచ్చుకొని వున్నారాయె. ఆ పుచ్చుకోవడంలో తాణాదారుగారిని, పాండిత్యం చేతనే అనుకోండి, లోపుచేసుకొని 12 పుట్లకు వద్దెనిమిది పుట్లుకూడా కొల్పించుకొని వున్నారు పాపయ్యశాస్త్రుల్లుగారు. యీ మోసము రాజావారి కేలాగో తెలిసి ఆ తాణేదారుని బరతరఫు చేశారు కూడాను. ఆ సంగతి పాపయ్య శాస్త్రుల్లుగారికి తెలిసి మళ్ళా రాజావారి దర్శనానికి వెళ్ళి తాము మారు మొన్న దయచేయించిన భూమిని మళ్ళా మీరే స్వీకరించవలసింది మాకు సుతరామున్నూ అది అక్కరలేదన్నారట పాపయ్యశాస్త్రుల్లుగారు! దానిమీద రాజావారు "ఇదేమి శాస్త్రుల్లుగారు! యిలా సెలవిస్తూ వున్నారు. మేము మీయెడలచేసిన మహాపరాధమేమిటో దాన్నివ్యక్తీకరిస్తే

ములు కూడా తమాషాచేసి చెప్పారు ధర్మరాజుతో. అయితే పాపయ్య శాస్త్రుల్లుగారు మహోదాత్తులు. తుదకు వెళ్ళకుండా చమత్కారంగా తప్పించుకున్నారని వినికి. యేంచేశారంటే :—అయ్యా మా స్మార్తమతం సర్వమతాలని సహిస్తుంది. వానమామలస్వామి దర్శనానికి రావడం నాకు లేశమున్నూ బాధకంకాదు. కాని నన్నుచూడడం వారికి బాధకంగా వుంటుంది. విభూతి రుద్రాక్షధారణతో వున్నవారిని సామాన్యంగా శ్రీవైష్ణవులే చూడడానికి సంశయిస్తారు. అందులో వారు గురుపీఠంగదా ? అట్టివారు సంశయించకుండా వుంటారా ? వకవేళ తమతోవచ్చిన హేతువుచేత యేలాగో స్వామి సహించి పూనుకొన్నా శిష్యులవల్ల మున్ముందేనా వారికి ఆక్షేపణ కలుగడం తప్పదు. అనేటప్పటికి రాజావారు వారివాక్యప్రజ్ఞకు సంతోషించివారిని వెంటబెట్టుకొనివెళ్ళకుండానే గురువులవారి దర్శనానికి దయచేశారుట.

స్వామి కొలత సంపర్కములో దేవమాన మనుష్యమానాల విషయం యెట్లావున్నా అప్పటికాలపు రాజుల సౌశీల్యాన్ని మనం ముఖ్యంగా గమనించాలి. అంతేకాక, పాండిత్యంలో యెంతగొప్పతనమున్నా ఛాందసత్వం కొంత దురాశ కలిగించకమానదనికూడా అనుకోకతప్పదనుకొంటాను. ఆ దురాశవల్ల అవమానం పొందకపోవడమున్నూ పయిగా తమ వాక్యప్రజ్ఞచేత రాములరించనకమే రాకుండా తమతోపాటు వాటితోదర్శనంగా ప్రవర్తించిన (పాలెమ్ముల-రాజు) రాజావారుగారినికూడా తరించచేసుడం వగైరా పాపయ్యశాస్త్రుల్లుగారి ప్రజ్ఞావిశేషానికి వుదాహరణంగా మనం గ్రహించవచ్చును. ఆయన గనక సరిపోయింది కాని యిదే మరో పండితుడికి తటస్థిస్తే రాజావారు మంచివారుకనక శాస్త్రుల్లువారికివస్తేతే 18పుట్ల భూమిచ్చి వచ్చేదేమోకాని రాజావారుగారికి వుద్యోగంపోయేది "ఆన్నె చుంటి" సిద్ధమయ్యేది.

—• రామకవిచాటుధార •—

ఈ వంశంరాజుగారి పుట్టుపూర్వోత్తరాలు, అనగా వారం పదిహేను రోజులలో స్వగ్రామానికి వెళదామనగా నేను వీరిని చూడడం తటస్థించింది. వీరివల్ల ఆరోజున శ్రీ శిష్టు కృష్ణమూర్తిగారికి సంబంధించినవిన్నీ,

యీ రామకవిగారే. పిండిప్రోలు లక్ష్మణ కవిగారు మొదలయిన వారు యీ మరనా రామకవిగారిని వేములవాడ భీమకవిగారితోపాటు గౌరవించి వున్నారు. "తుంగపటూరిళ్ళ రాకాసు లుండవచ్చు" అన్నది కూడా యీ రామకవిగారే. యీయనవాక్కు మంచినిగాని చెడ్డనుగాని సాధించడంలో పేరుపడింది. మంచివిషయమైన గాథలున్నట్టులేదు. చెడ్డ లెక్కువున్నాయి. వాట్లను వుదాహరించడాని కీవ్యాసం పుట్టలేదు కనుక స్పృశించి వదలు తున్నాను. యిట్టికవులెవరో కొందరున్నారని ప్రతికవి కవిత్వాన్నిబట్టి యీనాటి మంచిచెడ్డలు జరుగుతాయని విమర్శించే నేటి విమర్శకులధోరణి శోచ్యము. దీన్నిగురించి నేటరేపటో గొంత ప్రసక్తి కలిగితే కలుగుతుం దని కొంచెం వాసనగొట్టడంచేత యింతదాకా ప్రస్తావించాను.

## —• గురువులవారి శిష్యవిత్తాపహారిత్వం •—

శ్రీరాజావారిని గురువుగారి దర్శనానికి పంపించివుంది కథాసరస్వతి. యింక అక్కడ జరిగిన సంగతి సందర్భాలు వ్రాయాలి. యేముంది, 'కష్టేఫల—కొట్టేఁడు' అన్నమోస్తరుగా వ్రాస్తే యిదిపటికే ముగింపయేది. మధ్యమధ్య యితరప్రసంగాలవల్ల కొంత పెరిగింది. కానివ్వండి. గురువులవారికి పాదపూజ ఒక లక్షకు తక్కువ స్వీకరించడానికి సంకల్పం లేకపోయింది. రాజావారో? యేభై వేలకుమించి యిచ్చేసంకల్పం లేకపోయింది. వారికీ వీరికీ కొంతవఱకు మృదువుగానే కొంత చర్చ జరిగి వుంటుంది. శ్రీ రాజావారు గురువులవారి "శిష్యవిత్తాపహారిత్వం" బాగా వినిపెట్టారు. "శిష్యవిత్తాపహారులు" వీరు లేకమున్నా రారనుకున్నారు. యిట్టివారిని మనం పిలిపించడమే ప్రథమ తప్పిద మనుకొన్నారు. యేభై వేలుకూడా ఆయన అంగీకరించినప్పటికీ ఇవ్వడం దుర్వ్యయమే అనుకు న్నారు. యీ దుర్వ్యయం లేకుండా చేసినందుకు గురుపీఠంవారు అభిసంధ్య లనుకొన్నారు. యేమనుకొన్నప్పటికీ గురుత్వం వదులుకోడానికి వీలులేదే! దానిలో యివేమైనా స్వార్థగురుత్వాలా? 'అర్థం ప్రాణం ఆచార్యాధీనం' అనే తరగతిలోవి కదా?

రుండేవారట: శ్రీవారున్నూ యీ శాస్త్రుల్లుగారున్నూ సహాధ్యాయులని వినడం. యే చదువు సందర్భంలోనో తెలిసీలు తెలియదుగాని బహుశః కావ్యపాఠ సందర్భంలో అయి వుండాలి. రాజావారు యెవరేనా పండితులు వస్తే వారితో ధారాళంగా సంస్కృతమే మాట్లాడేవారని వినికి. ఆ కారణంచేత వారు బాల్యంలో సంస్కృతభాష అభ్యసించి వుండాలి. ఆ సందర్భంలో యీయన రాజావారికి సహాధ్యాయులో సతీర్థులో అయివుండాలి. ఆ చనువుచేత అంతరంగికులుగా వుండడమే కాకుండా యీయన రాజబంధువులకేమి పండితులకేమి యెందరికో రాజావారిచేత యెన్నో వుపకారాలు చేయించినట్లు వినికి. అంత చనువుండడంవల్ల నిర్భయంగా మాట్లాడుతూ వుండడం వుండేదేమో. దానిలో యేం పొరపాటొచ్చిందో ఒకపర్యాయం కాబోలును రాజుగారి కత్తికి శాస్త్రుల్లుగారి జుట్టుపిలక పనిచెప్పినట్లు వింటాము. ఆపిమ్మట కూడా వారిద్దరికీవున్న బాల్యమైత్రికి లోటులేకుండానే జరిగినట్టున్నూ వింటాము ఆ కారణంచేతనే ఆ శాస్త్రుల్లుగారెప్పుడో మళ్ళా రాజాగారు కులాసాగా మాట్లాడుతూవున్న సందర్భంలో యీ జుట్టుకోత ప్రసంగం వచ్చేటప్పటికి "మహాప్రభో, నా జుట్టు యెంతో అదృష్టం పెట్టిపుట్టిందికనక మీవంటి మహాప్రభువుల కత్తికి యెరయింది" అంటూ యింకా కొంత మోటుగానే మాట్లాడినట్లున్నూ, ఆ యుక్తికి రాజావారు చాలా సంతోషించినట్లున్నూ కూడా వినికి.

— ఎ ర ర మ్మ స రీ సు డు —

ప్రసక్తానుప్రసక్తంగా జుట్టుకోత ప్రకరణంలోకి దిగాంగనుక యీ ప్రకరణం తరువాయికూడా యేకరు పెట్టేసే ప్రధానాంశంలోకి వస్తాను. గృహస్థులలో శ్రీ రాజావారికి మిక్కిలి ప్రేమపాత్రులైన సంపన్న గృహస్థు వక రమ్మసరీసుని జుట్టుకూడా యీ అదృష్టం పట్టించుట. కాని వెంటనే నలభైవేల రూపాయల సంచులను యేనుగుమీంచ వేసికాని రాజావారు ఆ ఆసామీని గౌరవించడానికి స్వయంగా మిరపరివారంతో వస్తూను సహితంగా ఆయన గ్రామానికి దయచేసినట్టున్నూ, ఆ రమ్మ సరీ సుని మేనల్లుళ్ళు వగైరా అనుకాయన యెంతచెప్పినా వినక రాజావారిని

నేను కాకినాడలో వక షాహుకారు సందర్భంలో చూచాను. శ్రీ చెలికాని జగన్నాధరాయణింగారు రాజబంధువులు గాని రాజులుకారు. వీరు మా రాజావారి ఆఖరు మామగారు, అనగా యేడోభార్య తండ్రి అన్నమాట. యింకా కొన్ని చుట్టరికాలు వుంటే వుంటా యనుకొందాం, అప్పటికి అమల్లోవున్న చుట్టరికం అది. యీయన వక పెద్ద షాహుకారుని 'నీవు' అని యేకవచనంగా మాట్లాడడం నేను స్వయంగా విన్నదే. అసలు మా రాజావారు యీ షాహుకారు కంటేనేకాదు, యీ దేశంలోవున్న యే షాహుకారుకంటే కూడా చాలా గొప్పగా వుండి పేరుప్రతిష్ఠలు గడించిన షాహుకారినే నువ్వనే వారని విన్నాను. ఆ జమీందార్లకాలం వేరు, యీ జమీందార్ల కాలం వేఱు. వీరు యించుమించు సామాన్యప్రజలుగానే మారిపోవలసి వచ్చింది యీ గవర్నమెంటు ప్రభుత్వంలో కాఁబట్టి యిప్పటి దృష్టితో అప్పటి జమీందార్ల చర్యలుగాని అప్పటి దృష్టితో యిప్పటి జమీందార్ల చర్యలుగాని మనం ముచ్చటించుకొంటే "మేతంపెట్టు" గా వుంటుంది గాని లేశమున్నూ సరిపడదు.

కొన్నిచోట్ల శాస్త్రమర్యాదసు పూర్తిగా అతిక్రమించిన గౌరవాలున్నూ వుండడంచూచాను. యానాంలో దేవాలయంలో తీర్థప్రసాదాలు శూద్రులకిచ్చాక కోమట్లకిచ్చేమర్యాద యెన్నాళ్ళనుంచో వుంది, బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రులుగాని బ్రహ్మక్షత్రియశూద్రవైశ్యులు కాదుగదా? యిది బలాబలాలనిపట్టి జరిగేమర్యాద. దెబ్బకు దెయ్యం జంకుతుంది కదా? శాస్త్రంకూడా యీలాంటి విషయాలలో పనిచేయదు, జంకుతుంది. యిది విషయాంతరం. పూర్వపు జమీందార్ల మర్యాదలూ వేషభాషలూ యిప్పుడు మనం కథలలో చెప్పుకోవలసిందేగాని అనుభవంలో కనపడవనేది యిప్పటి ముఖ్యాంశం.

మా గంగాధరరామారావుగారు సర్వవిధాల పూర్వపు పరగతిలో వారు. స్నానము, వారి కేర్పడ్డరీతిని సంధ్య, జపము, తపము, యివన్నీ నెఱవేర్చుకొనేవారు. యే వర్ణస్థుల నెట్లు గౌరవించాలో అట్లే గౌరవించే వారు. కులాభిమానం యెంతవుండాలో అంతా పూర్తిగా వున్నవారు. పండి

తుల్యం వెంకటపతి రాజుగారి రధిమాసం వుండాలో అంతా సంతృప్తిగా వున్నవారు. చేసేది, యే విషయ మందున్నూ ప్రజలకు లోపమేలేకుండా మన పూర్వులు అనుకున్నట్టు తగ్గకుండా రాజ్యపరిపాలన చేసినవారిని అనుభవజ్ఞులు యిప్పటికీన్నీ చెప్పుకుంటారు.

శ్రీవారు రాజ్యానికి వచ్చిన స్వల్పకాలంలోనో, లేక అంతకు పూర్వమో, కొవ్వూరు గోపాలశాస్త్రుల్లుగారనే విద్యలన్నిటి పారంగతులు కాశీ నుండి దేశానికి వచ్చేసి గోదావరీతీరమనే కారణంచేత పశ్చిమగోదావరీజిల్లా కొవ్వూరులో నివాసం చేశారు. యీ శాస్త్రుల్లుగారికి షట్శాస్త్రాలలో సంపూర్ణ పాండిత్యం అలావుండగా మంత్రశాస్త్రంలో మిక్కిలి పాండిత్యం వున్నట్లు అనేకులవల్ల వినడమే కాకుండా శ్రీ మా గురువులు చర్ల బ్రహ్మయ్య శాస్త్రులవారివల్ల కూడా యెక్కువగా విని వున్నాను. యీ శాస్త్రులవారిని నేను యెరిగే కాలానికప్పుడే స్వర్గతులైనారు. కాని వీరిముఖ్యశిష్యులలో వకరైన శ్రీ అద్దేపల్లి కృష్ణశాస్త్రుల్లుగారిని నేను చాలాసార్లు సందర్శించి వున్నాను. వీరికికూడా మంత్రశాస్త్రంలో యెక్కువ ప్రజ్ఞవుందని సర్వులు చెప్పుకోవడం కలదు. గురువుగారిప్రజ్ఞ యేలాటిదో మంత్రశాస్త్రంలో, శిష్యులు కృష్ణశాస్త్రుల్లుగారి ప్రజ్ఞకూడా అట్టిదే అని వినికి. గురువుగారి ప్రజ్ఞావిషయం యీ దేశంలోనే కాదు - కాశీలోకూడా చాలా గొప్పగా చెప్పుకోవడం నేను స్వయంగా కాశీలోనే వినివున్నాను. వీరిప్రజ్ఞనుబట్టే వీరికి శ్రీ విజయనగరం సంస్థానంవారు దేవిడీమన్నా చేసినట్లు కూడా మా గురువులు చెప్పఁగా వినివున్నాను.

శ్రీ విజయనగరం ప్రభువు శ్రీ విజయరామగజపతిమహారాజులుం గారు విజయనగరాన్ని సర్వవిధాల కాశీగా మార్చవలెననే వుద్దేశం కలవారని వింటాను. ఆ కారణంచేత ఆ కాశీలో ప్రసిద్ధులైన పండితులను రప్పించి తమ సంస్థానంలో వారివారికి తగిన సమ్మానాలేర్పరచి గౌరవిస్తూండేవారనిన్నీ, అందులో యీగోపాలశాస్త్రుల్లుగారొకరనిన్నీ, యీ శాస్త్రుల్లుగారియందు ప్రభువు చూపించే గౌరవాతిశయం మిక్కిలీ యెక్కువగా వుండడంచేత తక్కిన పండితులు దాన్నిచూచి సహించలేకపోయా

రనిన్నీ. ఆకారణంచేత యీ మహావిద్వాంసుఁడికి ఆ సంస్థానాన్నుంచి "యేలాగరా ? వుద్వాసన చెప్పించడం అని ఆలోచించి ఒకకుట్రపన్ని మహా రాజావారితో యీవిధంగా మనవిచేశారనిన్నీ వినడం. యేలాగంటే "మహాప్రభో ! మన గోపాలశాస్త్రుల్లుగారు యితర శాస్త్రాలలో నిరుపమానమైన పండితులు సరేగదాండి. వీరు మంత్రశాస్త్రంలోకూడా ప్రత్యక్ష దాఖలా చూపించే పండితులని దేవర విన్నారో లేదో అని మనవిచేసుకుంటూ వున్నాము. యెందుకంటే యీలా మనవిచేసుకోవడం : తమ సెలవైతే అలాటి ప్రత్యక్ష దాఖలా వీరు కనుపరుస్తారేమోకాని మాబోంట్లం కోరితే చూపించరు. తమ సన్నిధినివుండి ఆ దాఖల చూదామనే కుతూహలంతో యింతగా మనవిచేసుకోవడం" అంటూ శ్రీ మహారాజావారితో చాలాసార్లు విజ్ఞాపన చేసుకోఁగాచేసుకోఁగా, వకరోజున శ్రీవారు శాస్త్రుల్లుగారిని సగౌరవంగా "శాస్త్రీజీ" అని సంబోధించి "మీమంత్రశాస్త్ర దాఖలా వకపర్యాయం మాకు చూపించాలి" అని కోరేరఁట. దానిమీద శాస్త్రుల్లుగారు "యివి పరీక్షించతగ్గ విషయాలు కావు – నవగోప్యాని కారయేత్ అనే తెగలోవి" అంటూ మనవిచేసుకోవడమైతే జరిగిందిగాని రాజుగారు యేమైనాసరే చూచి తీరాలని పట్టుపట్టినాఁరట. "అలాగయితే చిత్తం రేపు మా జపం అయేటప్పటికి వక నిమ్మకాయంత బంగారాన్ని నపి రాపి రేని ముద్దగా వున్నదాన్ని సిద్ధంచేసి వుంచండి" అని శాస్త్రుల్లుగారు రాజాగారితో మనవిచేసి ఆజ్ఞ తీసుకుని స్వగృహానికి దయచేశారఁట. అయితే శాస్త్రుల్లుగారు పూరికే పరీక్ష చూపడమే అనుకున్నారు కాని దీనిలో యేదో పండితులు పన్నిన కుతంత్రం వుందని లేశమున్నా యెఱుగరు. ప్రమసంతెరసంతే గుర్తించలేదు. ఆ తంత్రం యేమిటో ముందు తెలుతుంది కాబట్టి యిక్కడ విస్తరించేదిలేదు.

ఆ కేరేతిని బంగారం సిద్ధంచేయించారు మహారాజావారు. పండితులందరితోటి పరివేష్టించఁబడి చూస్తూ వున్నారు. ఆ సమయంలో టకాటుకామంటూ పాంకోళ్ళచప్పుడుతో శాస్త్రుల్లుగారు చిన్న జారీ చెంబు సహితంగా దయచేసి ఆబంగారు ఘటికమీఁద ఆజారీచెంబులోవున్న వుదకం

అభిమతప్రకారం గోప్పాదక్షేత్రమైన కొప్పూరులో శాస్త్రుల్లుగారు నిత్య నివాసం యేర్పఱచుకున్నారు. యీ కారణంచేతనే గోపాలశాస్త్రుల్లుగారి యింటిపేరు కొప్పూరువారుగా మారింది. కాని అసలు యింటిపేరు యిదికాదు. ఆపేరు నాకిప్పుడు జ్ఞాపకం వచ్చిందికాదు. వ్రాసే విషయం శ్రీ పిఠాపుర ప్రభువు నాయకమణిగా వుండేది — వ్రాఁత విస్తరించి విజయనగరం మహారాజావారిమీదికిన్నీ అక్కడి పండితులమీఁదకిన్నీ పొర్లుతూవుంది అని చదువరు లనుకుంటారేమో. ప్రస్తుత కథలో శ్రీ పిఠాపుర ప్రభువుతోపాటు యీ గోపాలశాస్త్రుల్లుగారుకూడా ముఖ్య నాయకులే కావడంచేత వీరిని గురించి కొంత సంగ్రహంగా వ్రాశానను కొండి. విస్తరించే వ్రాసే యెడల యెంతేనా యీ శాస్త్రుల్లుగారిని గురించే కాదు — వీరిని సమ్మానించిన శ్రీ విజయనగర ప్రభువును గురించేకాదు — వ్రాయవలసే వుంటుంది. వోపిక వుంటే మరొకప్పుడు ఆ ప్రయత్నం చేస్తాను.

యీలాగు కారణాంతరాలవల్ల దేవిడీమన్నా అయిన్నీ వారి వంశ పారంపర్యాయంగా పోషింపఁబడుతూ దర్శనం మాత్రం లేకుండావున్న పండితాఖండలులు మఱికొందఱు విజయనగర సంస్థానానికి సంబంధించిన వారు వున్నారు. వారిలో శ్రీ భాగవతుల హరిశాస్త్రుల్లుగారు వకరు. వీరు శ్రీ కోటిపల్లెలో నిత్యనివాసంగా వుండేవారు. యిప్పుడీ దేశంలో వైయాకరణులంటూ శేషం యేమాత్రమేనా వున్నట్టయితే అది యావత్తున్నూ వీరి విద్యావంశమే అనడంలో లేశమున్నూ అతిశయోక్తి వుండదు. యెనభై సంవత్సరాలకు మించిన వయస్సులో వీరి దర్శనం నేను చేసి వున్నాను. వీరున్న సభలో అవధానంకూడా చేయడం తటస్థించింది. ఆ సభలో వీరినిగూర్చి రచించినదే యీ శ్లోకం—

శ్లో. శ్రీమద్భాగవతాన్వయాంబుధి విధూరాజత్కలాపాలకః
పాణిన్యుక్తసుదర్శనశ్చ విబుధారాధ్యాంఘ్రియుగ్మాంబుజః
సత్యాసక్తహృదంతరో నిరుపమ శ్చానంతగోవర్ధనః
పాయా దేష హరి ర్యథా తవ హరిస్సర్వాఘ విధ్వంసకః ।

ఈశ్లోకంలో శ్రీకృష్ణునియందు మాతిశాస్త్రుల్లుగారికున్న విశేషణాలు సమంగా అన్వయించుకోవాలి. యీలాంటి మహాపండితులు యెందరో వుండే ఆ కాలం యిక మనకు రాదనుకుంటాను. దానికి ముఖ్యకారణం నూటికి ముప్పైఅయిదో నలభయ్యో మార్కులతో శిరోమణులూ ఉరోమణులూ బయలుదేరడానికి అవకాశంకూడా యేర్పడ్డది. వెనకటివాళ్ళ పాండిత్యాలంటే యేలాటి దీక్షతో సంపాదించుకొన్నవో ఒక వుదాహరణ మచ్చుకు యిక్కడ చూపిస్తాను, పరిశీలించండి.

ముంగండ కాపురస్థులు శ్రీ పుల్లెల దక్షిణామూర్తిశాస్త్రుల్లుగారు కాశీలో శ్రీ జాగేశపండిట్జీవారివద్ద చిరకాలం విద్యాభ్యాసంచేసి గృహస్థాశ్రమాని కభిముఖులై వస్తూ వస్తూ తోవలో కొన్ని సంస్థానాలలో పాండిత్య ప్రకటనం చేసుకొంటూ మాడుగుల ప్రభువు కృష్ణభూపతి దర్శనానికేమో వెళ్ళారుట. అక్కడ శాస్త్రమంతా సంధ్యావందనప్రాయంగా కంఠ పాఠముగానున్న శ్రీ యింద్రగంటి గోపాలశాస్త్రుల్లు గారితో వాదించవలసి ఎక్కడో ఓడు పట్టించుకోవలసివచ్చి దానితో మళ్ళా వెనక్కి తిరిగి కాశీ వెళ్ళి పదిపండ్రెండు సంవత్సరాలు కృషిచేసి గోపాలశాస్త్రుల్లు గారిని జయించే తలంపుతో మాడుగుల సంస్థానానికి వచ్చారనిన్ని, అప్పటికి సదరు గోపాలశాస్త్రుల్లుగారు స్వర్గస్థులవడంచేత "అయ్యో మనకోరిక తీరకపోయెనే" అని దక్షిణామూర్తిశాస్త్రుల్లుగారు విచారించారనిన్ని వినికి. ఆయీ కథలవల్ల అప్పటి పాండిత్యాలకున్నూ యిప్పటి పాండిత్యాలకున్నూ వుండే తారతమ్యాలు తెలుస్తాయని కొంచెం వుదాహరించాను.

ప్రస్తుతం కథానాయకులలో ఒకరైన గోపాలశాస్త్రుల్లుగారు చాలా గొప్పవారని విని మన పిఠాపురం రాజావారు వీరికిన్నీ సుబ్బాత్రియంలో వకరైన శ్రీ తణికెళ్ళ సుబ్బన్నశాస్త్రుల్లుగారికిన్నీ శాస్త్రార్థంపెట్టి జయాపజయాలు చూద్దామనే కుతూహలంతో సబహుమానంగా రప్పించారుట. సుబ్బాత్రయమంటూ వకమాట వ్రాసివున్నాను. నవద్వీపాన్నుంచి తర్కం చదువుకొని వచ్చినవారిలో ముగ్గురుపండితులు మన తెలుగుదేశపువారు

సుబ్బన్న, లేక, సుబ్బయ్య అనేపేరుగలవా రుండేవారనిన్నీ యెవరేనా తర్కంలో పేరుతెచ్చుకోవాలంటే యీత్రయాన్ని సందర్శించి వీరిమెప్పును పొందాలనిన్నీ గురువుగారు చెప్పఁగా విన్నాను. యీత్రియంలో వకరు పాణికెళ్ళవారు, రెండు—అక్షతలవారు, మూఁడు—యెవరోగాని వారి యింటి పేరు జ్ఞాపకం వచ్చిందికాదు. యీత్రియంలో వకరు శ్రీగద్వాల సంస్థాన పండితులు అయ్యవారిపల్లెలో కృష్ణాతీరాన్ని వుండేవారు. తక్కిన యిద్ద రున్నూ బహుశః యీ మన కృష్ణాగోదావరీ తీరాలలోనే యేవోగ్రామాల్లో వుండేవారు — నాకు తపిసీలు తెలియదు. యిందులో ప్రస్తుతం గోపాల శాస్త్రిల్లుగారితో వాదం పెట్టఁదలచుకొని శ్రీ పిఠాపురంరాజావారు ఆహ్వా నించిన సుబ్బన్న శాస్త్రుల్లుగారి శిష్యులు యించుమించు మా పరమగురువులు చర్ల బ్రహ్మయ్యశాస్త్రిల వారికి సమకాలికులు. వీరు కిర్లంపూడిసంస్థా నమునకు సమీపంలోవున్న ధర్మవరంలో శ్రీ బుచ్చి సీతాయమ్మగారు స్థాపించిన ధర్మపాఠశాలలో వుపాధ్యాయులుగా వుండి యెంతమందినో విద్వాంసులను చేసిన మహావిద్వాంసులు. మావిద్యార్థిదశనాఁటికి యీలాటి పాఠశాలలున్నూ యీ విద్యార్థులపోషణకుగా యేర్పడ్డ ధర్మసత్రాలున్నూ కొన్ని వుండేవి. చదువుకోవడంవల్ల యేవో సంపాదన మనకు అవుతుం దనే వుద్దేశంతో చదువుకునే విద్యార్థులు వున్నట్లు నేను లేశమున్నూ యెరు గను. చదువుకోవడం మనకు విధి అనే వుద్దేశంతోనే అప్పుడు చదువుకొనే వారు. "బ్రాహ్మణేన నిష్కారణో ధర్మష్షడంగో వేదోఽధ్యేయో జ్ఞేయ శ్చ" అనే శ్రుతికి వుదాహరణంగా వుండేది అప్పటివాళ్ళ చదువు. డిగ్రీల లెక్క జ్వరం వచ్చినప్పుడుకూడా అప్పుడు లేనేలేదు. అట్టి స్థితిలో చదువు లెక్కేమనుండి వస్తుంది? యీ డిగ్రీలనుగూర్చి నా యిటీవలిచర్యలో కొంత వ్రాసివున్నాను—అందులోనుంచి వకపద్యం వుదాహరిస్తాను.

తే. గీ. "ఇంగిలీషు"తో పాటుగా నిపుడు సంస్కృ
తమ్మునకుఁగూడ "డిగ్రీల" తంపి వచ్చె
నట్లు "ప్యాసు" నగువారలయం దెవండొ
లెక్కఁ దక్కినవారు శుద్ధజడమతులె.

గారో అని గుఱువుగారు చెప్పారు. వీరుకూడా కాశీపండితులే. యిక రేపో యెల్లుండో శాస్త్రార్థపుసభ జరుగుతుందనఁగా సుబ్బన్న శాస్త్రుల్లుగారు శ్రీ రాజావారితో "మహాప్రభూ? నాతోటి తర్కంలో పూర్వపక్షసిద్ధాంతాలు చేసేవారు యీ దేశంలో మాత్రయంలోతప్ప మఱొక్కరులేరు. యిది చెప్పక తప్పనివిధిచే మనవి చేసుకుంటున్నాను. కాఁబట్టి ఆత్మస్తవంగా దాము అభిప్రాయపడకూడదు. గోపాల శాస్త్రుల్లుగారు ఆఱుశాస్త్రాల్లో పండితులు. నేను ఒక్క తర్కంలోమాత్రమే పండితుణ్ణి. నాకున్నా ఆయనకిన్నీ ఈ తర్కంలో ఏతంపెట్టుగా వుంటుంది. పోనీ దేవరవారి వినోదానికి అంగీకరించి కూచుందామంటే; గోపాలశాస్త్రుల్లుగారు ఆఱు శాస్త్రాలలో పాండిత్యం అలావుండఁగా మంత్రశాస్త్రంలో అఖండులు. వోటు వచ్చిందంటే ఆయన వూరుకోరు. కాబట్టి మనవి చేసుకున్నాను" అనేటప్పటికి రాజావారు "అలాటిభయం మీరు లేశమున్నూ పడనక్కఱలేదు. యిదివినోదార్థం జరిగే సభగాని మఱివక మోస్తరుదికాదు. యీ విషయమై వారితో మేము మాట్లాడుతాము, తాము లేశమున్నూ జంకవలసిందిలే" దంటూ ధైర్యం చెప్పారఁట. కాని ఎంత ధైర్యం చెప్పినా సదరు గోపాల శాస్త్రుల్లుగారి మంత్రశాస్త్ర పాండిత్యం సుబ్బన్నశాస్త్రుల్లుగారికి వినికివల్ల పూర్తిగా తెలిసివుండడంచేత గుండెలు తటతట కొట్టుకోవడంమాత్రం మానలేదు. 'అయితే వాదం మానుకోరాదా?' అంటే: కారణాంతరంచేత మానుకున్నప్పటికీ అసలు పాండిత్యంలోనే లోటుండి మానుకున్నట్టు లోకం భావిస్తుందికదా! అందుచేత—"యశోవామృత్యుర్వా" అని అంగీకరించక తప్పిందికాదు. పైఁగా రాజావారు సెలవిచ్చారఁట: "ఏదేనా మీరు చిక్కు తటస్థించే యెడల తరతరాలవఱకున్నూ మీకుటుంబాన్ని పోషించేభారం మామీఁద వుంచుకొంటిమి" అన్నారట. అయితే రాజావారికి మంత్రశాస్త్రంలో పూర్తిగా నమ్మకం వున్నప్పటికీ "గోపాలశాస్త్రుల్లుగారి వల్ల సుబ్బన్న శాస్త్రుల్లుగారికి అపకారం జరుగుతుం" దనిమాత్రం లేశమున్నూ అనుమానం లేదనుకోవాలి మనం. అనుమానమేవుంటే; వారికీ వీరికీ వాదం పెట్టకుండానే వుంచేవారేమో. రాజావారికి మంత్రశాస్త్రంలో

పూర్తిగా నమ్మకక్షీణించుకోవడానికి శ్రీయుతులు రామస్వామిశాస్త్రులుగారి మా గ్రామ సమీపంలో వేలుపాడు గ్రామంలో యిచ్చిన వస్త్రయుగమున్ను భూదానమే, ఆనగా నూట పందొమ్మిది ఎకరాలే సాక్ష్యమిస్తాయి. ఆభూమి యిప్పటికిన్నీ వారికి అవ్యాహతంగా జరుగుతూ వుంది. ఆభూదానం యెందుకు జరిగిందో వ్రాస్తే చాలా పెరుగుతుంది.

ఇంకొకటికూడా శాశ్వతంగాక పరంపరగా సాక్ష్యమిచ్చేది యీలాంటి భూదానమే వుంది. విజయనగరపు సంస్థానంలో అలమండపురం లోనో అను కుంటాను. ఒకగ్రహం కామినీతరగతికి చెందినది పట్టుకొని పీడిస్తూవుం డఁట. యిక్కడకూడా కొంచెం వ్రాయాలి. మనుష్య వ్యక్తులో స్త్రీపురుషు లు వగయిరా తరగతులలాగే గ్రహాలకికూడా తరగతులున్నాయి. స్త్రీ గ్రహాలలో "కామిని" తరగతికి చెందినదంటే చాలా గట్టి. పురుష గ్రహాల్లో "బ్రహ్మరక్షస్సు" గట్టి. యీ గ్రహాలు యేలాటి మంత్రశాస్త్ర వేత్తలకున్నూ లొంగవు. వాట్లకు యేదో యితరజన్మం రావడానికి తగ్గంత తపస్సు ధారపోస్తే వదలిపోతాయని వినడం. సామాన్యగ్రహాలు చేసే చేష్టలకన్న యీ కామినీగ్రహాలుచేసే చేష్టలు అద్భుతంగావుంటాయి. యేమనిషిని యీ కామినీ పట్టుకుంటుందో ఆ మనిషిని తీసుకుపోయి అది విలోవుండే అతి గహనమైన వెదురుడొంకలు వగయిరా గహనప్రదేశాలలో పెట్టడం కూడా తటస్థించడం చెప్పఁగా విన్నాను. ఇంతెందుకూ కాదుగాని, ఒక కామినీగ్రహం చేసేచేష్టలు ముప్పదియేండ్లకుపూర్వం నేనున్నూ కళ్ళారా చూచివున్నాను. ప్రస్తుతం వినండి. ఆ గ్రహాన్ని వదిల్చడానికి కొదవేమిటి? "రాజు తలచుకుంటే" యేంలోపం కనుక పెద్దపెద్ద మంత్రగాళ్ళంతావచ్చారు. కొందఱు గ్రహంచేత చెంపకాయలు తినడం కూడా తటస్థించింది. మహారాజావారికి యేమీ తోఁచడంలేదు. అట్టిస్థితిలో ఆగ్రహానికే యేంతోఁచిందో?...."రాజా! యీలాచూడు" మని పిల్చి, "యీమంత్రగాళ్ళు నన్ను వదిల్పించ లేరు గాని నీకో వుపాయం చెపుతాను. ఆలా చేయఁగలవా?" అందఁట. చెప్పవలసిందన్నారఁట రాజాగారు. "అయితే విను. శ్రీ అజ్జాడ అన్నంభొట్లుగారు ఒకరోజురాత్రి రెండు జా

ములవేళ వక మాలవాడికిచేసిన అన్నదానఫలితాన్ని నీవు ధారపోయిస్తే నాకు దానివల్ల మంచిజన్మ వస్తుంది. తద్వారాగా నాబాధ మీకు తప్పుతుంది. అని చెప్పిందఁట. అప్పుడు ఆ ప్రభువు అజ్ఞాత అగ్రహారం తమ సంస్థానంలోచే కనక, ఆ అన్నంభొట్లుగారిని సగౌరవంగా ఆహ్వానించి "అయ్యా తమవల్ల మాకీవుపకారం కావా" లంటూ ప్రార్థించారఁట: దానిమీఁద "అయ్యా నేను నా కర్తవ్యాన్ని నెఱవేర్చుకున్నానేకాని దాన్ని మళ్ళా వకరికివిక్రయించే తలఁపుతో గాని దానఁచేసే తలఁపుతోఁగాని చేయలే" దన్నారఁట. రాజావారు మిక్కిలి దీనంగా ప్రార్థించారఁట. దానిమీఁద యేమీ ప్రతి చెప్పలేక ఆ పుణ్యాన్ని ధారపోశారఁట. అంతతో ఆబాధ నివర్తించిందట.

అయితే రాత్రి రెండుజాములవేళ వక మాలవాడికి పెట్టిన పుణ్యానికి అంతవిలువ యెందువల్ల కలిగిందో కొంత వ్యాఖ్యానం చేయాలి. తూర్పున కొండయేళ్ళు చాలావుఁటాయి. అవి వర్షాకాలంలో అంతట్లో ప్రపంచమంతా ముంచేటట్టు పొంగడమున్నూ, మళ్ళా వెంటనే తుంగడమున్నూ అందయూ యెఱిఁగిందే. ఆలా పొంగే సమయంలో యేదో వూరినుంచి ఒకమాలవాఁడు అజ్ఞాతమార్గంగా వస్తూ వక తిప్పలో చిక్కుకున్నాఁడు. క్రమంగా తిప్ప మునిగింది. వీడుకూడా మునిఁగిపోయే అవస్థ వచ్చిఁది. రెండుజాములరాత్రి అయిఁది. అంతా వఱండి నిద్రపోయేవేళ కనక "మొఱ్ఱో చస్తున్నాను. ఆకలికూడా బాధిస్తూవుంది బాబో" అంటూ గట్టిగా ఆ తిప్పలోనుంచి అఱచాఁడు. మేడమీద పరున్న నిరతాన్నప్రదాత అన్నఁభొట్లుగారు విన్నారు. ఆవట్లాన్ని లేచి సుమారు శేరుంబావు బియ్యం అన్నమున్ను ఆవకాయముక్క వగైరా రసవర్గాయున్నూ మునకాల కట్టు లావువి రెండు పొగచుట్టలున్నూ అవి కాల్చుకోవడానికి వక మొండుగడ్డితో చుట్టి నిప్పంటించిన లావాటి తూట కట్టానున్నూ పట్టుకొని, పాముమీసాన్ని తెగేస్తూవున్న ఆ కొండకాలువను తెప్పమీఁద అడి చినుకూ పొడిచినకూగా వున్న వానలో యీఁదుకొని మళ్ళా మాలాడిని ముట్టుకోకుండానే యీవలివొడ్డు చేర్చడానికి తోవాసం యింకో తెప్పకూడా

క. ఈలోకము యగుఁగొండలు
రాలోకము కొండలును, నిహమ్ము్మను బరమున్
మేలగు గొండలు, కథిపా!
యేలోకము లేమసూచె? యిలగొండలకున్.

మన పూర్వులలో ప్రాజ్ఞుల ధర్మాధర్మాలు సర్వమున్నూ ఈ పద్యార్థంలో యిమిడివున్నాయి.

విషయం విషయాంతరంలో దిగి అంతరిస్తూవుంది. యీ అజ్జాడ అన్నంభొట్లుగారి యశస్సువిని మా రాజావారు పిలిపించి వారిని బలవంత పలచి పిఠాపురం యెస్టేటులో మల్లవరం చెఱువుక్రింద మంచిభూమిని,— యెన్నియకరాలో చెప్పఁజాలను, విస్తారమే వుంటుంది—పరిగ్రహింప చేశారు. నాకు కూడా ఆ చెఱువుకు సంబంధించిన భూమి మంచిదయితే కాదుగాని వూషరక్షేత్రం వుండడంచేత వీరి భూమినిగూర్చి కొంత నాకు తెలుసును. వారి కుటుంబంవారికి యింకా ఆ భూమి జరుగుతూనేవుందని విన్నాను. యిలాటి మంచి పాత్రదానాలు మా రాజాగారు చాలాచేసినట్లు వింటాను. ఆ కాలానికింకా— "యీడిగముత్తికి జోడు శాలువలిస్తి" అనే మాదిరి దానాలు ప్రారంభం కానేలేదు కనుక మా రాజావారు చేశారంటే చేసింపల్లా పాత్రదానంలోకే చేరడం తటస్థించింది. యీ రాజావారి యింకొకదానాన్నిగూర్చి వ్రాసి ప్రధానాంశానికి వస్తాను.

పిఠాపురానికి సమీపంలో, గోరస, కొమరగిరి, అని రెండు గ్రామాలున్నాయి. ఆ గ్రామాల్లోవకదానిలో మద్దూరి దీక్షితులుగారనేవారు వేదాధ్యయనపరులు, నిరతాన్నదాతలు, సప్రతిగ్రహీతలు వకరు వుండేవారు. వారు చాలావృద్ధులై వున్నప్పుడు మా గురువుగారితో వెళ్ళేరోజులలో వారి దర్శనం నేనుకూడా చేసివున్నాను. సదరు దీక్షితులవారి యోగ్యతను శ్రీరాజావారు కూడా విని వారిని ఆహ్వానించి సమ్మానించాలని అనుకోవడం శ్రీ రాజావారి అంతరంగిక స్నేహితులని యిదివరలో మొదటి వ్యాసంలో వ్రాసిన శ్రీపొలకానూరి వేంకటశాస్త్రుల్లుగారు విని వుండడం చేత దీక్షితులవారేదో పనిమీద పిఠాపురం వచ్చినప్పుడు రాజావారి దర్శ

మా జిల్లాలో మా గురువుగారి కాలంలో వుండే పండితులలో, మార్కొండపాడు చతుష్టయం, ర్యాలిషట్కం, లేక బొమ్మగంటిషట్కం, అంటూ కుటుంబపండితులు వుండేవారు. మొదటివారు నలుగురు సోదరులున్నూ వ్యాకరణపండితులే అవడంచేత వారి కాపేరు వచ్చింది. రెండోవారు ఆర్గురున్నూ ఒక టేశాస్త్రమందు కాకపోయినా మొత్తం భిన్న శాస్త్రాలలోనేనా పండితులే అవడంచేత ఆ సోదరులకు ఆపేరు వచ్చింది. ఒకరి నివాసం మార్కొండపాడు, రెండోవారి నివాసం ర్యాలి, యిప్పటికిన్నీ యీ కుటుంబపండితులలో కొందఱు శేషించివున్నారు. వంశంలో కూడా కుటుంబవిద్యను వదలకుండా చదువుకున్నవారేకాక ఉపాధ్యాయత్వాన్ని చేస్తూ పూర్వులపేరు నిలుపుతూవున్న వారున్నూ వున్నారు. యిందులో మార్కొండపాటి చతుష్కం వార్షికం నిమిత్తం శ్రీరాజావారి దర్శనార్థం వెళ్ళారట. మనవిచేయించుకున్న మీఁదటదర్శనం అయింది. సగౌరవంగా కూర్చోపెట్టడం జరిగినతరువాత రాజావారు నవుకరుతో "వారే అక్కడ పదునైనచాకువుంది పట్టుకురా ! పండితులు వచ్చారు" అన్నారఁట. దానితో "మనలో యెవరేమి లోపంచేసి నట్లు శ్రీ వారి నోటీసులోకి యెవరిద్వారా వెళ్లిందో యీవాళ మనకు యేదో అవమానం జరుగుతుందికాబోలును" అని మిక్కిలిగా భయపడ్డారఁట. అదంతా రాజావారుచూచి కొంతసేపు తూష్ణీంభావంగా గంభీరంగా వుండి మళ్ళా నవుకరినిపిల్చి మామిడిపళ్ళు తీసుకు రమ్మన్నారఁట. ఆమాట వినడంతోనే పండితుల ప్రాణాలు కుదుటఁబడ్డాయఁట. "బ్రతుకుజీవుఁడా" అనుకుంటూ గుప్పెట్లోపెట్టుకున్న ప్రాణాలను గుండెల్లోకి చేర్చుకుంటూ వుండఁగా ప్రభువు స్వయంగా ఆ మామిడిపళ్ళు కోసి "పుచ్చుకోండి" అని సెలవిచ్చారఁట. అప్పటిపండితులు యిప్పటి కొందఱు పండితుల్లాగా కవులలాగా — పంచ్లేలనుకోండి (కాఫీ గీఫీ ఉప్మాగిప్మాలు కావేలనుకోండి) — యేబట్టలతోఁ బడితే ఆబట్టలతోడే యెక్కడఁబడితే అక్కడ పుచ్చుకునే ఆచారంలేదు. యిప్పుడో? పెద్ద కర్మనిష్ఠులమనిన్నీ, వైదిక సంప్రదాయం వారమనిన్నీ, పైఁగాయితరులు అనాచారంగా వుంటారనిన్నీ

చెప్పించరదా: "యేమయ్యోయి! నీవేమేనా శ్రీవైష్ణవుఁడవా? రాకపోవ డాని"కంది. కథ కంచికే వెడుతూ వున్నట్లుంది ప్రస్తుతానికి వస్తాను. రాజావారు మామిడి పండ్లు కోసి తినమంటే తినకపోతే ఆ చాకుతో యేం మర్యాద చేస్తారో కదా అని భయం. పోనీ తినేసివేదామంటే తీరా తిన్న తర్వాత "ఏం బ్రాహ్మలయ్యా! యెక్కడపడితే అక్కడే తింటారా?" అని ప్రశ్నిస్తే యేం జవాబు చేప్పేదిరా భగవంతుడా అని సందేహ మాయె. "సేయ ముభయతః పాశారజ్జుః" పుట్టితుదకు రాజావారి వార్షి కంలో ఫలహారాన్నికూడా స్వీకరించి యేలాగో యీవల పడి తల తడివి చూచుకున్నామంటూ మా గురువుగారు బ్రహ్మయశాస్త్రిల వారితో ఆ పండి తులే చెప్పేటప్పుడు విన్నాను. యీ చెప్పడంలో యే స్వల్పమో కల్పితం వుంటే వుండేమోకాని అసలు తమామున్నూ కల్పితంకాదు. ఆరాజావారి లక్షణం కాళిదాసుగారు వర్ణించినట్లు "అధృష్యశ్చాభిగమ్యశ్చ" అనే తర గతిలో వుంటుంది. కాని అభిగమ్యత్వంకన్న అధృష్యత్వమే ప్రధానం. వీరి సన్నిధానంలో వక్క పొక్కునూతి వేంకటశాస్త్రుల్లుగారు వినాగా నిర్భ యంగా మాట్లాడినవారే లేరని నా వినికి.

దండిభట్ల విశ్వనాథశాస్త్రుల్లుగారు వీరి దర్శనానికి వెళ్ళినప్పు డొక చిత్రింజరిగిందట. రాజావారికి సంస్కృతంలో మంచి ప్రతిపాండిత్యం వుఁదని యిదివఱకే వ్రాసివున్నాను. అందుచేత రాజావారు యేలాటి పండి తులు దర్శనానికి వచ్చినా వారితో సంస్కృతభాషతోనే మాట్లాడేఆచారం. ఆ ఆచారాన్నిబట్టి సదరు విశ్వనాథశాస్త్రుల్లుగారితోకూడా సంస్కృతాన్నే ప్రసంగించడానికి ఆరంభించేటప్పటికి ఆతృణీకృత బ్రహ్మపురందరుఁ డన్నాఁ డఁట: "రాజా, నీవు తెలుఁగుతో మాట్లాడితేతప్ప, నీ రాజ్యమంతా నాకు తలకట్టినా నేనిక్కడ నిమిషమేనా వుండేదిలే" దన్నాఁడఁట! దానికి రాజావారు లేశమున్నూ కోపగించుకోక ఆలాగే అంగీకరించి వారిని సమ్మానించి పంపించారని వినికి. విశ్వనాథశాస్త్రుల్లుగారి చర్యలు యీ రాజా వారి చర్యలవలెనే అత్యద్భుతంగా వుంటాయి.

గీ. రాజులచరిత్రలును కవిరాజచరితములును
గ్రంథమ్ములందు వన్నెగలుగఁజేయు;
నందులో నాదుమనమ్మున దరిసిచూడ
కవులకథలకు రాజులకథలు లొచ్చు.

సంస్కృతం మాటలాడడమంటే సామాన్యంగాదు. అబ్బో! దానిలో యెన్నో చిక్కులున్నాయి. ముఖ్యంగా కారకవిషయం, అంటే ఆయావిభక్తులు వాడడం కొంతకష్టం. సమాసవిషయంకూడా కష్టంలోదే. సమాసాంత ప్రత్యయాలవల్ల కలిగే మార్పులు చాలావుంటాయి. అన్నిటి కన్నా ధాతువులు వాడడంలో చిక్కులు చాలా వున్నాయి. సేట్లులనీ అనిట్లులనీన్ని వుంటాయి. ఆ భేదంలో పరిష్కృతులు మహామహా పండితులే తప్పటడుగులు వేస్తారు. ఆత్మనేపదమంటే పరస్మైపదమంటే అలావుండగా ఉభయ పదులైన ధాతువులు కొన్ని వున్నాయి. వీట్లని వాడడానికి లక్షణప్రవర్తకులు కొన్ని నియమాలేర్పాటుచేసివున్నారు. ఆ నియమాలు కాళిదాసాది మహాకవులే పాటించలేక పోయారు. ఆయా విషయమైన రహస్యాలు బాగా తెలియక యిప్పుడు కొందరు వృథాగా కొందరిని ఆక్షేపించడం అలావుండగా అంతో ఇంతో ఆ రహస్యం యెరిగిన వాళ్ళు దీని సందర్భం ఇట్టిదని వక్కాణిస్తే దాన్ని విశ్వసించకపోవడం అల్లావుండగా పైఁగా వక్కాణించిన వాళ్ళకేమీ తెలియనట్లున్నూ తమకేమో తెలిసినట్లున్నూ అపహాస్యంచేస్తూ వ్రాయడానికారంభిస్తారు. ఆ యొక్క విషయం "కాలీన" శబ్దాన్ని గూర్చి వ్రాసేసందర్భంలో అన్యత్ర వ్రాసివున్నాను. కాఁబట్టి యిక్కడ యెత్తేదిలేదు.

రాజావారు సంస్కృతం మాట్లాడుతూవుంటే యేవో లోపాలున్నాయని కదా విశ్వనాథశాస్త్రుల్లుగారు వద్దని నిషేధించింది? రాజుగారికేకాకపోయినా ఇతర పండితులకు కూడా సంస్కృతంలో త్వరగా సంభాషించే సందర్భంలో కొన్ని లోపాలు ఉండితీరతాయి. యీ సంస్కృతాన్ని మెయిల్ట్రైనులాగ నడిపించిందల్లా యేలేశ్వరపు నరసింహ శాస్త్రుల్లుగారు

మూర్చిపే. అయితే వీరి ధోరణిలో దోషాలుండేవికావా అంటారేమో? ఇలాటి శంకకు శ్రీహరిశాస్త్రుల్లుగారేం జవాబు చెప్పేరంటే: ఆమహాధోరణిలో యెక్కడో మనం శంకిద్దామని గొంతుక సవరించుకునేటప్పటికి ఆయనకు కొన్ని పందలో వేలో మాటలు నడిచిపోతాయి. కాఁబట్టి ఆధోరణికి అడ్డు తగలడం శుద్ధ తెలివితక్కువ అని జవాబు చెప్పారఁట. శ్రీబులుసు పాపయ్యశాస్త్రిలవారి ప్రథమపుత్రులు — "పుత్రాదిచ్ఛేత్పరాజయం" అన్నసూక్తిని తండ్రిగారియందు సమన్వయింపఁ జేసిన మహావిద్వాంసులు. ఆ నరసింహశాస్త్రిల్లుగారిలాగ మాట్లాడడాన్ని కొంతవఱకభ్యసించినట్లు వింటాను. కాని కృతికృత్యులయినట్లు వినలేదు. దీన్ని యిక్కడికి ఆపుదాం. కథ కాదంబరిలాగున్నా దశకుమారచరిత్రిలాగున్నా అగమ్యగోచరప్పంథలో పడుతూవుంది. యెక్కడికి తీసుకువెళ్ళి అసలు ప్రధానాంశానికల్పితే బాగుంటుందో మళ్ళా వెనుకనుంచి చదువుకుంటేనే కాని నాకే అవగత మయ్యేటట్టులేదు. ఇఁక యీ పిచ్చివ్రాఁత చదువరుల నేమి రంజింపఁ జేస్తుందో కదా! కానివ్వండి. రాజావారు మహాదాతలు పండితులు పండితిగోష్ఠీ ప్రియులు, అన్నదగ్గరనుంచి మళ్ళా మొదలెట్టుకుందాము. అదికాక ఱోట్టికి "రేవేమిటి?"

తణికెళ్ళ సుబ్బన్నశాస్త్రుల్లుగారికిన్నీ కొప్పూరు గోపాలశాస్త్రుల్లుగారికిన్నీ తర్కశాస్త్రంలో వాదం జరుగవలసివుంది. సుబ్బన్నశాస్త్రుల్లుగారు "గోపాలశాస్త్రుల్లుగారు తనకై తే వాదంలో వోడిపోవడం తప్పదుగాని ప్రయోగంచేసి తన్ను కడతేరుస్తా" రనే భయంలో వున్నారు. ఉపాసనాశక్తికలవారు యిదివఱలో అక్కడక్కడ వుండేవారు. పుల్లెల దక్షిణామూర్తిశాస్త్రుల్లుగారికిన్నీ అద్దేపల్లి కృష్ణశాస్త్రుల్లుగారికిన్నీ యేదోవిషయంలో కొంచెం చర్చ నడిచిందనిన్నీ కృష్ణశాస్త్రుల్లుగారి వాదం వెనుక తగ్గిన కారణంచేత ఆయన మీద యీయన మూఁడోకన్ను తెరిచారనిన్నీ వక జనశ్రుతి వుఁది. దక్షిణామూర్తిశాస్త్రుల్లుగారు యితర శాస్త్రిలతోపాటుగా యీ మంత్రశాస్త్రంలో కూడా మహాపాండిత్యకలవారు. అట్టివారై వుండీనిన్నీ అద్దేపల్లి కృష్ణశాస్త్రుల్లుగారిపరియోగంవల్ల నెల్లాళ్ళో రెండునెలలో కట్టు

సరే, మహాసభలో యిదివరలో వుదాహరించిన పండితులిద్దఱికీ వకరోజున శాస్త్రార్థం జరిగింది. యెవరు పూర్వపక్షం చేయడం ?— సిద్ధాంతం చేయడం యెవరు ?—అనే ప్రశ్న వచ్చింది. యిక్కడ కొంత వ్రాయాలి; పూర్వపక్షం చేసేవారికంటె సిద్ధాంతం చేసేవారికి గౌరవం హెచ్చు. కాబట్టి పూర్వపక్షకోటిలో చేరడానికి మహాపండితులు అంగీకరించరు. గోపాలశాస్త్రుల్లుగారు "నాది సిద్ధాంతికోటి" అన్నారు. సుబ్బన్న శాస్త్రుల్లుగారు "అలాఅయితే నేనే పూర్వపక్షం చేస్తా" నన్నారు. కాశీలో యేంచేస్తారంటే; యీలాటి సందర్భాలలో యెవరో విద్యార్థిచేత ముందుగా పూర్వపక్షాన్ని వుపపాదన చేయిస్తారు. దానిమీఁద ఆయా పండితులు అందుకుంటారు. ఇది సామాన్యంగా వినోదార్థం జరిగే సభల ముచ్చట. పట్టుపటాంగాల మీఁద జరిగేవయితేనో: "నే పూర్వపక్షంచేస్తే నీవుచెప్పఁగలవా ?" అని యెవరంటారో వారిదే పూర్వపక్ష కోటిగా వుంటుంది. సుబ్బన్న శాస్త్రుల్లుగారు యెక్కడో వకచోట పూర్వపక్షం వుపపాదించారు. బహుశః వక అరగంటసేపు దానికి పట్టివుంటుంది. లేదా ఒకగంట పట్టివుంటుంది. మాధ్యస్థ్యంచేసేవారు. పూర్వపక్షాన్ని యావత్తున్నూ తమస్వంత మాటలతో సంస్కృతంలోనే అనువాదచేసి సిద్ధాన్తంచెప్పేవారికి తెలియపరచాలి. బహుశః యీయన జడ్జీస్థానాపన్నులనుకుంటే బాగుంటుంది. కాని వకరికి చెప్పడానికి జడ్జీగారికోటి బోధపడితేనా ఆ పూర్వపక్షధోరణి ? అందుచేత మందపేటనుంచి మాధ్యస్థ్యానికివచ్చిన పండితులున్నూ తెల్లపోవలసి వచ్చింది; సిద్ధాంతం చెప్పాలని కూర్చున్న గోపాలశాస్త్రుల్లుగారున్నూ తెల్లపోవలసివచ్చింది. అంటే వీరిద్దఱున్నూ మహా గొప్పవిద్వాంసులే అయినా తఱికెళ్ళ సుబ్బన్నశాస్త్రుల్లుగారు చేసిన పూర్వపక్షానికి జవాబు చెప్పఎంమాట దేవుఁడెఱుఁగునుగాని, ఆ మహామహుఁడు చేసిన పూర్వపక్షం యిట్టిదనికూడా తెలిసికోలేక పోయారనడంవల్ల ఆ సుబ్బన్న శాస్త్రుల్లుగారు ఆ శాస్త్రంలో యెంత ప్రజ్ఞ గలవారో లోకులు తెలుసుకుంటారు. గోపాలశాస్త్రుల్లుగారే పూర్వపక్షం చేస్తే కొంతసేపేనా రాజావారి కుతూ

కాలం తీసేది. అలా జరక్కపోవడంచేత మొట్టమొదటే శాస్త్రార్థం ఆగిపో యింది. "ప్రథమ కబళే మక్షికాపాతః"

ముత్యన్న శాస్త్రుల్లుగారి దర్శనం చేయలేదుగాని ప్రకాండ సీతారామ శాస్త్రుల్లుగారిని మట్టుకు నే నెరుగుదును. యీ దేశంలో తర్కంలో మహా పండితు లనిపించుకోవడమే కాకుండా యెందరితో మహావిద్వాంసులను చేసిన పండితులు, వారిచెప్పేపాఠాన్ని అనుగామించలేకపోయేవా రంటూ పెద్దలవల్ల వినడం. యిందులో కొన్నిమాటలు యీషత్ అతిశయోక్తిగా ఉంటాయి. కాని ఏమైనా కణ్ణాల సీతారామశాస్త్రుల్లుగారి ప్రతిభ అప్రతిమం అన్నమాట స్వభావోక్తి కాకపోదు. యీ శాస్త్రుల్లుగారిబుద్ధి మిక్కిలి తీక్షణమయినదని గురువుగారు చెప్పేవారు. "గురువు బ్రహ్మయ్యశాస్త్రి కొలియాలు వెలసిన కణ్ణాల సీతారాముకాపిదేసి" అని నేను మా తి॥ శా॥ గారినిగూర్చి చెప్పినమాట ఈ సీతారామశాస్త్రిగారికి సంబంధించిందే. ఆ సీతారామశాస్త్రుల్లుగారు నిలవేసుకున్నవారి శిష్యులట. లోకాతీతమైన యీ మహామహుణ్ణిగూర్చి — "సీతారాముహాఫ్ శాస్త్రివా" అని పండితే వారు వెలవిచ్చేవారంట. తర్కశాస్త్రంలో పండితులనిపించుకోవడం చాలా అరుదు. వ్యాకరణం మొట్టమొదట మిక్కిలి కష్టంగా ఉన్నట్లు కనబడు తుందిగాని యేనాలుగైదుమాసాలో శ్రద్ధపుచ్చుకొని అభ్యసిస్తే క్రమంగా పేలపిండివలె ఖరిగా ఉంటుంది. యిటీవల వ్యాకరణాన్ని తర్కశాస్త్రంతో పూర్తిగా మిళితం చేయడంచేత ఇదికూడా కొంత దుర్బోధంలోకి వచ్చింది. కాని, మొట్టమొదట — అనగా — కౌముదీరచననాటి వర కున్నూ అంత దుర్బోధస్థితి వ్యాకరణానికి రాలేదు. కాశికావృత్తి నాటికి చెప్పనక్కరలేదు. ఆ కారణంచేతనే అప్పటి పండితులు చాలామంది సాంగంగా వేదం అభ్యసించిన వాళ్ళుగానే వుండేవారు. యిప్పుడో ఒకటి వస్తే రెండోది రానివాళ్ళే తటస్థపడతారు. కారణం ఒక్కొక్క శాస్త్రా నికి సుమారు పదేళ్ళకు తక్కువ కాలం పట్టదు. యీవత్తున్నూ సరిగా కృషిచేయరుగాని, చేసేయెడల ఓంకారంలో సర్వవేదాలు యిమిడినట్లు

తర్కశాస్త్రంలో సర్వశాస్త్రాలూ యిమిడాయని చెప్పవచ్చును. ప్రత్యక్షఖండ మాటట్లావుంచినా అనుమానఖండ వక్కటితప్ప యెవరోగాని ఉపమాన శబ్దఖండలుకూడా చదవరు. ఉపమానఖండలోదే అలంకారశాస్త్రంయావత్తూ అనుకోవచ్చు. వ్యాకరణం శబ్దఖండంలోదిగదా? యిక కావలసిందేమిటి? వక్క వేదంతప్ప తర్కంలో సర్వమున్నూ గతార్థమవుతుంది. పైఁగా దాన్ని చదివి పూర్తిపాండిత్యాన్ని సంపాదిస్తే వారిముందర బ్రహ్మాండనాయకుఁడుకూడా నిల్వనేరేడు. తిమ్మిని బ్రహ్మినీ, బ్రహ్మిని తిమ్మినీ చేసేశక్తి తార్కికులకుతప్ప వేరెవ్వరికుంటుంది? చూడండి— ఆ శాస్త్రంలో విజ్ఞులైనవారి ప్రతిజ్ఞలు—

శ్లో. విదుషాంనివహై రిహైకమత్యా
ద్యదదుష్టం నిరటంకి యచ్చ దుష్టం
మయి జల్పతి కల్పనాధినాథే
రఘునాథే మనుతాం తదన్యథైవ.

ప్రపంచంలోవున్న పండితులంతా దేన్నికాదంటే దాన్ని తాను ఔనని చెప్పి సమర్థిస్తాననిన్నీ, అవునన్నదాన్ని కాదనిచెప్పి సమర్థిస్తాననిన్నీ యీ రఘునాథపండితుని ప్రతిజ్ఞ—యితర శాస్త్రాలలోవున్న పండితులకీ లాటి స్వాతంత్ర్యం కుదరదు.

ప్రస్తుతం గోపాలశాస్త్రుల్లుగారు యితరశాస్త్రాలల్లో పూర్ణపండితులై కూడా యీ తర్కంలో మహాసముద్రులు. సుబ్బన్నశాస్త్రుల్లుగారో? తామెక్కడ పూర్వపక్షం యెత్తుకున్నారో ఆసందర్భంకూడా యీ మహాసముద్రుఁడికి అంతు తెలియనీయనంత ప్రజ్ఞావిశేషంకలవారు. యీలాటి వారినిగూర్చి నావంటివాఁడు, వ్రాయవలసివస్తే పట్టి పొడిపొడి మాటలు పడతాయిగాని అసలు వుపయోగించతగ్గ మాటలు పడతాయా? అయినా యేదో వ్రాసినందుకు విద్వల్లోకం క్షమించాలి.

ప్రస్తుతాన్ని రెండుమాటలు వ్రాసి యిక ముగిస్తాను. ముగించడానికేముంది? యెప్పుడు సుబ్బన్నశాస్త్రుల్లుగారి పూర్వపక్షం అయోమయప్పుం

చూపుతారే. అయితే పూరికే ఆయనకువుండే ప్రతీతినిపట్టి సుబ్బన్న శాస్త్రుల్లుగారు "రజ్జుసర్పభ్రాంతి" గా హడిలి వేజారై వాక్కు పడిపోవడమే కాకుండా క్రమంగా స్వర్గతులవడంకూడా తటస్థించిందేమో, అంటారా ? అయితే గోపాలశాస్త్రుల్లుగారు దూష్యులుకారు. పాపం పుణ్యం పరమాత్మడికే యెఱుక. మనకు ముఖ్యంగా కావలసినది సుబ్బన్నశాస్త్రుల్లుగారి పాండిత్య ప్రసంగం. అది నిరుపమానం అనే సంగతి ఆనాటి సభవల్ల తేలింది.

యీ సుబ్బతర్కియాన్ని మెప్పించినవారు కురుగంటివారిలో వకరు వుండేవారంటూ గురువుగారు సెలవిచ్చేవారు. వారిపేరు వేంకటరామ శాస్త్రుల్లుగారని విన్నట్లు జ్ఞాపకం. తాడెక్కేవాణ్ణి తలదన్నేవాఁడున్నూ వుండవచ్చునుగదా ? విద్యావివాదాలంటూ యిప్పుడున్నూ పత్రికలలో జరుగుతూ వుండడం అందఱికీ అనుభూతమే. కాని యిప్పటివారికి మంత్రశాస్త్రపరిజ్ఞలు లేకపోడంవల్ల వోడుకలగటం తటస్థిస్తే పట్టి శాపాలు మాత్రం పెట్టడం తటస్థిస్తూవుంది. ఆ శాపస్వరూపం పత్రికలలో చదువుతూనే వున్నారు కాఁబట్టి యిందులో యెత్తిచూపలేను. అవమానం మహాచెడ్డది. కొంచెం నామరూపాలు కలవాళ్ళు దాన్ని బొత్తిగా భరింపలేరు. ప్రాచ్చుంటిరిలో యేమన్నారో చూడండి—

"సత్త్రీణాః పరిభూయతే పరిభవా న్నిర్వేద మాపద్యతే।నిర్విణ్ణశ్శుచ మేతి శోకపిహితో బుద్ధ్యా పరిత్యజ్యతే। నిర్బుద్ధిః క్షయమేతి—"

యట్టితుపిడు అవమానం మరణాన్నికూడా సాక్షాత్పరంపరయా కలిగిస్తుంది. కాఁబట్టి అది తటస్థించినవారు యెదటివాళ్ళను శపించడానికిదిగడం చెప్పదగినదేగాను. దీనిలోపరవిశేషం గమనించవలసివుంది. యేమిటంటే విద్యావిషయంలోజరిగేవాదోపవాదాలలో జయాపజయాలు నిర్ణయించడానికి తగ్గ శక్తిసామర్థ్యాలు యెవరికోగాని వుండవు, వారుకూడా ఆ జయాపజయాలు తెలుసుకోవడానికి యీ శాపాలు ఆధారమవుతాయి. యెవరు తిట్లకు వుపక్రమిస్తారో వారికి అపజయం కలిగినట్లు సుళువుగా తేలుతుంది. ప్రస్తుతం రాజావారు యెవరికీవాదోపవాదాలు పెట్టివున్నారో వారి తారతమ్యం

మంత్రశాస్త్ర ప్రయోగంవల్లనే సుళువుగా గ్రహింపగలిగారనుకోవచ్చు. లేకపోతే మాఘ్యస్యం చేయడానికి వచ్చిన పండితులకేమి. వాదించడానికి వచ్చున్న గోపాలశాస్త్రుల్లుగారికేమి లేకమున్నా అవగాహనకాని విషయం యెంత శుష్కపాండిత్యం వున్నప్పటికీ రాజావారికి తెలియడం తటస్థింపవలసివుండదు. యితర విషయాలయితే శుష్కపాండిత్యానికి లొంగురానేమోకాని శాస్త్రవిషయం లేకమున్నా శుష్కపాండిత్యానికి లక్ష్యపెట్టదు. "అనభ్యాసే విషంశాస్త్రం" అని పూర్వికేనే అన్నారా పెద్దలు? అందులోతర్కశాస్త్రం చెప్పనే అక్కరలేదు. యితర విషయాలుకూడా కొన్నిచిక్కులగానే వుంటాయి. ఉదాహరణకి కొన్నిచూపి యీ వ్యాసం ముగిస్తాను.

భారతంలో ద్రోణాచార్యవధ ఘట్టంలో "అశ్వత్థామా హతః కుంజరః" అని పల్కినవాడు సాక్షాత్తూ ధర్మరాజా? మరెవరా? ధర్మరాజే కదా! పాండవ విజయంలో హిడింబవాలూరు పరిజనంలో రాక్షసుడెవరో కామరూపం కలవాడు ధర్మరాజు రూపంతోవచ్చి ఆ అబద్ధం ఆడినట్లు కల్పించబడ్డది. యిది శాస్త్రసంప్రదాయం తెలియక కేవలమున్నూ భారతకథా సంపర్కమే యెరిగివున్న శుష్క పాండిత్యం కలవారికి శుద్ధ తప్పుగా తోచితీరుతుంది. అలాగే మురారినాటకంలో వాలిన్ని శ్రీరాముడున్నూ యెదుటబడి యుద్ధంచేసినట్లున్నూ ఆ యుద్ధంలోనే వాలిహతమైనట్లున్నూ వుంది. నాటక సంప్రదాయం తెలిస్తే తప్పు యిదిన్ని కేవలం విరుద్ధంగా తోచకమానదు. అలాగే ప్రభావతీ ప్రద్యుమ్న నాటకంలో గదుడు శ్రీకృష్ణమూర్తి తమ్ముడనక కొడుకని కల్పింపబడివుంది. అయీ కల్పనలకు కొన్ని వుపయోగాలు వున్నాయి. మొదటిదాని కేమి వుపయోగమంటారా? ధర్మరాజంటే లోకానికి చాలా గౌరవించతగ్గ వాడుగదా? అవసరాన్నిబట్టి అట్టి మహాపురుషుడే అబద్ధమాడినట్లు నాటకంలో వుంచే యెడల, — అది దృశ్యప్రబంధ మవడంచేత పలువురు పండితులుమాత్రమే కాక పామరులుకూడా నాటకం చూడటానికి వస్తారుగదా, — వాళ్ళందరున్నూ "ధర్మరాజంతవాడే అవసరాన్నిబట్టి అబద్ధమాడితే సామాన్యులం

మన మెందుకాదగూడదు" అనుకొని దుర్నీతిపరులవుతారు కాబట్టి. అట్టికల్పన చేయవలసివచ్చింది. అలాగే వాలిన్నీ రాముఁడున్నూ, యుద్ధంచేసేసందర్భమున్నూ ఏకలోకంకాదు, పద్నాలుగులోకాలున్నూ, నెత్తిమీఁద పెట్టుకొనే శ్రీరాముఁడువాలిని చెట్టుచాటునుండి—అంతేకాక యితరుఁడితో పోట్లాడుతూ వున్న సమయంలో వధించాడంటే యెంతేనా తప్పిదంగా వుంటుందికనక నాటకంలోమార్గాంతరంగా ఆకళంకాన్ని తొలగించాడు. ప్రభావతీ ప్రద్యుమ్న నాటకంలో ప్రద్యుమ్నుఁడున్నూ గదసాంబులున్నూ, వెరశి ముగ్గురున్నూ వజ్రనాభ, సునాభులనే రాక్షససోదరులయొక్క కొమార్తలైన ప్రభావతీ చంద్రవతీ గుణవతులనే ముగ్గురిని అప్పాచెల్లెళ్ళను గాంధర్వరీత్యా పరిగ్రహించి వున్నారు. పినతండ్రి పెత్తండ్రికొమార్తలైన యీకన్నియలను పెండ్లాడిన వీరలుముగ్గురును అన్నదమ్ములవావివారుగా వుండడమేఅర్థమో, తండ్రీ కొడుకులవావివారుగా వుండడమే అర్థమో, ఆలోచించవలసివుంటుంది. ఇందులో వక వరుడు కృష్ణమూర్తికి తమ్ముఁడున్నూ తక్కిన యిద్దరున్నూ కొమారులున్నూ. ఆయేపక్షంలో యిద్దరు తల్లికి మొగుళ్ళు కావలసివస్తుంది. యిదిన్నీ యిలావుండగా యించుమించు సమానవయస్సులోవుండే యీ కన్యకలకు సమానవయస్సులోవుండే భర్తలైతేనే అనుకూలదాంపత్యంలోకి చేరుతుంది కాని దాంపత్యం, లేకపోతే ముదురు మొగుడున్నూ లేతపెండ్లామున్నూగా వుండడం తటస్థించి రసాన్ని చెడగొడుతుంది. పోనీ యీ దాంపత్యాలేమేనా యిప్పుడు లోకంలో ధనాపేక్షచేత ముసలాడికి పసిపిల్లను కట్టిపెట్టే రకంలోకి చేరతాయేమో అంటే, అట్టివికావు. పరస్పరమున్నూ గుణవయోరూపాదులను పురస్కరించుకొని యేర్పఱచుకున్నవి. కృష్ణమూర్తికి తమ్ముఁడైన గదుఁడే పెళ్ళికొడుకులలో వకఁడుగా వున్నట్టయితే అతఁడు కృష్ణమూర్తికి యెంత కడగొట్టుతమ్ముఁడైనా ప్రద్యుమ్నాదుల వయస్సులోవాడు కాఁడని వారివారి జన్మసందర్భాలను విమర్శిస్తే తేలుతుంది. పచ్చిచెడి యెల్లో వయస్సు యించుమించులో సరిపెడదామన్నప్పటికీ వావి కుదరదు. ఆయా సందర్భాలు అన్యత్ర విస్తరించఁదలఁచుకొని వూరికే స్పృశించి విడుస్తూ వున్నాను.

రక్షచేసి చూడడంవల్ల తాత్కాలికంగా గోపాలశాస్త్రుల్లుగారికి కల్గినకోపం ఉపశాంతమయింది; దానిలో అంతర్హితముంచే మనవి చేసుకొన్న సుబ్బన్న శాస్త్రుల్లగారి మాటలు తాత్కాలికంగా రాజావారికి తోఁచాయి. దానితో విశేషించి పండితాదరణంకల ఆ రాజన్యునకు పండితులంటే అసహ్యం కలిగింది.

పాండిత్యానికి పండితవర్గ లక్షణం ముఖ్యమయింది సత్యం. అట్టి సత్యాన్ని మన్నించేవారే అయితే గోపాలశాస్త్రుల్లగారు రాజావారితో "అయ్యా నేను ఆయుశ్శాస్త్రాలలో ప్రజ్ఞకలవాణ్ణి. సుబ్బన్నశాస్త్రుల్లుగారు వకటే తర్కంలో యావజ్జీవమున్నూ కృషిచేసినారు, అందువల్ల దానిలో వారిని సాక్షాత్తున్నూ గౌతముఁడో కణాదుఁడో అయితేనే తట్టుకోగలరేమో కాని ఇతరులు తట్టుకోరే" రంటూ కొన్నిమాటలు తత్కాలోచితంగా మనవి చేస్తే రాజాగారున్నూ సంతోషిస్తురు. సుబ్బన్నశాస్త్రుల్లుగారున్నూ "అయ్యా నాకన్న గోపాలశాస్త్రుల్లుగారే గొప్పవారు; యేమంటే: ఆయుశ్శాస్త్రాలలో పూర్ణ పండితులుగదా వారు?" అని చెప్పి స్తుతిచేసివుందురు. అలాకాక రసాభాసంగా లోటులు చెప్పుకొని కలహాన్ని ఆపాదించేలోపలోకి గోపాల శాస్త్రుల్లగారు దిగి, తమచేతాక పండితలోకానికంతకున్నూ తీరనికళంకాన్ని తెచ్చిపెట్టారని వ్రాయకతప్పదు. పాండిత్య మెంత వున్నప్పటికీ లౌకిక జ్ఞానం కొంతవుండాలి. యుక్తాయుక్తవివేకం కొంత వుండాలి. అప్పుడుగాని ఆ పాండిత్యం శోభించదు. యీ సందర్భాలన్నీ వున్నట్టు వక్కాణించదగిన పాపయ్యశాస్త్రుల్లుగారినే పండితమండలి యేకవాక్యంగా అంగీకరిస్తుంది. ముఖ్యంగా ఆ ప్రస్తావానికి సంబంధించిందే వక యితిహాసం వుదహరించి వ్యాసం ముగిస్తాను.

విజయనగరంలోనే శ్రీ పాపయ్యశాస్త్రుల్లుగారు మహాపండితసభలో వేదార్థం చెపుతూవున్నారట. యెక్కడిదో సంశయంగా వున్నట్టు తోఁచి కాబోలు గోపాలశాస్త్రుల్లుగారు, "బావగారూ! ఆ స్థలంలో మళ్ళా తెలియ్యలేదే" అని ప్రశ్నచేశారట. దానిమీద పాపయ్యశాస్త్రుల్లుగారు—"బావగారూ, యీ చరవాయి మనవిచేశాక యుక్తులున్న సావకాశంగా తమరడిగిన సందర్భానికి జవాబు మనవిచేసుకుంటా" నని యుక్తిగా అప్పటికి

సమర్థించుకొనేశక్తి ఆభాగంలో గోపాలశాస్త్రుల్లుగారికి వుందా? "నహి సర్వః సర్వం విజానాతి" కదా? ముందు దురుద్దేశంపుట్టిన దెవ్వరికి? గోపాలశాస్త్రుల్లుగారికి. పిమ్మట దురుద్దేశంపుట్టడం పాపయ్యశాస్త్రుల్లు గారికి. వీరు విజ్ఞానికి ఛాందసులే అయినా ఆ షడ్దర్శనవేత్తను వోడించిన ట్లయింది. యథార్థం ఆలోచిస్తే వారున్నూ మహానుభావులే వీరున్నూ మహానుభావులే.

సామాన్యలోకానికి యీ ధోరణి పనికిరాదు. కాఁబట్టి యెంతవారైనా జయాపజయాలకోసం కొంత పెనుగులాడడం తప్పదు. యీ పెనుగులాట పూర్వం సర్వసమ్మతంగావుండేది. ఇది యీ జన్మంలోనేకాక వుత్తర జన్మానిక్కూడా సంబంధించివుండేదన్నట్టు శ్రీహర్షుఁడు (నైషధగ్రంథ కర్త) గారి తండ్రి శ్రీ హీరుఁడుగారికిన్నీ ఆయన బావమఱఁదికిన్నీ జరిగిన వాదోపవాదాలకు సంబంధించిన యితిహాసంవల్ల మనకు తెలుస్తుంది. దీని యందు పూర్వపురాజులకు యెంత ఆసక్తిన్నీ లేకపోతే—

"పగులఁగొట్టించి తుద్భట వివాదప్రౌఢి గౌడడిండిమభట్టు కంచుఢక్క"

అనే శ్రీనాథునిపద్యపాదం మనకు ఆదరపాత్రి మవుతుందా? శ్రీనాథుఁడు ఆంధ్రంలో గ్రంథాలు వ్రాసినప్పటికీ సంస్కృతంలో సామాన్యుఁడు కాఁడు. గౌడడిండిమభట్టు సంస్కృతంలో జయసూచకమైన కంచు ఢక్కా రూపమైన బిరుదచిహ్నం కలవాడు. శ్రీనాథుఁడేమో కవి సార్వభౌమ బిరుదాంకితుఁడాయె. యీ రెండుచిహ్నాలున్నూ రజోగుణప్రధానాలే అనడంచేత వీరిద్దరికిన్నీ వాదంపడింది. శ్రీనాథుఁడు జయించాఁడు. ఢక్కా పగులగొట్టించాఁడు. యిప్పటి నాగరికులే అయితే యెందుకీ పిచ్చివాదా లంటారు. అంటారేమిటి? అనేవారరారు. నిజపుచ్చరుని స్వార్థంకాకుండా పరార్థం యెంతగానో పోట్లాడుకుంటూ కోర్టుల్లో బల్లలుగుద్దుతూ వుండే వారినో — యిప్పటివారు లేశమున్నూ యెత్తుకోరు. అది "ఉదరనిమిత్తం బహుకృతవేషం" కింద జమకట్టుకుంటారు. పండితులలో కవులలో పెట్టుకొనే వాదాలైతే వీరు పూర్తిగా యేవగించుకుంటారు. కొందరు యేవగించుకోవ డంతో సరిపెట్టక తూలుమాటలున్కూడా వ్రాస్తారు. అయితే యీ పండితు

గలిగినవారే అయితే ఆ హారారంమీదవున్న బొల్లు ముద్రాప్రమాదమని గ్రహింపగలుగుతారు. గాని ఆ మాత్రం పిండితేనివారికి అది సాధ్యంకాదని వ్రాయనక్కరలేదు. యింకొకచోట—

"తనయుల సనయుల మనుముల ఘనముల మునిమనుమలనైతము" అనివుంచగా—"మనుమలన్" అనునది మహద్వాచకముగాన, దానికి "ఘనములన్" అనే అమహత్తును విశేషణం చేయకూడదంటూ వకరు వెక్కిరిస్తారు. యీ కాలపు పాండిత్యాలు యిలా వున్నాయి, "ఘనము— ఘనములు" అనుకోకపోతే, ఘనా–మా–లక్ష్మీః– యేషాంతే ఘనమాః, ఆఘనమశబ్దానికి ప్రథమైక వచనం ఘనముఁడు, బహువచనం ఘనములు, రాముఁడు రాములు అన్నట్లే అగుననిన్నీ, దాని ద్వితీయైకవచన బహు వచనాలు "ఘనమునిన్" "ఘనములన్" అవుతుందనిన్నీ తెలిసి కోఁడా లనివా రిప్పుడు కవులు కవులే కారు. ఇంకా యెవరో యెవరో యెవరో. ఆకాశంమీఁద వుండేవారు. దీన్నిబట్టి అప్పటిపాండిత్యాలకూ యిప్పటి పాండిత్యాలకున్నూ కల భేదం వ్యక్తంగావడంలేదా? యింకొకటి మచ్చుకి చూపి వ్యాసాన్ని ముగిస్తాను.

"ఆత్మ ప్రభుతన్ సాగింపఁగాఁ బొచ్చెన్"

అనివున్నది పరచోట. "ఆత్మప్రభుతన్" అన్నది సిద్ధసమాసమును కాని "ఆత్మ" అన్నది గురువునావడానికి బదులు లఘువయిందంటో వకరు లిఖిస్తారు. యేమనుకోవేది? రేఫయుక్తమైనద్విత్వం పరమందుంటే పూర్వం వికల్పంగా లఘువవడానికి ప్రీదీకొన్నింతిప్పు లున్నాయి. అవి అప్పుడప్పుడు విస్తరింపవడమయింది. యిక్కడ ఆత్మ—తత్సమం, ప్రభుత— తత్సమం, రెంటికిన్నీ సాధ్యసమాసం చేసుకుంటే నవశంకా నహో త్తరంగదా? హరి ప్రభుత్వం–అంటే అది సిద్ధమున్నూ కావచ్చును,సాధ్య మున్నూ కావచ్చును. యీమాత్రంకూడా తెలియనివారిప్పుడు కవులు,మహా కవులు,చక్రవర్తులు, సమ్రాట్టులు, వ్యాఖ్యాతలు పాండిత్యానికి దుర్దశపట్టింది. అందుచేతనే నేను పట్టుతునవ వ్యావహారికభాషకొరకై దిగింది. దీనిలో వ్రాస్తే

జరిగించవని విన్నా ' మన్నారు. అసలే జరగలేదని శాస్త్రుల్లుగారు లిఖించి వున్నారు. మాగ్రామంలో వెలంవారు పలువురున్నారుగాని వారిలో నా కన్న వయస్సు మించినవారిప్పుడు వక్కరున్నూ సజీవులుగాలేరు. నేను వ్రాసే సంగతులు శ్రీ మాతండ్రిగారి వల్లనేకాక మావూళ్ళోవుండే వెలమ వృద్ధులవల్లకూడా విని వున్నవి. మావూళ్లో జరిగిన "లక్ష-యేభై వేల" వాదమే కాదన్నారు శాస్త్రుల్లుగారు. దానికి ఢుండిగారు చెప్పిన శ్రీరంగంలో సంగతిని వుదాహరణంగా చూపివున్నాను. అదన్నీ సత్యమైవుండునుగాని మా గ్రామంలో మా వీధినే జరిగిన లక్ష-యేభై వేలు "విభూతిరుద్రాక్ష ధారణమున్నూ" అసత్యం కాదేమో అని యిప్పటికిన్నీ నాకు సందేహం. కమ్మగృహస్థు విషయంకూడా శాస్త్రుల్లుగారు అన్యథాకరించివున్నారుగాని అవి తగినంత యుక్తియుక్తంగా కనుపడడంలేదు. ఆయన్ని శ్రీరాజావారు అవమానించకనేపోతే ఆయనమేనల్లుళ్ళు శ్రీ రాజావారి విషయంలో కొందలు రౌడీలతో దౌర్జన్యాన్ని చూపడం యేలావస్తుంది? దాన్ని వస్తాదు వారించడం యేలావస్తుంది? యీవిషయాన్ని పురస్కరించుకొని కమ్మగృహస్థును రాజావారు ఖైదుచేయించడం యేలావస్తుంది? ఆయన ఖైదులో మృతి చెందలేదన్నంతవరకు సత్యమైతేకావచ్చునుగాని, లక్కినయావత్తున్నూ అసత్యమని నాకు విశ్వాసం లేదు. శాస్త్రుల్లుగారేనా నాయీడువారేకాని యెక్కువపెద్ద కారు. వారున్నూ ఆయీసంగతులు వినేవుంటారుగాని చూచి వుండరు. వారివినికినిబట్టి వారు సవరణను వుపపాదించివున్నారు. మునిగి పోయిందేముందని నేను నమస్కృతులతో స్వీకరించివున్నాను. శాస్త్రుల్లు గారి తాతగారిని గూర్చిన సహాధ్యాయిత్వం మొదలైన విషయాలమాటెట్లావున్నా అసలువిషయం అసత్యమని వ్రాయడానికి కారణాంతరమేమేనా వుండి వుంటునా అని నా కిప్పటికిన్నీ అనుమానమే. ఆ విషయం నేను. శతధా సహస్రధా విని వ్రాసిందికాని మరొకమాదిరికాదు. సహాధ్యాయుతో మరొకరో అన్న విషయం నేనే సంశయిస్తూ వ్రాసివున్నానుకదా ? వారి యెడల నాకు ద్వేషభావం వుండివ్రాసినట్లు శాస్త్రుల్లుగారున్నూ వ్రాయలేదు- మొత్తం మన యేలా అనుకోవాలంటే: ఆయీచరిత్రలు పలువురనోళ్ళలో,

యెప్పుడైనా దగ్గరవుండే విదూషకులద్వారా తమ కోపాన్ని అభినయింప జేసి వారిని విశేషించి సత్కరించడంకూడా వుందని విన్నాను. ఆకోపాన్ని నిర్భయంగా రాజావారియెదుట అభినయించి బహుమానాన్ని గ్రహించిన రామభొట్లుగారి పే రిప్పటికిన్నీ ప్రసిద్ధిగా చెపుతారు. చెప్పేదేమంటే : అలా వారాలు మిర్యాలూ నూరుతో వుండఁగా వక నియోగిగృహస్థు ఉద్యోగాది సంబంధ లేశమున్నూలేని కడియం కాపురస్థుడు యేదో తాణాదారుగారి తరఫున కొంచెం సవరణ మాటలు మాట్లాడడానికి వుపక్రమించే టప్పటికి ఆ తాణాదారుగారిమీఁద వుండే దూఁకుడు యీ సంపన్న గృహస్థుమీదికి వచ్చి పూరిపిడుగు సామెతను జ్ఞప్తికితెచ్చినట్లు చెప్పుకుంటారు. అయీ కథలలోవుండే కోపవుసంగతులు వగయిరా మన మిప్పటి నాగరికతని మనస్సులో పెట్టుకొని చదువుకుంటే హృదయంగమంగా వుండవు. అధమం వక అర్ధశతాబ్దమైనా వెనక్కి వెళ్ళాలి. అంటే యీ సంగతులన్నీ ఆనకట్టకు పూర్వపుగాథలు. ఆనకట్టకట్టబడి రమారమీ నూరేండ్లు కావచ్చింది. అప్పటికింకా "నావిష్ణుః పృథివీపతిః" అనే సూక్తి అమల్లో నేవుంది. అప్పుడు రాజాగారు వచ్చేరంటే విష్ణుమూర్తి వచ్చినట్లే గ్రామం యావత్తు తలఁచేవారు. రాజుగారివల్ల సమ్మానింపఁబడనే అక్కరలేదు. అవమానింపఁబడితేకూడా కొంత గౌరవంగానే లోకులు భావించేవారు. యిందులో అతిశయోక్తి లవమున్నూలేదు. రాజుగారితో యేమాత్రం మాటలాడటం లటస్థించినా అదే మహామ్మేరువుగా భావించేవారు. ఆ కారణంచేతే ఆ గృహస్థు ప్రసక్తిగాని ప్రసక్తిలో దిగి కొంత అవమానం పొందడం లటస్థించింది. కాని, విశేషమైన అవమానం వరకూ రాలేదు. సామాన్యంతో తేలిందని చెప్పుకుంటారు. యింకా, లకుందాసు వేంకటాచలం అనే నాస్త్రామిను సంస్థానపండితునికి సంబంధించినవిన్నీ, దివాన్ వాదేప్రు చెలమయ్యగారికి సంబంధించినవిన్నీ, దిగవల్లి శివరావు దివాన్ గారికి సంబంధించినవిన్నీ, మామగారు శ్రీ యినుగంటి ప్రకాశరాయణింగారికి సంబంధించినవిన్నీ, గాథలుచాలావున్నాయి. అవకాశాన్ని పట్టి అప్పుడు వ్రాస్తానని మనవి చేసుకుంటూ ఇప్పటికి దీన్ని ముగిస్తాను.



# వెంకప్ప సోమయాజులు



వీరు కోనసీమలో అయినవిల్లి అనే గ్రామవాస్తవ్యులు. బులుసు అప్పయ్యగారనే జగత్ప్రసిద్ధవిద్వాంసుల ప్రథమపుత్రులు. తండ్రిగారి వలెనే వేదశాస్త్ర గ్రంథములలో సమగ్రపరిజ్ఞానం కలిగి ఆ సేతుహిమాచల మున్నూ ప్రసిద్ధి చెందిన పుణ్యపురుషులు. అసలు బులుసువారి వంశము "బులుసులేని పట్టణమున్నూ బులుసులేని యజ్ఞమున్నూ లేదు" అనే సామెతకు స్థానమైనది. అందులో ఈ సోమయాజులుగారు అగ్రగణ్యులు. వీరి నగ్రగణ్యులందామంటే, తండ్రి అప్పయ్యగారి పేరునవలెనో, లేక జగన్నాథశాస్త్రులవారి పేరునవలెనో, పెమ్మరాజు పూర్ణయ్య సోమయాజులు గారి పేరునవలెనో తెలియదు. కాబట్టి మొత్తం ఆ నలుగురున్నూ వరుసగా వేద శాస్త్ర పురాణాలుగా ప్రకాశింపజేయుచున్నారు. అలా అయి నప్పటికీ ప్రస్తుతం మనం వ్రాస్తూవున్నది వెంకప్ప సోమయాజులుగారిని గూర్చి కాబట్టి వీరిని అగ్రగణ్యులనడంతో వాదించం అంటూ చెప్పి గావను కుందాం. "ప్రతానా ముత్తమప్రతమ్." యీ సోమయాజులుగారు ఆపాం దరీకాంతగ్రామస్థులై అనేకులచే యజ్ఞాలెన్నో చేయించడమే కాకుండా స్వయం గాకూడా చేసి చిరకాలం జీవించినపుణ్యమూర్తులై వున్నారు. ఆయాదేశంలో వుండే పెద్దపెద్ద శ్రోత్రులందఱున్నూ వీరివద్ద దీవిటీకిందవాళ్లే అని చెప్పుకోవడం నే నెఱుగుదును. వీరిచేత ఓనాట్లు తినని గ్రామమే లేదని చెప్పుకోవడం నేను స్వయంగా విన్నదే. నా బాల్యంలో వీరు జీవించే వున్నా కాని వీరి దర్శనభాగ్యం నాకు లభించలేదు. చరిత్రమాత్రం పలువురివల్ల విని ఆనందించడం తటస్థించింది. వీరు తండ్రిగారివలె నప్రతిగ్రహీతలు కారు గాని సుప్రతిగ్రహీతలు. అట్లయ్యును తృణీకృతబ్రహ్మపురందరులు.

తండ్రిగారి నప్రతిగ్రహీతృత్వాన్ని గురించిన గాథలు కొన్ని వున్నాయి. అందులో వకటి వుదాహరిస్తాను. వకరోజున వుదయం గుమ్మం అలుకుతూవున్న సమయంలో వీరి తల్లిగారిని తండ్రి అప్పయ్యగారు "ఈనాటి శాకపాకా లేమిటి" అని ప్రశ్నించేటప్పటికి ఆమె, యేమంది, ఇవ్వాళ్టం

పులుసూ ఇతిహాసలు కూరానున్నూ, అని జవాబు చెప్పినట్టున్నూ, దాని మీఁద అవ్వయ్యగారు ఆబిడ భావాన్ని గ్రహించి నీకేమాత్రమో ధనాపేక్ష వున్నట్టుగా తోస్తూవుంది అది యెంతవఱకో వకమాటుబయటపెడితే తెచ్చి యియ్యడానికి ప్రయత్నిస్తా నన్నట్టున్నూ, ఆ పట్టాన్ని ఆమె గుమ్మం అలకడానికి నీళ్లతెచ్చుకొన్న నిలువుచెంబుచూపించి దీనెఁడు వరహాలు తెస్తే చాలునన్నట్లున్నూ, అప్పుడే ఆచెంబుచేతఁబుచ్చుకొని అవ్వయ్య గారు దేశాంతర గమనాభిముఖులై కొన్ని ప్రయాణాలమీఁద హైదరాబాదు చేరుకొన్నట్టున్నూ అక్కడ వక బ్రాహ్మడు యజ్ఞంచేస్తూవుండగా కాక తాళీయంగా వీరా యజ్ఞసమయానికే అక్కడికి వెళ్లి యజ్ఞశాలలోకె వెళ్లి నట్టున్నూ, అక్కడ యేదో ప్రాయశ్చిత్తవిషయంలో శ్రౌతులలో శ్రౌతు లకు వివాదవచ్చి వాదించుకుంటూవుంటే, యీ అవ్వయ్యగారు కలగజేసు కొని "యిదమిత్థం" అని ఖండించి చెప్పినట్లున్నూ, దానిమీద వక శ్రౌతి విస్మేపడినారయ్యా నీవు చెప్పడానికి, అబ్బో! నీవేమో బులుసు అవ్వయ్య వయిపోయినావే అని సోల్లుంఠంగా మాట్లాడేటప్పటికె అవ్వయ్యగారు "అలాగేఅనుకోండి"అని జవాబు చెప్పినట్టున్నూ, తుట్టతుదకు వారివారు ముఖముఖాలు చూచుకొని, అవ్వయ్యగారే అని స్థిరపడేటప్పటికె, అవ్వయ్య గారిని ఆశ్రౌతులందరూ విస్తారంగా గౌరవించి, అప్పుడు గోలకొండ నవాబుకు దివాన్‌జీగా వున్నూ, దేవబ్రాహ్మణభక్తుఁడున్నూ, మిక్కిలి ఆస్తికుఁ డున్నూ అయిన పంపోలాలాగారికె విన్నవించేటప్పటికె వారుకూడా వీరి పేరు అంతకు పూర్వమే వినివుండడంచేత అవ్వయ్యగారిని విశేషంగా గౌర వించి తాము యేకోరికమీఁద యిక్కడికి వచ్చేశారో సెలవీయవలసిందని ప్రార్థించేటప్పటికి, నాకు యేకోరికా లేదు. "పంచమేఽహనిషష్ఠేవా" అన్నట్లు కాలక్షేపం చేయడమేనాకోరికగాని వేరేకోరిక లేశమున్నూ లేదని చెపుతూ, చేతులోవున్న చెంబును చూపి యింట్లో ఆడవాళ్లకోరిక యిట్టిది అని చెప్పేటప్పటికి దివాన్‌జీగారు యేదేనా జాగీరు యివ్వడానికి ఉద్యుక్తులుకాఁగా, వారు దానిని అంగీకరింపలేనట్టున్నూ, దానిమీఁద విధి లేక ఆ చెంబెఁడు వరహాలు మాత్రమే యిచ్చి పంపినట్లున్నూ. అవి తీసుకు

వచ్చి ధార్మికివ్వి అవి మొదలు సప్రతిగ్రహీతలుగానే వుండి కాలక్షేపం చేసినట్లున్నా, అందుచున్నా యిప్పటికిన్నీ చెప్పుకుంటారు. యింకా అచ్చయ్యగారి సప్రతిగ్రహీతృత్వాన్ని గూర్చిన యితిహాసాలు చాలావున్నా యి మచ్చుకు ఒకటిమాత్రం వుటంకిస్తాను.

ఇంక పాండిత్యం యేలాంటిదంటారా? "పిన్నప్ప చెప్పింది వేదం" అన్న సామెతకి కారణభూతులైన యింపిరిగంటి విశ్వపతిశాస్త్రుల్లు గారు అచ్చయ్యగారి శిష్యులే అన్నచో వారి పాండిత్యం యెట్టిదో చెప్ప నక్కరలేదు; అయితే అంత గొప్పపండితులుగదా శాస్త్రీ, అవధాని, సోమ యాజి. లోనైన బిరుదు లేమిలేకుండా ఒట్టి అచ్చయ్యగారే అనిపించు కున్నా రేమని ఒకశంక రావచ్చును. సోమయాజులు అనిపించుకోవడా నికి అచ్చయ్యగారు యజ్ఞం చేయలేదంటు. వేదశాస్త్ర శ్రౌతాలు వచ్చిన మహాపండితుండుగదా? ఆయన యజ్ఞం యెందుకు చేశారుకారు? అని మళ్ళా శంక రావచ్చును. యెందుకు యజ్ఞంచేయలేదో మనకేం తెలు స్తుందికాని, లోకంలో ప్రవాదమాత్రం, యీ కలియుగంలో ఆధానం వఱకు మాత్రం చేసి త్రేతాగ్నిసిద్ధిని పొందితే చాలునన్నీ, పశుహింసతో చేరిన తక్కిన యజ్ఞయాగాలకు పోగూడదన్నీ వారి యభిప్రాయ మైనట్లు పలువురు పెద్దలు చెప్పగా విన్నాను. ఇది సత్యమైతే కావచ్చు. యింక తక్కిన శాస్త్రివగయిరా బిరుదాలు ధరించడానికి అన్నె రావడం వల్ల ఒకదాన్నే బోధించే బిరుదాన్ని ధరించడం యిష్టంలేక అచ్చయ్యగారు అచ్చయ్యగారుగానే యావజ్జీవమున్నూ కాలక్షేపం చేసినట్లువిన్నాను. విన డంలో అసలు అచ్చయ్యగారే యీ విషయం యిట్టిదని యెప్పుడో స్వయ ముగా వక్కాణించారనికూడా విన్నాను. యిందులో సత్యమెంతో కల్పిత మెంతో: అది అల్లా వుంచుదాం. అచ్చయ్యగారు సాక్షాత్తూ రెండో చతు ర్ముఖుండు అన్నంతవఱకు అందరూ నిర్వివాదంగా ఒప్పుకుంటారు. ఒక రిని గూర్చి వ్రాసేటప్పుడు వేరొకరి ప్రసంగం యెత్తితే తేలదు. యిప్పుడు మనకథానాయకులు వెంకప్పసోమయాజులుగారు గాని వారి తండ్రి అచ్చయ్యగారు కారు.

వెంకప్ప సోమయాజులుగారిని కూడా వేదశ్రౌతాలకు సంబంధించిన గాథలు చాలా వున్నాయి. యీ వేంకప్పసోమయాజులుగారనేవారంటకదా:- యీ శ్రౌతపల్లకీ వకవైపు దండి మాత్రమే బుజాన్ని పెట్టుకొని నేనుమోస్తువున్నాను. రెండోదండి బుజాన్ని పెట్టుకొనేవాళ్ళు కనపడడంలేదనేవారంట. కాలకర్మదోషాన్ని బట్టి యిప్పుడీ విషయాలు ముచ్చటించుకునేవారు కూడా లేరుగాని శ్రౌతమంటే సామాన్యంగాదు. యిప్పటికీ యీ గోదావరితీరంలోనూ, కృష్ణాతీరంలోనూ, కావేరీ తీరంలోనూ, యింకా శ్రౌతవిద్య శేషించివుంది. పూర్తిగా నశించలేదు. వెంకప్ప సోమయాజులుగారే కాదు, బులుసువారందఱున్నూ వేదశ్రౌతాలు వచ్చికూడా ఛాందసులుగా మాట్లాడడం కాక యుక్తియుక్తంగా సభారంజకంగా మాట్లాడే నేర్పు కలవారని పలువురవల్ల వినివున్నాను. ప్రస్తుతానికి అంతగా అవసరం లేక వుదాహరించలేదు. గాని యెనభైయేండ్లవయస్సులో తిరిగి వివాహం చేసుకొనేనిమిత్తం తూర్పుదేశంలోవున్న జమీందారులను చూడడానికి వేంకప్ప సోమయాజులుగారు ప్రయాణం చేస్తూవున్నప్పటిగాథలు చాలా హృదయంగమంగా వుంటాయి. పెండ్లిచేసికొన్న పిమ్మట వక రాజుగారు యెకసెక్కెంగా, సోమయాజులుగారూ! అవ్వగారు చెప్పినట్టు వింటూవున్నారా? అని ప్రశ్నించినట్టున్నూ దానిమీద మన సోమయాజులుగారు యెకసెక్కెమాడిన ప్రభువుగారికి నసాళం అంటేటట్టుగా "రాజా? వక్కపిల్లవినమా? వక్కపిల్ల" అని యేడుసార్లు హిందోళను రెట్టించి జవాబు చెప్పినట్టున్నూ చెప్పుకుంటారు. యిట్లామాట్లాడడం ఛాందసులకో మిక్కిలి అరుదు.

ఈ వేంకప్పసోమయాజులుగారి తమ్ముడే మిక్కిలి సుప్రసిద్ధులైన పాపయ్యశాస్త్రుల్లుగారు. అచ్చయ్యగారి ప్రతిష్ఠ సరేకదా! వేంకప్ప సోమయాజులుగారి ప్రతిష్ఠ విన్నారుకదా! యీ పాపయ్యశాస్త్రుల్లుగారి ప్రతిష్ఠనుగూర్చి యెంతని వ్రాయను? యీయన కుమారుడు ప్రకాశశాస్త్రుల్లుగారు తండ్రిని మించినవారు. యిటీవలకూడా వీరివంశం తామరతంపరగా విద్యాయశోధనాలతో భగవదనుగ్రహంవల్ల తులతూగుతూనే వుందిగాని, ప్రస్తుత

కాలానికి బొత్తిగా పనికిమాలినవనే హేతువు చేతఁబోలును అనా దానంగా వస్తూవున్న వేదశాస్త్ర ప్రారాలను వంశీయులు వదలుకొన్నట్లూహింపపోవాలి. ప్రస్తుతానుప్రసక్తంగా పావయ్యశాస్త్రుల్లుగారి ప్రసంగం వచ్చింది. ఈయన వేదశాస్త్రగ్రాహ్యాల్లో అన్నగారికిఁగాని తండ్రిగారికిఁ గాని దేశముస్నా తీసిపోయేవారుకారు. కాని శ్రౌతంలో అన్నగారిలాగు అనేక యజ్ఞాలకు పాత్రి పేటఁబట్టి అభ్యాసాన్ని చేసుక యేదో కొన్నిటికిమాత్రమే చేసి విరమించినట్లు వింటాను. ఏమయినా, శ్రౌతప్రయోగ విషయంలో ప్రాక్టీసు వేంకటప్ప సోమయాజులుగారి కెక్కువ. పావయ్యశాస్త్రులుగారో: హైకోర్టులాయరీ ప్యాసై కోర్టు కెక్కుడో కొలఁదినాళ్లు మాత్రమే వెళ్ళి విరమించిన శ్రీ రెంటాల వేంకట సుబ్బారావు పంతులుగారి వంటివారు. వేదార్థం చెప్పేశక్తి వేంకటప్ప సోమయాజులుగారికీ కూడా వున్నట్లే వింటానుగాని పావయ్యశాస్త్రుల్లువారివంటి ప్రజ్ఞ వారికే కాదు మెవరికీ లేదని వింటాను. విద్యార్థిత్వం పావయ్యశాస్త్రుల్లుగారికి కంఠపాఠా మేనఁట: ధర్మశాస్త్రాలన్నీ వాచోవిధేయంగా వుండేవఁట: మెంచని వ్రాయను వారి ప్రజ్ఞగూర్చి: యింక లౌకికజ్ఞానంలో యేప్లీడరిన్నా వీరికి రారఁట వారిముందు. వారు వేదార్థం చెప్తూవుంటే, అవతల మెంతో అందగత్తె, పాటకత్తె, అయిన వేశ్య అభినయిస్తూవున్నప్పటికీ ఆసభలోకి వెళ్ళక పండిత పామరులందఱూ వచ్చి వీరి సభలోనే కిక్కిరిసి వుండే వారఁట: యివన్నీ పెద్దలు చెప్పుకుంటూవుంటే విన్నమాటలు.

వారి కాలంలో యే బాల్యావస్థలోనో నేనుకూడా యేకావ్యాలో చదువుకుంటూవున్నప్పటికీ నా విద్యార్థిత్వమంతా పక్క కిదెప్పగ్రామంతప్ప తక్కింది గౌతమికి యీవలివడ్డున జరిగిందే అవడంచేత ఆ మహాపురుషుణ్ణి దర్శించడానిక్కాని ఆయన వాక్కును వినడానిక్కాని నోఁచుకున్నది కాక పోయింది. మా తిరుపతిశాస్త్రి అంతో ఇంతో కోనసీమ విద్యార్థిత్వము చేసినవాఁ డవడంచేత పావయ్యశాస్త్రుల్లవారి దర్శనభాగ్యమేనా అతనిక్కలిగింది. యేమైనా వారికాలంలో నేనుకూడా వున్నానని గర్వించడానికి మాత్రం నాకుకూడా అధికారంవుంది. యీ విన్నమాటలమీఁదనే వక

రాజసభలో పిచ్చాయి అభినయాన్నిగూర్చి మాట్లాడవలసివచ్చి యీక్రింది పద్యం నేను చెప్పఁగలిగాను.

తే. గీ. వేదమున కర్థము చెప్పఁ బృథివియందు
బులుసుపాపయ్యశాస్త్రి కే పోలుఁగాక
అభినయమొనర్చి పండితసభలనెల్ల
"హాయి" యనిపింప నొక్క పిచ్చాయి తగును.

యీలా పోల్చినందుకు ఆ సభలో పండితులు సమ్మతించక మామీఁదికి లేచారు. ఆ సభలో మాగురువు బ్రహ్మయశాస్త్రుల్లుగారు కూడా వున్నారు. మామీదికి లేచినపండితులకు సమాధానంచెప్పి మా మాట మేము నిల్పుకున్నాము. యీ విషయం యెఱిఁగినవా రీదేశంలో యిప్పటికింకా పలువురుంటారు. యింతకన్న యీ విషయాన్ని విస్తరిస్తే "రామాయణంలో పిడుకల వేట్లాట"గా వుంటుందని వదలుతూవున్నాను. ప్రధానం పాపయ్యశాస్త్రిలవారి వాఙ్మాధుర్యం సంగీతం వంటిది, అభినయం వంటిది — అంతేకాని "ఆస్నే చూస్నివషే, వషే ! చెవుడషే ! అష్లాగషే యేమిషే ? విస్నావర్జులవారి — బుట్టినష ! యీ విస్నాయి కిస్నారుషేః" వంటివిచారు అన్నది యిక్కడ ముఖ్యంగా గమనించవలసినవిషయం వాఙ్మాధుర్యం యిట్టిదని శాస్త్రమేమేనా రాదా ? వ్యాకరణం, పూర్వమీమాంస యింకా యితర శాస్త్రాలు వచ్చునాయె, యిఁక ఆయనకుసాటి — యీ లోకంలోనే కాదు స్వర్గలోకంలోనే అనుకుందాం — యెక్కడ దొరుకుతుందో ఆలోచించుకోండి చదువరులు యిన్నిటికన్నా సభారంజనకు వాఙ్మాధుర్యం ముఖ్యం. "వినా గోరసం కోరసః పండితానాం" అని పూర్వులే అనలేదు. అభియుక్తులు. గోరసం అంటే వాఙ్మాధుర్యం. ఇంత వాఙ్మాధుర్యం కలవారు కనుకనే పాపయ్యశాస్త్రిలవారు మహాకవిన్నీ, సంగీత సాహిత్యపారంగతులున్నూ, మహాపౌరాణికులున్నూ అయిన శ్రీశిష్టు కృష్ణమూర్తిగారితోకూడా వాదోపవాదాలు వచ్చినప్పుడు లోకులకు స్తోత్రపాత్రులు కాగలిగారు. పాపయ్య శాస్త్రుల్లుగారికిన్నీ శ్రీకృష్ణమూర్తిగారి

రిస్తే జరిగిన వాదోపవాదాలు ప్రత్యక్షంగా విన్నవారు నిన్న మొన్నటివారూ శ్రీ పిఠాపురపు సంస్థానములోనున్నా యితరత్రానున్నా పలువురు పండితు లుండేవారు. అందులో కొందరిని నేను ప్రత్యక్షంగా యెరుగుదును. పాపయ్యశాస్త్రులవారు సమయాలు సాన్యపత్రికా శాస్త్రుల్లగారివలె చేత త్యాగరాజులు: హేమంగా నామసదాంగా నస్యమునా వుండేవారట. వారు సిర్పాలపట్టికే ధరించేవారట వారి చేయిలోవుండే నాగబెత్తు పైభాగం నల్లగానే వుండేదట. వారి లోపలభాగం బహుసరిస్థితి కలిగివుండే దట. పండితులను ముఖ్యంగా పాండిత్యగౌరవం: లంబస్మృతిరదా: యీ శాన్ని లోకానికి తెల్పడానికే వారీ నల్లటి పాత్రను ధరించేవారేమోనని నే ననుకుంటాను.

వీరి చిత్ర చరిత్రలు నానావున్నాయి. ఒకటి రెండుదాహరిస్తాను. వీరకాశ్రీమహాస్త్రప్య లనుబంధించినో యేమో, మొదటినుండిన్నీ శ్రీ కృష్ణ కృష్ణమూర్తిగారికిన్నీ మన పాపయ్యశాస్త్రులుగారికిన్నీ విద్యావిషయంలో భిన్నాభిప్రాయా లుండూవచ్చేవట. పాపయ్యశాస్త్రులుగారికి వచ్చిన వేదం కృష్ణమూర్తిగారికిన్నీ వచ్చునుగాని యేమైనా వీరు కవితాభాగంలో ప్రధానంగా పనిచేయడంవల్ల ఆ విషయంలో పాపయ్యశాస్త్రులగారికి లొక్కువతారనడం సత్యదూరం కాదు. పాపయ్యశాస్త్రులుగారు కవితా విష యంలోగాని, సంగీతవిషయంలోగాని అసలు ప్రమేయమే లేనివారు. కాబట్టి యీ సందర్భంలో వీరికీ వారికీ తారతమ్య నిర్ణయం చేయనక్కర లేదు. కృష్ణమూర్తిగారు పిఠాపురపు సంస్థానంలో వకప్పుడు విజయవశము నిర్ణయములో సంస్థానపురోహితులద్వారా పాపయ్యశాస్త్రులగారి నధః కరిద్దామనే కుతూహలంతో పాపయ్యశాస్త్రులుగారి నిర్ణయానికి వ్యతి రేకంగా పురోహితుడిచేత వాదింపచేయడానికి పూనుకొని తాను కవి కనుక ధర్మశాస్త్రశ్లోకాలు రచనుగుణంగా పాతరాటాకు సంపుటాల్లో యెక్కించి రాజసభలో కనపరచేటప్పటికి శ్రీ రాజావారు పాపయ్యశాస్త్రుల్లుగారికేసి చూచి "దీని కేమంటారు" అని ప్రశ్నించేటప్పటికి శాస్త్రుల్లగారు "మహా ప్రభూ : శ్రీకృష్ణ సాహాయ్యమండి" అని శ్లేషగా జవాబు చెప్పేరట.

దానిమీఁద కృష్ణమూర్తిగారు పాపయ్యశాస్త్రుల్లుగారి పేరును శ్లేషిస్తూ "మహాప్రభూః పాపుఁడికి కృష్ణసాహాయ్యముండ"దని జవాబు చెప్పేరఁట. అంతతోకూడా పూరుకోక కుమారసంభవంలో శ్లోకాన్నొకదాన్ని యెత్తికొని ప్రస్తుతాని కనుకూలించేటట్టు అర్థం చెప్పి కాళిదాసుకూడా యిదే అభిప్రాయం కలవాఁడని చమత్కరించినట్లు చెప్పఁగా విన్నాను. యీగాథలన్నీ నాకు తూ. చా. తప్పకుండా వచ్చివున్నప్పటికీ గ్రంథవిస్తరభీతిచేత స్పృశించి మాత్రం వదులుతున్నాను. యీ పిఠాపురంలో వీ రిద్దఱికీ వైషమ్యానికి కారణం శ్రీ రాజావారు పాపయ్యశాస్త్రుల్లుగారికి పద్దెన్మిదిపుట్ల భూమి యివ్వడమున్నూ యీ సంగతి విని అంతకుముందు సుమారు పద్దెన్మిదేండ్లనాడు శ్రీ కాకర్లపూడి సంస్థానం విచ్ఛిన్నమయ్యేరోజుల్లో—

శ్లో. "త్రిస్థలీధ్వంసనార్థాయ ప్రవిష్టం నాయనత్రయం
తత్రైకస్తుకృతార్థోభూ దన్యౌద్వౌతు భవిష్యతః"

అని భావికాలాన్ని సూచనచేసి కాళహస్తి సంస్థానానికి సకుటుంబంగా వెళ్ళివున్న కృష్ణమూర్తిగారు భూసంపాదనేచ్ఛతో శ్రీ పిఠాపురం రాజావారి దర్శనానికి రాఁగా రాజావారు రు 500-0-0లున్నూ విలువగల సేల్జోడుమాత్రమే యిచ్చి సత్కరించడంవల్ల, నేనేం తక్కువవాఁడనా? పాపయ్యశాస్త్రుల్లు కిచ్చినట్లు నాకున్నూడా భూమి యేల యివ్వకూడదు? అనే యీర్ష్యతో రాజుగారికి తన గొప్పదనాన్ని చూపడానికి కృష్ణమూర్తిగారు రాజపురోహితునిచే పాపయ్యశాస్త్రుల్లుగారి నిర్ణయానికి అన్యథాగా చెప్పించారనిన్నీ దానిమీఁద పైన వుదాహరించిన శ్లేషప్రసంగం జరిగిందనిన్నీ స్పష్టమేకదా! యింకా యీ సందర్భంలో కృష్ణమూర్తిగారు శ్లేషగా చెప్పిన—"శ్లో॥రావురామనృపతౌ" అనే శ్లోకాన్ని వుదాహరించి చర్చింపవలసియున్నదీ మనకు ప్రధానం పాపయ్యశాస్త్రుల్లుగారిది కూడా కాక వేంకప్పసోమయాజులుగారి విషయ మవడంచేత వుపేక్షిస్తున్నాను. ప్రసక్తానుప్రసక్తమైనప్పటికీ పాపయ్యశాస్త్రుల్లుగారి చరిత్రకూడా కొంత మనకు ప్రధానమే అన్న అంశం ముందు వ్రాసే సంగతినిబట్టి చదువరులకు గోచ

చర్చించవలసి వుంటుంది. అంతగొప్ప పండితుఁడుగదా, ఆయన తన తమ్ముఁడి యందు అంత అసూయగా వుండడం తటస్థిస్తుందా అన్నది యిక్కడ విచారణీయం. అయితే యిది యశోవిషయం కాఁబట్టి, తండ్రిని కొడుకు సహింపఁడు, కొడుకును తండ్రి సహింపడు అన్నదిన్నీ లోక ప్రసిద్ధమే. "సర్వత్రజయ మన్విచ్ఛేత్" అన్నదానిలో "పుత్రాదిచ్ఛేత్పరాజయం" అనివుండడంచేత వక పుత్రుణ్ణిమాత్రమే మినహాయించవలసి వుంటుందికాని తదితరులను మినహాయించవలసి వుండదు. తమ్ముఁడు కూడా కుమారుఁడివంటి వాఁడే అనుకోవడానికి "పితృసమోజ్యేష్ఠః" అనేది సాయపడుతుంది. కాని అంతమాత్రంచేత లాభంలేదు. దానివల్ల తమ్ముఁడియందు వచ్చే పుత్రత్వం ఆరోపిత పుత్రత్వం అవుతుందిగాని సాక్షాత్పుత్రత్వంకాదు. "పుత్రాదిచ్ఛేత్తు" లోవుండేపుత్రత్వం సాక్షాత్పుత్రత్వమేకాని మరొకమాదిరిది కాదని అనుకోవడానికి అనేకాధారాలున్నాయి. కాని గ్రంథవిస్తర భీతిచే వుదాహరించ లేదు. సాక్షాత్పుత్రుల విషయంలో కలిగేపరాభవాన్ని ప్రతితండ్రి సంతోషపూర్వకంగా స్వీకరిస్తాఁడనే అంశం సర్వజనసమ్మతమే. అందుచేతే శ్రీరామునకేమి, అర్జునునకేమి, అట్టి పరాభవాన్ని సంఘటించారు మన పూర్వకవీశ్వరులు. ప్రస్తుతంమనకు కావలసింది, వేంకప్ప సోమయాజులుగారు యెంతోప్రాజ్ఞులై నప్పటికి, తమ్ముఁడు పాపయ్యశాస్త్రులుగారి శ్రేయస్సును కోరేవారై నప్పటికీ, ఆయనపేరు ద్వారా తమపేరు పయికి రావడానికి సుతరామున్నూ వప్పుకోరేమన్నది.

దీన్నిగురించి విచారిద్దాంకొంత. వకవేళయీపాపయ్యశాస్త్రులుగారు తమ్ములు మాత్రమేకాక శిష్యులుకూడా అవుతా రనుకుందాం. అప్పుడేనా అంగీకరిస్తారేమో ? లోకంలో యిప్పుడు మఱికొంచెం ధోరణ్ణిఁబట్టిచూస్తే శిష్యుఁడిద్వారా తమపేరుకు వచ్చే ప్రసిద్ధినికూడా అంగీకరించరనే చెప్పవలసివుంది. అయితే మురారి మహాకవి—

"స్థానే స్వశిష్యనికరైరపి నియుజ్యమానా
విద్యాగురుం హి గుణవత్తర మాతనోతి"

అన్నాడుకదా!– నాకి గతేమిటి?– అంటారేమో ! నాకిగతికేమి ? అట్లు వారొప్పుకోకపోయినా లోకంఒప్పుకోవడం మానుతుందా యేమి? ఫలానావారి మూలాన్ని యీయనకు గౌరవం వచ్చిందని ? నాన్నివరాంట గలరు? లోకాన్ని మాయచేయడానికి మానవుడెన్నివేషాలు వేయగలండు? లోకజ్ఞానుండా వున్నవారు విద్వాంసులలోనే ఎక్కువగా వున్నారుగాని ప్రాకృతజనంలో చాలామంది వున్నారు. ఒక వ్యక్తి కోర్టులోనూ సంఘంలో నీపేరు చెప్పవలసివచ్చేటప్పుడు, నేను ఫలానా వల్లప్ప యొక్కణ్ణి జవాబు చెప్పినట్టు వింటాము. అదివారాలా చెప్పేవానిద్వారంగ యింటిపెత్తనమంతా నడచేగా నిర్వహిస్తూ ధర్మకార్యాలుచేస్తూ మనువు మర్యాదలకు లోటుచేయకుండావ ర్తిస్తూవుండడంవల్ల తనపెండ్లాముకు యెక్కువపేరువచ్చిందని యెరిగి ఆశ్రి యిస్తే తనవిగానే భావించుకోవడం తప్పు పేదొకటి కనపడదు ! యేదో ఛటార్రీలు వద్దం చెప్పుతూ వుంటారు.

కోటసింగరాజు మాటవాసికాని గంగమాంబచేత ఘనతకెక్కె–
గంగమాంబ పెద్ద గయ్యాళిదై తేను, సింగరాజు యేమి సేయగలడు?

అని. దీన్నిబట్టి ఆ సింగరాజు కోపగించుకొన్నట్టుమాత్రం విదితం చేసు. తనకు పేరుప్రతిష్ఠలు తేవడ్గ మహాపురుషిని భార్య దొరకడం కూడా పెద్ద అదృష్టాలలోదేకదా! అలాగేవారాల సీతమ్మగారి పేరెట్టు కుంటారుగాని, భర్తకోగన్నగారిపేరు మందినా చెప్పుకోరు. కోగన్న గారువ్యవసాయమో వేదాయమో చేసి యింటిపదార్థం తెచ్చి సమృద్ధిగా యింట్లోవేస్తేనేకదా సీతమ్మగారు వచ్చేఅతిథిఅభ్యాగతులను ఆదరించి వడ్డించి కీర్తిసంపాదించింది ! అయితే అంతదాకా లోకాని కవసరం లేదు, శీఘ్రంగా ఉపస్థితమయే విషయాన్నిబట్టి చెప్పుకుంటారు. కాబట్టి పాపయ్య శాస్త్రుల్లుగారి పేరు వేంకప్ప సోమయాజులుగారి పేరుకంటే శీఘ్రంగా ప్రతివాడికిన్నీ మనస్సులో స్ఫురిస్తూవుండడంచేత లోకులు సోమయాజులుగారిని పాపయ్య శాస్త్రుల్లుగారి అన్నగారనుకోవడం ఎటస్థించిందికాని లేకపోతే శాస్త్రుల్లుగారినే సోమయాజులుగారి తమ్ముడని చెప్పుకొనేవారు. మహానది ప్రవాహాన్నైనా ఆపడానికి పూనుకోవచ్చునుగాని లో

కప్రవాహాన్ని ఆపడానికి పూనుకోవడంవెట్టిపని. హైదరాబాదా సికిందరాబా దాలకు మధ్యవున్న పెద్దతటాకంపేరు 'హుసేనుసాగరం'. యీహుసేను నైజాంరాజ్యాన్ని పాలించిన నవాబులలో వాడుకాడు సరిగదా మంత్రులలోవాడుకూడా కాడు. సామాన్యమైన నౌకరీ చేసినవాడైతే కావచ్చు. యేనవాబు రోజులలోవాడో కూడా మనకు బాగా తెలియదు. ధన దరిద్ర్యాలిచ్చి తవ్వించిన ప్రభువుపేరు రాక యీహుసేనుకు పేరువచ్చింది. యేమనుకోవాలి ? ఆపేరుతీసివేయడానికి ప్రయత్నిస్తే యేమేనా లాభం వుందా ? "పుణ్యై ర్యశో లభ్యతే" అనియిదివరకే వ్రాశానుకదా !

యింకొకటి అంతయీ యెఱిగిందే వుదాహరిస్తాను. హరికథాచతురానను డనదగిన నారాయణదాసుగారిని యెఱగనివారు లేరుగదా. ఆయనతోకూడా తాటితో దబ్బనంగా వెనుక పాడుతూవుండే ఆయన అన్నగారిని కూడా లోకంయెఱిగేవుంది. యీ అన్నగారే సర్వవిధాలా ఆదాసు గారిని యుక్తమార్గంలో పెట్టి కథాకాలాక్షేపం చేయించే హంగుదారుడని దాసు గారే వప్పుకుంటారు. సంగీతంలో దాసుగా రెంతవిజ్ఞులో అంతవిజ్ఞులు అన్నగారున్నూ అయివుంటారు. కాని లోకం యీమాటకు యెంతవఱకు అంగీకరిస్తుందో చెప్పజాలను. అన్నగారిగాత్రం సన్నవిడిగా మధురంగానే వుంటుంది. దాసుగారి గాత్రం ముదురుగా జంటోరాగా కొంత మోటుగా వుంటుంది. యిద్దఱున్నూ యేకగర్భజనితులే కనుక ఆసృష్టికర్తసృష్టి చేసేటప్పుడు గాత్రస్వరాన్ని నిర్మించేటప్పుడు సరిగా యేర్పాటు చేయాలనుకొని యీయన గాత్రంలో వేయవలసిన సామాగ్రినికూడా పొరబాటున ఆయన గాత్రంలో పడవేసేదేమో అని నాకు తోస్తుంది. లేకపోతే తమ్ముడి గాత్రం,'శంభో' అనేటప్పటికి మూడుకోసులుదాకా ఉఱుము ఱిమినట్లు ప్రతిధ్వనివ్వడమేమిటి ? అన్నగాత్రం అంతంతలోనే అంతరించడమేమిటి? యిట్టి సందర్భంలో వక సభలో వక కొంటెరసజ్ఞుడన్నాడటకదా: 'యేమంటోయి దాసుగారూ ! యేదో కొంత డబ్బుపెట్టి టిక్కెట్టు కొనుక్కొని రానేవచ్చాం. ఆయనచేత పాడించడం మానిపిస్తే యింకా కొంత దబ్బిచ్చుకుంటాం మీ' కన్నాడని చెప్పగా విన్నాను. "లోకులో

మనకు రావలసింది. అందులో వేంకప్పసోమయాజులుగారు, అష్టేతిబోధా హారణ ప్రచారణములుగల మహావిద్వాంసులు. ఆ పుణ్యపురుషుణ్ణి గూర్చి అలాగే యింకో ముచ్చటించుకోవడంవల్ల మనం కూడా ధన్యులం. యింకా వీరిరండిగ్రారిని గూర్చిన్నీ, తమ్ములు పాపయ్యశాస్త్రిలవారిని గూర్చిన్నీ, వారి కొమాళ్ళు పరికాశశాస్త్రుల్లుగారిని గూర్చిన్నీ యెంతో వ్రాయవలసివుంది. ఆ వ్రాయడం పరిత్యేకించి ప్రత్యేకించి శీర్షికలు పెట్టి వ్రాయవలసిందేకాని "సర్రాజు పెళ్ళికో గుర్రాజుకొకపోంచ" అంటే తేలేదికాదు. కాబట్టి మరిసకప్పుడు వ్రాదామని యిప్పుడింతటితో ముగిస్తూ వున్నాను.

---

# ఈ తి బా ధ లు

శ్లో॥ "అతివృష్టి రనావృష్టి ర్మూషకా శ్శలభా శ్శుకాః
అత్యాసన్నాశ్చరాజాన షడేతా ఈతయ స్స్మృతాః"

అంటూ ఈతిబాధలను పూర్వులు ఆరింటినిగా పరిగణించివున్నారు. యీ ఆరింటిలో పరిత్రివాక్కదానిహోనున్నూ మరికొన్నింటికి లంతర్భావం చెప్పవలసివుంటుంది. అలా చెపితే దొంగలబాధ, దోమల బాధ, రోగబాధ, పగయిరాలుగూడా కలిసివస్తాయి. అసలు శ్లోకానికర్థం వ్రాసి వ్యాఖ్యానం చేస్తాను—

'అతివృష్టిః' అంటే అదిసీనియాలోలాగ విశేషించి యెప్పుడూవర్షాలు పరియడం. దీనివల్ల ముఖ్యంగా ఆ చెట్టుపీడనూ ఆ చెట్టుపీడనూ సంసారాన్ని వెళ్ళబుచ్చుకొనే ఆగర్భభిక్షాటక జనమున్నూ, పశువులున్నూ, పక్షులున్నూ మిక్కిలి కష్టపడవలసివస్తుంది. వ్యవసాయానికిహూడా యిది చాలా అపకారకమే కాబట్టి లోకానికి యిది మిక్కిలీ పీడాకరమని వేరే చెప్పవలసివుండదు. 'అనావృష్టిః' అంటే? దత్తమండలం వగయిరా ప్రదే

తంలో తమజీవితాన్ని పోల్చి చూచుకుంటే వెంటనే ఆదుర్వృత్తి వదలక పోయినా కొంత పశ్చాత్తాపమేనా కలిగితీరుతుం దనుకుంటాను. వీట్లని యిందుకోసమే భగవంతుడు లోకానికి పంపిస్తుంటాఁడేమో ? మిడతల దండు 25 యేళ్ళనాడు చూడడమైంది. రామదండు సుమారు 50 ఏళ్ళకు పూర్వం చూచాను. అది యెక్కడ పుట్టిందో తెలియదు. వొకవూరునుంచి యింకోవూరు రావడమున్నూ, వచ్చేటప్పుడు తోవపక్కనువుండే చెట్లూ చేమలూ విఱిచి పాడుచేయడమున్నూ చూస్తే రామదండు అంటే కోఁతులు కనక ఆపేరు సార్థకపఱుచడంగా కనపడింది. ఆయాగ్రామాల్లో సంతర్పణలూ సమారాధనలూ అనుభవించడం, ఆవూరివాళ్ళద్వారా యింకోవూరు సమీపంలో వున్నది వెదుకుతూ వుండడం యిదేప్రకారం "గతానుగతికం"గా కొన్ని మాసాలు జరిగింది. దీనిలో వక్క విశేషంమాత్రం వుంది. అది శ్రీరామనామస్మరణ. యిది అంటే యీ దండు చిగురుకు యేవూళ్ళో అంతరించిందో మాత్రం తెలియలేదు. యెక్కడపుట్టిందో ? అంతకు ముందే తెలియదు. దండుశబ్దసామ్యం వుండడంచేత దీన్ని యిక్కడ వుటకెంచవలసివచ్చిందే కాని అంతో యింతో వీధి పక్కని వుండే చెట్లకొమ్మలను తప్ప యితర సస్యాలకు మిడతల దండువల్ల కలిగినట్టు యీ రామదండువల్ల లేశమున్నూ నష్టం కలిగినట్టు లేదు. యింక "అత్యాసన్నాశ్చ రాజానః" అంటే ? మిక్కిలీ సమీపంలో, అనఁగా తన యింటికి దగ్గిఱిగా వుండే రాజులు లేదా ? రాజానుగ్రహపాత్రులైన రాజపురుషులు. వీరు కూడా యీతిబాధలలోకే చేరతారా ? అంటే ? వినండి. నా చిన్నతనంలో పదేళ్ళవయస్సుపిమ్మట సుమారు వక పుష్కరకాలం ఫ్రెంచిటవును యానంలోనే వెళ్ళింది. ఆ వూళ్ళో కీ॥ శే॥ శ్రీ మన్యం మహాలక్ష్మమ్మ జమీందారురాలు నివాసంగా వుండడంవల్ల యెన్నో వైదికానికి సంబంధించిన పుణ్యకార్యాలు వారి మేడకు ఎదురుగా వుండే సత్రంలో తఱుచు జరుగుతూ వుండేవి. దేశంలో ప్రసిద్ధులైనవారు వచ్చి నవరాత్రోత్సవాలల్లో శాస్త్రీయంగాన్నూ స్వస్తి వగైరాలు పరస్పర గాత్రాలుకల్పి ఉచ్చైస్స్వరంగా చెప్తూవుండేవి తెలిసినా తెలియకపోయినా విని సంతోషించడానికి బదులు

చేయడానికి వుపాయంతేనేలేదు. వాట్లకుసమృద్ధిగా తినడానికిధాన్యం వుండ డంచేత అవి మాయింట్లోచేస్తూవున్న హంగామాకుపరిమితే కనపడడంలేదు. కెందుసుంచి కిటికీలోకి యెగరడానికి మధ్యమకాంగా ఆసమీపంలో మడత మంచంమీఁద పడుక్కున్న నన్నే యేర్పఱుచుకున్నాయి. పుస్తకాల బీరు వాలల్లోప్రతిరోజున్నూ వీట్లకుసంబంధించిన పురుళ్ళు జరుగుతూనే వుంటాయి. యింటిమూరులనిండా వీట్లకలకలధ్వనే వినపడుతుంది. సరంబీమీఁద వీట్ల చెడుగుడియాటల ధ్వని కొత్తవాళ్ళకు కొంత భయంకరంగాకూడా కనపడు తుంది. మాకు అలవాటుగావుండడంచేత నిద్రాభంగంవగయిరాలు కలగ డంలేదు. కొందఱు బోనులుపెట్టివీట్లని పట్టించి తగ్గించాలని ప్రయత్నంచేసి విఫలమనోరథులు కావడంనేను స్వయంగానే యెఱిఁగివుండడంచేత ఆప్ర యత్నంయెప్పుడూ చేయలేదు. ప్లేగువ్యాధి గోదావరిజిల్లాకు భగవదనుగ్ర హంవల్ల యింతవఱకు సోఁకకపోఁ బట్టిగాని సోఁకే యెడల వీటిబాధ గ్రా మపారిశుద్ధ్యంకొఱకేర్పడ్డసంఘం వారు యేదేనా వుపాయంచేసి తగ్గించే వారేమో? వీట్లఅభివృద్ధికి పరిమితే కనపడడంలేదు. పంచాంగాలల్లో వుండే వృద్ధి క్షయాలుసరిపోవడంలేదు. క్రమంగా మాయింట్లో మాకోసంనిలవ చేసుకున్న ధాన్యంలో భాగస్వాములుగా యివియేర్పడ్డాయి. వీట్లబాధ పడలేక యింట్లో కట్టుదిట్టంగా వేవే వకనాదె కట్టిస్తే కట్టించినన్నాళ్ళేనా పట్టలేదు. దాన్ని కుచేలుని వస్త్రంకన్నా మిన్నగా జల్లెడతూట్లలో చిత్రించి వదిలిపె ట్టాయి. యిప్పుడు వీట్లల్లో పెద్దజాతి పందికొక్కులు కిటికీలను పూర్తిగా చిద్రించేటట్టు చేస్తూవున్నాయి. యిదంతా మనఅహింసా వ్రతానికి ఫలితం అనుకోవలసిందేకాని మరేమనుకోవలసింది? ఆమధ్య యీబాధ పడలేక మనపూర్వులు వకగృహస్థు మంచిదిట్ట తెలిసినవాఁడే యింతపాషాణం తెచ్చి పోడరో కూఁరలో యిడ్డెనో యిచ్చేటప్పటికి దాన్ని పెరుగన్నంలో కలిపిసకపోయి పెట్టేటప్పటికి ఆపందికొక్కులుతిని గోద్రిస్త్రావరమువదిం చేప్రియత్నంలో వుండడం ఆయింట్లోనేవుండే వకముసలిస్త్రీ చూచి యిదే మిటని ప్రశ్నించేటప్పటికి గతంలో జరిగిన విషయం చెప్పేశారు ఆయజ మానురాంమర్రి. అదివిని ఆమెను 'పిల్లాపెల్లాతో కాపురంచేసేవాళ్ళం మనం

అలవాటుపడ్డవారే అనివినడం. ఆయా ద్రావిడపంచకంలో యేమి, గౌడపంచకంలో యేమి అంతర్భావం చెప్పుకోఁదగ్గ బ్రాహ్మణులు చాలామందివున్నారు. ఉత్కళబ్రాహ్మణులలో బంగాళీలకు అంతర్భావం చెప్పవలసివుంటుంది— మంచసాలో వుత్కళబ్రాహ్మణులవాడలో మహాపండితు లనఁబడే శ్రీ విద్యాభూషణంగారి గృహబహిర్వేదిమీఁద ఆయనతో యేదో ముచ్చటిస్తూ కూర్చున్నప్పుడు ఆ వీథిని మనవైపున కూరగాయలవాడల్లో మోస్తరుగానే చేఁపలమ్ముకొనేవాళ్ళు రావడం చూచేటప్పటికి నాకేమో విస్మయంగా కనపడి మనస్సులో దాఁచుకోలేక నేను— "అయ్యా! మీరు మహా విద్వాంసులుగదా! యిది మీకు హేయంగా తోఁచదా? దీన్ని మీ రెందుకు వర్జించరేమి?" అని ప్రశ్నించాను. దానిమీఁద ఆయన— "నేనెన్నఁడూ దీన్ని ముట్టను కాని యింట్లో ఆఁడవాళ్ళు వగయిరా భక్షిస్తారు." అనిచెప్పి మళ్ళా అన్నారుకదా "అయ్యా! మీరు దీన్నివర్జించి యెన్నాళ్ళయింది?" దన్నారు. అంటే ఆయన వుద్దేశంలో "మీరు" అనేది నన్నుమాత్రమే వుద్దేశించినమాటకాదు, మీ పంచద్రావిడులున్నూ. అనే తాత్పర్యంలో వుపయోగించినమాట. దానికి నేను తగిన జవాబు చెప్పలేక పోయాను. మనవు దొడ్లల్లో గుమ్మడి, ఆనప, పొట్ల, బీర పాదులు మాదిరిగానే వంగదేశంలో వారివారి పెరళ్ళల్లో మత్స్యాలు ఫలించే బావులుంటాయని చెప్పఁగా విన్నాను. నవద్వీపం చదువుకొందానికి వెళ్ళిన మన పంచద్రావిడ విద్యార్థులు బంగాళీ గురువులకు బజారునుంచి మత్స్యాదులు కొని తెచ్చిపెట్టవలసివచ్చును అప్పుడప్పుడు తటస్థిస్తూవుంటుందని మ॥ వే॥ శ్రీమాన్ సముద్రాల వేంకటరంగాచార్యులవారు చెప్పఁగా విన్నాను. అయితే ఆయా మత్స్యమాంసభక్షకులైనవారిలోకూడా భక్షించే జంతువుల విషయంలో తప్ప యితర జంతువిషయంలో చాలా దయాంతఃకరణులు కనపడతారు. శ్రీ మాడవీటి నారయ్యప్పారావుగారు (శ్రీరామచంద్రాప్పారావుగారి ప్రథమ పుత్రులు) వేఁటలో మిక్కిలి నేర్పులు సమర్థులున్నూ, యీయన వక రోజున దోసుకోవచ్చే యెలకలను జాగ్రత్తగా పూరివెలుపల వదిలిపెట్టి రావలసిందని నౌకర్లకు ఆజ్ఞాపిస్తూవుంటే నేను— 'అయ్యా! మీరు

వవు. యెవళ్ళైనా చేసేవాళ్ళుంటే వాళ్ళకు డబ్బేదన్నామో యివ్వడం మాత్రం వుంది. యీ మధ్య మా వూరిరైతులు లేళ్ళవిషయంలో ధనమైతే యివ్వలేము గాని అలాగే చేశారు. పూర్వమెప్పుడో మా గ్రామ పొలాలలో లేళ్ళు విశేషించి వుండేవంటూ మాతండ్రులకాలంలో వుండే పెద్దలవల్ల వినడం. లేళ్లుసంచరించే ప్రదేశం పరమపవిత్రమైనదని వేదవేత్తలు చెపుతారు. మోదుగచెట్లు వుండే ప్రదేశంకూడా ఆలాటిదే అంటారు. దర్భలు వగయిరా వుండే ప్రదేశంకూడా ఆలాటిదే. ప్రస్తుతం యెప్పుడో సుమారు నూరేళ్ళనాఁటి మాదిరిగా లేళ్ళమందలు మా తోఁటల ప్రాంతంలో పెరిగిఁపోయాయి. మావూరి కాపులేమి లంకకాపులేమి వాట్లను స్వయంగా కొట్టడంగాని యితరత్రనుంచి వచ్చేవేఁటగాళ్లు కొట్టడానికి అంగీకరించడం గాని లేకపోవడంచేత మందలుమందలుగా పెరిఁగి పూర్తిగా చేలు నాశనం చేయడాని కారంభించేటప్పటికి తుదకు విధిలేక వ్యవసాయదారులు స్వయంగా వాట్లను కొట్టడమైతే జరగలేదుగాని కొట్టేవాళ్ళను వారించక పోవడం మట్టుకు జరిగింది. యీ అహింసాతత్త్వం చాలా దుర్విజ్ఞేయం లని మొట్టమొదటే వ్రాసివున్నాను. వృత్రాసురవధ విషయంలో యింద్రుఁడికి అంతోయింతో సలహాయివ్వడంలో ఋషులున్నూ వున్నారు. అంత ప్రధానంగా కాకున్నా యే కొంచెమో యితరదిక్పాలకులున్నూ వున్నారు. తుట్టతుదకు యింద్రుఁడు బ్రహ్మహత్య చేశాఁడు గనక యీ యింద్రపదవికి అర్హుఁడు కాఁడని ఆక్షేపించి పదభ్రష్టుణ్ణి చేయడంలోకూడా ఆ యీ ఋష్యాదులే కారకులుగా వున్నట్టు కనపడుతుంది. ధర్మప్రతిపాదకంగా వుండే సత్కార్యాల్లోకూడా చిత్రవిచిత్రమైన చిక్కులు మన వేదశాస్త్రాల్లో కనపడతాయి. యజ్ఞం చేయడమే మహా పుణ్యకార్యంగదా! అందులో సోమవిక్రయణం పాపం. ఆ సోమ మంటూ లేకుండా యజ్ఞం సాగదు. ఆ యజ్ఞభేదాల్లో కొన్నిటిలోనో లేక మహావ్రత మనేదానిలోనో వక బ్రహ్మచారికిన్నీ, వక దాసీకిన్నీ ఆ అగ్నిగుండం సమీపంలోనే కొంతమెత్తు ప్రదేశంలో యేర్పడిన మంచెమీఁదే అనుకుంటాను సమాగమం జరగాలంటూ చెపుతారు, యింకా కొంత వ్రాయవలసి వుంది గాని

“అపుత్ర స్సుతో బ్రాహ్మం” అనక సామాన్య పక్షులు హేయంగా చూస్తారని చదివి చెపుతూ వున్నారు. అలాటిహోమం యజ్ఞపురుషప్రీతికరమై యజ్ఞకర్తకు పుత్రసంతానప్రాప్తి సంపాదకం యేలా అయిందంటే? అది వేద విశ్వాసం వుండేవాళ్ళు ప్రశ్నరాదు. వేదములు రాజసమ్మతాలు కదా! నా చిన్నతనంలో యీనాంలోనే పెళ్లిళ్ళయ్యేవి వివాహం నడిచే వేళాలంలో జరిగింది. వాళ్ళకేమో వివాహంలో హోమాలు చేయడం ఆచారమంటూ పకటయీంపు కొంత జరిగాక చెప్పింది అప్పుడు ఆ పురోహితుడు రేపు కొబ్బరిముక్క కావాలని చెప్పేటప్పటికి ఆని రాత్రివేళ షాపులో వాళ్ళు లేకున్నారు. ఆ ముక్కటాకులు బ్రహ్మబ్రహ్మంగా యేర్పడిన పురోహితుడుగారు ఆయనతో హోమాలంటు సాగించారు. కొబ్బరి ముక్కలంటారంటే?— బ్రహ్మసమిత్తత్తు మనేదే జవాబు. ఆ పురోహితుడు పెద్ద శాస్త్రమిచ్చిన హోమాలేమిటి అనే ఉద్దేశంతో చేశా మనుకుంటే తీరిపోయింది ప్రస్తుత దాసీ బ్రహ్మచారి సమాగమవిషయం అలాటిది కాదుకదా! నీలాటి వేదపాండిత్యం వున్నవాళ్ళనెవళ్ళనైనా ప్రశ్నించడానికి అవకాశం వుందను. లేకపోతే? వాళ్ళచిత్తం వచ్చినట్టు అనగవచ్చు. వాళ్ళకు జవాబు చెప్పేదెవరు? పరాయన ‘యజ్ఞంలో మేక లేకుంటే జంతువు కనక బ్రాహ్మలు చంపుతూ వున్నారు. పెద్దపులిని చంపవలసివస్తే యీ బ్రాహ్మలకు తెలిసిపోయే’ దంటూ అన్నట్టు పకరు చెప్పుతూవున్నారు. అవి పిచ్చిమాటలు. వేద పురుషుడు పెద్దపులిని చంపి యేదేనా యజ్ఞంలో హోమం చేయవలసిన దని విధించేయెడల దానికి తగు సాధనసామగ్రిమాత్రం శ్రోత్రియులు సిద్ధం చేసుకోలేకపోరా? వేదంలో యేలావుందో ఆలాగే జరుపుకోవడంకన్న వేరేగత్యంతరం లేదని దానికి సంబంధించిన మీమాంస చెపుతూనేవుంది. అందుచేత ఆ హేయమైన దాసీ బ్రహ్మచారిసమాగమాన్ని విషేధిస్తే ఆక్రతువు నెఱవేఱదని చెప్పి తీరవలసిందే. పాపం! ఆదంపతులు ఆక్రీడాగృహాన్నుంచి యీవలికివచ్చి అందు కేర్పడ్డ దక్షిణతాంబూలాది సత్కారాలతో నిర్గమిస్తూ వుండఁగా వారిమీద గోమయోదక సేచనం

వగయిరా మర్యాదలు జరుపుతారనికూడా వినడం. అన్నింటికంటేకూడా యీ జంట ధనంకోసం అంగీకరించడంచూస్తే దానికిమించిన దేదీన్నీ లేదని తెలుస్తుంది. దీనికేంగాని యెంతసరిపెట్టుకుందా మన్నా యీ లజ్జాకరమైన కృత్యాన్ని కూడా పరమపవిత్రమైన యజ్ఞములో చేర్చుకోవడానికి వేదార్థ వేత్తలు యేలాసమ్మతించారో అది దురూహంగానే వుంటుంది. వెధవ యెలకలగోలలోనుంచి పెద్దపెద్ద క్రతువుల విషయంలోకి పాఁకింది మన వుపన్యాసం. యేమీ? యెందుకు పాఁకకూడదంటాను. ఎలకేలాటిజీవమో, మేఁకా ఆలాటిజీవమేకదా! మేఁకదాఁకాయెందుకు? దోమమాటచూడండీ! దానిశరీరమెంతో, దానిలో ఉదరభాగ మెంతో, దానిలో వాయువు పుట్ట డాని కవకాశ మెంతవుంటుందో, ఆ అవకాశంలోన్నుంచి యేమాత్రంధ్వని పుట్టడానికి వీలుందో ఆలోచించండి! భగవద్విలాసం అనిర్వచనీయం కాక పోతే ఆస్వల్ప జంతువుగర్భంలోన్నుంచి వకవిధమైన — అతిసూక్ష్మమైన సున్నితమైన నాదం శ్రావ్యమైనదే వినపడుతుందిగదా! దీన్ని గుఱించి యే మనుకోవలసివుంటుంది? (అణోరణీయాన్) అంత శ్రావ్యంగా గానం చేస్తూ చెవిదగ్గఱ నాట్యంచేసే దోమలెన్నో మనచేత చంపఁబడుతూనే వున్నాయి కాని మన ఆర్యులమతంలో యజ్ఞంలో చంపఁబడే పశువుల విషయంలోనే గత్యంతరం కనపడదుగాని యీలాటివాట్లకు వైశ్వదేవ మంటూ వొకటి నివారకం కనపడుతుంది. యజ్ఞంలో కావాలని బుద్ధిపూర్వ కంగాచేసే పశుహింసను మనవారు హింసలోనే చేర్చలేదు. అక్కఱలేదను కున్నా తప్పని హింస దోషాలు వగైరాలవి. నిజమైన అహింసాతత్త్వం అంటే జైనులలో కనపడుతుంది. ఆ మతస్థులు ప్రొద్దుగుంకేలోపునే భోం చేయడంకూడా హింసకు జంకియ్యేవే. సర్వబాధకమైన తేలునుగాని పామును గాని చంపడానికికూడా ఆమతస్థుఁడు లేశమున్నూ అంగీకరించఁడు. అ హింసా నిర్వహణంకోసం దంతధావనాది కృత్యాలుకూడామానిన సన్న్యా సులు ఆమతంలో వుంటున్నారన్నది ప్రసిద్ధమే. వారు మలినవస్త్రాలను పరిహరించడమేకాని నీటితో పుతకడంకూడా వుండదు. ఆలావుతికేటప్పుడు కొన్నిసూక్ష్మ జంతువులకు హానికలుగుతుం దనియ్యేవే. యేవో పూర్వ

దీన్ని చేసిన వారినే పాకయాజిబిరుదంతో వైదికులు వ్యవహరిస్తారు. యిది చేయనిదే బ్రాహ్మణీకం వుండనేవుండదు. ఆ అయిదింటిలోను వకటి 'ఛుల్లీ' అంటే పొయి, దీనిద్వారా యెన్నో పురుగులు చస్తాయి. రెండు 'పేషణి' బహుళః తిరగలి. సన్నెకల్లు, రుబ్బురోలు వగయిరాలు అవుతాయి. వీట్లద్వారా కొన్ని సూక్ష్మజంతువులు చస్తూ ఉంటాయి. అట్టేగ్రంథం పెంచటం యెందుకు ? మనిషి నడిచేటప్పుడు దారిలోనున్నూ, వర్షాకాలంలో పొలాలల్లో నేరేడిచెట్ల సమీపంలో వుండే గట్లమీద ప్రయాణం చేస్తూ వుంటే కోటానకోట్లు కంచచీమలు భూమి యీనినట్టు పరమాణువంత మేరకూడా యెడంలేకుండా వుంటాయి. అక్కడనడుస్తూవుంటే యెన్నో చస్తాయి. అక్కడకే స్వేదజాలుగా వుండే నల్లులూ పేలూ వగైరాలతో సంబంధంలేకుండా శిష్టులు పిల్లజుట్లు వగైరా లేర్పరుచుకున్నారు. కాని భార్యలకు శిరోజాలుండక తప్పకపోవడంచేత తద్ద్వారాగా వచ్చే పాతకాన్నికూడా చెరిసగం తామే భరింపవలసివుంటుంది. కనుక మొత్తం వీట్లనన్నిటినీ కల్పి వైశ్వదేవమనే పుణ్యకర్మద్వారాగా నివర్తింప చేసుకొన్నట్టయిందనుకోవాలి. బాహ్యదృష్ట్యా వైశ్వదేవానికి ఫలితం యిదేఅయినప్పటికి అంతర్దృష్టినిపట్టి చూస్తే యేజంతువునకు గాని హానిలేకుండా వర్తించరా ? వెళ్ళికొడతా ? అని ప్రతి మనిషికిన్నీ భగవంతుఁడు విధించినట్టు తేలుతుంది. యిట్టిస్థితిలో ప్రస్తుతం నన్నుపీడిస్తూ వున్న యెలకలకున్నూ పందికొక్కులకున్నూ యేం చేయడానికీన్నీ మన మతరీత్యా వుపాయాంతరం కనపడడంలేదు. యథేష్టంగా తిని మదించి రాత్రి తెల్లవార్లూ పందికొక్కులు చేసే అల్లరికి పరిమితే కనపడడంలేదు. పందికొక్కును చంపితే పైజన్మానికి వుబ్బసం తగులుకుంటుందంటూ పెద్దలు చెపుతారు. దానికి తథ్యంగా యీ మధ్య మా వూళ్ళో వక సంపన్నగృహస్థు కొన్ని పందికొక్కులని విధిలేక చారపచేసి చంపించి, చంపించిన కొద్ది రోజుల్లోనే లేవ లేదన్నంతవఱకూ జబ్బుపడి భగవదనుగ్రహంవల్ల మనుష్యలోకంలోకి యిప్పుడిప్పుడే వస్తూవస్తూ వుండడం చూస్తే, వాట్ల అధికారం సాగకుండా యేదో వుపాయం చూచుకోవలసిందే కాని వాటిజోలికె వెళ్ళడానికి లేశమున్నూ

మనకు అధికారం వున్నట్టే పూర్తిగా కనపడదు. వుపాయమల్లా కిటికీలకు గాలి దూరేటట్టు వస్త్రవచ్చునని చెప్పి యేమైనప్పటికి గోలో బెక్కాయించుకోవడం సగైనా. కొట్లు పట్లు పోసేవి కుపేయించే జట్టులలాగ తయారైనాయి. వాళ్లగతి యీ యేటికి యేంచేయాలో ఆలోచిస్తే పాలుపోవడంలేదు. యీ బాధ అందరికీ వుండేదే. దీన్నిగూర్చి యింతగా వ్రాయడం లోకజ్ఞాన శూన్యత్వానికి గుర్తు తెలుసుకోవడానికి తప్ప మరెందుకు కాదని కొంద రంటారని నేను యెఱిగినిన్నీ తెగించియ్యాని దీన్ని వ్రాశాను. యితరులు వీళ్లవల్ల యింతటి బాధపడుతూవున్నవాళ్లు లేరనిన్యేవే. అథవా వుంటే వుంటారునాకేం. అంతమాత్రంచేత నాబాధ తీరడం యేలాగ? దీనివల్ల నేను నేర్చుకున్న పాఠమేమిటంటే? అహింసాతత్వంలో ఉత్తమమైన మత మైతే దేశగాని ఆ మతంలోవుండి ఆ మతధర్మాలు నెఱవేర్చుకోవాలంటే చాలా దుస్తరం. ఆ దేశస్థులలో వుండేవాళ్లే. అంతో యింతో జ్ఞానం వుండే మనుష్యుల మాటల్లా వుండగా జ్ఞానంలేని తిర్యక్జంతువులుకూడా లోకుపదేసి బాధిస్తా యనేదిన్యేవే. నిత్యమున్నా జంతుహింస చేస్తేనే కాని పొట్ట గడవనివాళ్లెందరో వున్నారు. వాళ్లందరూ పిల్లాజెల్లా తోను తోటలాగ వృద్ధిగానే వుంటారు. యేం కర్మమో! యెన్నడూ చేయని వాళ్ళు కనక యెప్పుడేనా ఆఖరికి యేతేలునో యేపామునో చంపవలసి వుంటూ తటస్థిస్తే అది వాళ్ళకి యెల్లప్పుడూ మనస్సును పట్టి పీడిస్తూనే వుంటుంది. మొత్తం భారతాది గ్రంథాలన్నీ యీ వుద్దేశంతోనే చాలావఱకు ప్రవర్తిం చాయి. కాని సర్పయాగాది క్రూరకృత్యాలుమాత్రం కోపం తీర్చుకొనే అభిప్రాయంతో ఆరంభించడం మాత్రం సూచిస్తూ వచ్చాయి. దుష్టజంతు మారణంవల్ల లోకానికి యెంతో వుపకారం వుందని యెఱిగిన్నీ మహ ర్షులు ఆ మారణంవల్ల ఆజాతి అస లేలాగా నశించదని యెఱిగి వుండ డంచేత కాఁబోలు! వృథాగా యీ హింసారూపమైన పాపాన్ని యీ మహా రాజు చేస్తూవుంటే చూస్తూ వూరుకోవడమెందుకని "ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః" చెపుతూ వచ్చారు. చాలా దయాశాలిగావుండే శ్రీమాజేటి రామచంద్రప్పారావుగారు వక రోజున ప్రసంగ వశాత్తూ అహింసాతత్వా

న్నిగూర్చి మాట్లాడుతూ అన్నారు గదా! మాంసభక్షణం హింసామూలక మవడంచేత పూర్తిగా వర్జించతగ్గదే కాని ఆ పద్ధతిని యీ జంతువులు అందులో చతుష్పాత్తులలో మేఁకలూ గొఱ్ఱెలూ ద్విపాత్తులలో అందులో పక్షులలో ముఖ్యంగా కోళ్ళు, యివి యేమికావలసి వుంటుందో? బోధకు రాదన్నారు స్థూలదృష్టిని చూస్తే ఆలాగే కనపడుతుంది. రోజువక్కిం టికి ఆసేతుహిమాచల పర్యంతంలో తెగుతూవున్న మేఁకలూ గొఱ్ఱెలూ కోట్లసంఖ్యకు మించుతాయనడంలో అతిశయోక్తిలవమున్నూ వుండదు గదా? కోడిగుడ్లను లెక్కపెట్టడం భూరేణువులని లెక్కించడంవంటిదే. యిలా మనుష్యులకోసం యివి హతమౌతూ వున్నా మూలచ్ఛేదం కాక సముద్రంలో తరంగాలలాగ మామూలు వృద్ధిలోనే వుండడంచూస్తే వీట్లని గుఱించిన భగవదుద్దేశమేలాటిదో బొత్తిగా మనస్సుకు అందడమేలేదు. యిన్ని జీవరాసులను యీలా చంపుకుతింటూవున్న మాంసభక్షకులను యెవ ళ్ళుగాని నిందించినట్టే కనపడదుగాని వేదవిహితమైనకర్మలు చెడిపోతాయనే భయంతోటి యజ్ఞంలో పరిమితంగా ఆలభనంచేసే మేఁకలను గూర్చి చిం తించేవారు పలువురు కనపడతారు. యజ్ఞానికి ఆనల్లమేఁకనో తెల్లమేఁకనో కర్మపశువులు తీసుకోవడంమానినంతలో దానికి బలవన్మృతితప్పుతుందేమో అంటే? "తిరుమలతాతాచార్లగారిముద్ర" లాగ ఏలాగా తప్పదు. ఈవేళ సోమయాజులుగారి గండం తప్పినా మఱునాటి బిస్మిల్లామంత్రపాఠకుల గండం తప్పుతుందా? అయితేవకటిమాత్రంవుంది. అహింసాపరులమ నిన్నీ భూతదయాపరులమనిన్నీ చెప్పుతూవుండేవారిని యెవరేనా యేమేనా అనడానికి అవకాశంవుంటుందిగాని యితరులని యెవరేమంటారు? అంతేనే కాని వీరియందు వుండే ద్వేషభావంచేత కాదని విస్పష్టమే. పూర్వకాలంలో జంతుహింసలేదని చెప్పఁజాలంగాని యిప్పటిమాదిరిగా తదర్థమై శాలా నిర్మాణాలు వున్నట్టు గ్రంథదృష్టాంతాలు కనపడవు. భారతంలో ధర్మ వ్యాధుఁడు చెప్పినమాటలుకూడా యీ వూహనే బలపఱుస్తాయి. మహ మ్మదీయ ప్రభుత్వం వచ్చాకనైనా శాలానిర్మాణపద్ధతి వున్నట్టుతోఁచదు. కాని పూర్వంకంటే హింస కొంతతీవ్రరూపంతాల్చిందంటే వొప్పనివారుం

దరు. ఆరాజ్యంలోనే గోవధ దాగా విస్తరించివుంటుంది. సందేహము లేదు. అంతకు పూర్వం నరమేధంతోపాటుగా బహువిరళంగా గోమేధాలు కూడా వుండే వుండేవేమోకాని మహమ్మదీయులు గోమేధాలు అజామేధాలతోపాటుగానే సాగించారు. ఇటీవల పిన్లకోసమంటూ శాలానిర్మాణాలు కూడా యూరోపియనుప్రభుత్వంలో అయాయి. అమృత్సరు సిటీలో కాంట్రోలును పందులను చంపడానికంటూ యూనియన్ బోర్డువారు శాలా నిర్మాణానికి ప్రారంభిస్తారని తెలిసి మహమ్మదీయులు గోవధకుకూడా అట్టి సదుపాయంకావాలని ఆందోళనానికి మొదలుచేయడం వల్లనున్నూ జరిగింది. బోర్డుప్రెసిడెంటు లజమీందారులలోనే యెవరోవుండి యేలాగో ఆమాటలవలన విక్షేపం పంపిస్తుందేమోనని చాలా భయపడుతూవుండున్నూ మాత్రం నేనెఱుఁగుదును. తరువాత యేంజరిగిందో నాకుతెలియదు. నిన్న మొన్న లాహోరుసిటీలోనే కాంట్రోలును యీ వ్యాపారానికి సంస్థాపన గవర్నమెంటువారే చేసి గృహనిర్మాణం జరిగిస్తూవుండఁగా ఆ ప్రాంతపు హిందువులు మొర్రోమొర్రో అని లబలబలాడి ఆందోళనచేసి విన్నపాలు పంపుకోఁగా పంపుకోఁగా ప్రజాద్వేషానికివి కారణమవుతుంది కాంట్రోలు నవిమెంటో, లేకపీక్షణానికి వ్యతిరేకమయిన కార్యంవిశ్వదేశంలోనే చేయడమెందుకనో అంతటితో ఆపినారని యేవో పత్రికలలో చదివినట్టు జ్ఞాపకం. యీ విధంగా జరుగుతూవున్న నిర్మాణాన్ని ఆపడంవల్ల వచ్చిన నష్టమే 50 లక్షల రూపాయీలనికూడా ఆపత్రికే వ్రాసింది. నిజంగా అది సంపూర్తికావలసివస్తే లక్షలతోతేలేదికాక కోట్లతోతేలేవని నేననుకున్నాను.

"ఏ భాగ్యమ్ము లీపాటికాక మఱేంయిచ్చెదు వసిత్రియం బడుగ నీయల్పమ్ము సి నేర్చునే ?"

అన్నట్టుసూర్యోదయ సూర్యాస్తమయాలే యెఱుఁగని మహాసామ్రాజ్యానికి యెంతసొమ్మైతే మాత్రంలక్ష్యమేమిటి ? మాంసభక్షణ చేయడం లేదని పూర్వపురాజుల ప్రభుత్వాన్ని గూర్చి చెప్పడానికయితే ఆధారాలు లేవుగాని యీలాటివిషయాల కీలాటి సదుపాయాలని యింతింత ద్రవ్యం వెచ్చించి కల్పించినట్టు దృష్టాంతాలేవిన్నీ లేవు. దిక్కుమాలిన ప్రారబ్ధం

బ్రాహ్మణముండాకొడుకులు గట్టిగా నోరారా యేడవడానిక్కూడా వీలు లేకుండా యెక్కడో వకటో రెండో వాక్యాలు అతిథిపూజకు లేగదూడను కోసిపెట్టవలసిందని వుండడంవకటిన్నీ, గోమేధంఅంటూ వకటిన్నీ వచ్చి అష్టు తగులుతూవున్నాయి. దీన్ని బట్టి మురారి మహాకవి—

"మేధ్యావత్సతరీ విహస్య వటుభిస్సోల్లుంఠ మాలభ్యతే."

అంటూ వ్రాశాడు కూడాను. నరమేధప్రియుక్తమంతాౖలే కనపడతాయిగాని జరిగినట్టులేదు. హరిశ్చంద్రుఁడు చేస్తూండఁగా విశ్వామిత్రుడు ఆఁపుచేసినట్టే పురాణగాధ చెపుతూవుంది. వేదమున్నూ దీనికివ్యతిరేకించదు. యింకోచోట తన పుత్రుణ్ణివొకణ్ణి చంపి యాగంచేస్తే నూరుగురు కొడుకులుకలుగుతారని పురోహితుఁడు చెప్పినట్టున్నూ, వొకరాజు ఆలాటి యాగాన్ని చేసినట్టున్నూ భారతంలో కనపడుతుంది. అది నరమేధం అనిపించుకుంటుందో? లేదో నిర్ణయించతగ్గశక్తి నాకు లేదుగాని ఆవుపాయం చెప్పిన పురోహితుఁడికి సంపూర్ణ ప్రాయశ్చిత్తం పరలోకంలో జరిగినట్టు కూడా ఆభారతంలోనేవుంది. అయితే ఆయాగకర్తకు మాత్రం పుణ్యలోకమే వచ్చినట్టున్ను తుదకు ఆయాగకర్త తన పురోహితుఁడి క్కూడా శిఫారసుచేసి ఆనరకబాధను తప్పించినట్టున్నూ దానిలోనే కనపడుతుంది. యింతరకన్న నరమేధాలకు ఉదాహరణాలు కనిపించవు. పూర్వయుగంలో రంతిదేవుఁడు రాఁబోలును గోమేధాలు యెన్నో చేసినట్టుకనపడుతుఁది. కాని అందులో గోవులు స్వయంగా వెళ్ళి పుణ్యలోకావాప్తి కొరకు ఆమహారాజును ప్రార్థిస్తే ఆయన అంగీకరించినట్టు కనబడుతుంది. అంతేనేకాని బలవంత బ్రాహ్మణార్థ ప్రకరణం లేశమున్నూ లేదు. యీ యుగంలో ఆ గోమేధం జరగడానికి వల్లకాదని మహర్షులేలాగో —

"కలౌ పంచ విసర్జయేత్"

అని పుణ్యం కట్టుకోవడమైతే జరిగింది గాని అయితే యేంలాభం? ఆధర్మశాస్త్రాలకు కట్టుఁబడని మహానుభావులు ఆ రంతిదేవుణ్ణి మించిన యాగాలు చేస్తూవున్నారు. ఆచర్మాలరాసులవల్ల బయలుదేఱిన నీరు ముఱికి నీరుగా వుండడానికి బదులు మహాపవిత్రమైన జలంకలనదిగా ప్రవహించి

నట్టుమన పురాణాల్లో వ్రాయఁబడి వుండిగాని యీ చర్మాలపై గర్తులు కోటి శ్వాశ్లై మెంతో పేపర్ప్రెస్సులు గణించినట్టు మనకు ప్రత్యక్షప్రమాణంవమే కనపడుతూవుంది. పురాణగాథలతోవ పురాణాలదీ మనతోవ మనదీగా వుండడంచేత భిన్నాభిప్రాయము చాలా స్పష్టంగా కనపడుతూవుంది. "సత్యంబు పల్కుండుమీ" అనే ప్రతిజ్ఞతో ముక్కుమూసుకొని జపహోమాలతో కాలక్షేపం చేస్తూవుండే "తృణీకృత బ్రహ్మపురందరులు" మహర్షుల నేమంటేనేర్పుల కాలించిన పెద్దాయువార్రికి లోకాన్ని మోసపుచ్చడానికి ? నాన్ బ్రామిన్సులో కొన్ని తెగలవారు యిప్పుడు చెప్పేమాటలుచూస్తే "ఋషు లేమో బ్రాహ్మణజాతికి సంబంధించిన వాళ్ళనిన్నీ, అందుచేత బ్రాహ్మణుల కనుకూలంగానున్నూ యితరు లననుకూలంగానున్నూ గ్రంథాలువ్రాసి యితరుల మహాద్రోహం చేశా"రంటూ కనపడతాయి. కాని ఆ ఋషులలో కొందరు జన్మతః బ్రాహ్మణులు కానివారు. క్షేత్రతః బ్రాహ్మణులు కానివారుకూడా వున్నట్లు గ్రంథాలవల్లనే అనగత మవుతుంది — అట్టివాళ్ళుకూడా యితరుల వ్యతిరేకంగానే లిఖించివుంటారా ? అనే ప్రశ్నకు జవాబు కనపడదు. మొట్టమొదట యీ వ్యాసం ప్రారంభించవలసిమేమో ? యీతిబాధలనుగూర్చి దానిక్కారణం యిండ్లో మిక్కిలిగా విజృంభించివున్న యెలకల యొక్కన్నూ పందికొక్కులయొక్కనున్నూ కోలాహలాతిరేకం యిప్పుడు ఋషుల పురాణాలు విషయంగా నడుస్తూవుంది. దీన్నిచూచి లోక మేమను కుంటుంది ? వ్యాసకర్త మతిమాలినవాడని అనుకుంటుంది. లేదా ? "కొండనిత్రవ్వి యెలకను పట్టడంఅంటే యిదేకాఁబోలు" ననైనా అను కుంటుంది. 55 యేళ్ళు దాఁటినవాళ్ళ బుద్ధి స్థిరంగా వుండదనే మాటను అంతతో నవుకరీనుంచి తొలఁగించి యెంపెన్షనో యిచ్చి కూర్చోఁ బెట్టి పోషిస్తూవున్న మన గవర్నమెంటు ప్రవృత్తివల్లనే అందరూ తెలుసు కొని వుంటారు. కనుక ఆమితికికూడా పుష్కరకాలంలోవున్నవాళ్ళ వ్రాత లకు తోవాతెన్నూ వుండకపోవడం అంత విడ్డూరం కామగదా ? నాలుగు మాటలు వక యితిహాసరూపమయినవి ఆ యీ యీతిబాధలలో మొట్ట మొదటిదానికి సంబంధించినవి వ్రాసి దీన్ని ముగిస్తాను. వకబ్రాహ్మణుఁడు

శ్రావణభాద్రపదాలు వస్తున్నాయని సప్రియత్నంగా యింట్లో ఆయా సామగ్రి జాగ్రత్తపెట్టుకుంటూభార్యతో—''శ్రావణభాద్రపదాలు వస్తున్నాయి సుమా'' అని మధ్యమధ్యఅంటూ వుండేవాఁడు. యీ సంచర్భం యితరులు కూడా వింటూవుండేవారు. పప్పు, వుప్పు, కట్టెలు, బియ్యం, నెయ్యి, నూని వకటేమిటి? శాయశక్తులా అన్నీ తెచ్చి భద్రంగా జాగ్రత్త పెట్టు కున్నాఁడు, అంతట్లో యేదోపనిమీద హఠాత్తుగా యేదో వూరికి ప్రయాణం తగిలింది అగృహస్థుకు. సరే: బయల్దేఱి వెళ్ళాఁడు. వెళ్ళీవెళ్ళడంతోటట్టే యిద్దఱు బ్రాహ్మణులు ఆ యీ సంగతి సందర్భా లెఱిఁగినవారు దర్భాస నాలతో వచ్చి వాకట్లో కూర్చున్నారు. ఆయింటి యజమానురాలు చూచి నాయనలారా ఆయన గ్రామంలోలేరు తమ రెవరో దయచేశారు, స్వయం పాకస్థుల్లా వున్నారు ఆ పంచపాళిలో స్వయంపాకం చేసుకోండి అంటూ వుపచారం చెపుతూ వుండఁగా ఆమోసగాళ్ళు—మాకాలాటి నియమంలేదు. మేమే శ్రావణభాద్రపదాల మన్నారు. అనేటప్పటికి ఆ అమాయకపు యిల్లాలు—వోహో! తమరేనా! నాయనా! శ్రావణభాద్రపదాలు? మా ఆయన మీరాకను గూర్చి చెపుతూనే వుండేవారు. సమయానికి వారు వూళ్ళో లేకపోవడం తటస్థించింది. రేపో యెల్లుండో వస్తారంటూ చెపుతూ ఆదరం కనపఱచేటప్పటికి మీ ఆయన మాకు వచ్చేతోవలో కనపడ్డా రనిన్నీ వారు వచ్చేవఱకున్నూ వుండి మఱీ వెళ్ళవలసిందనిన్నీ తొందర పనిమీఁద యెక్కడికో వెడుతున్నాననిన్నీ మఱీమఱీ చెప్పారనిన్నీ చెప్పి అక్కడే తిష్ఠవేసి— అమ్మా మీవంటి శిష్టాచార సంపన్నుల గృహాల్లో మాకు స్వయంపాకంతో అవసరంలేదు. నీవు మహాయిల్లాలవు, నీచేతి ప్రసాదమంటే? సాక్షాత్తూ అన్నపూర్ణాదేవి ప్రసాదమే అని స్తుతిచేసి వుడ్చించి దేవతార్చనలు చేసుకుంటూ సుఖంగా భోజనం చేస్తూ గృహ యజమాని వచ్చేవఱకున్నూ ఆయన కూడఁబెట్టిన సామానంతా వ్యయ పరచి యజమాని వచ్చిన సడి కనిపెట్టి మెల్లిగా పప్పుజాఱినట్టు జాఱినారు. ఆయన యిల్లు చూసుకుంటే "అయ్యవార్లంగారి నట్టిల్లు" లాగేవుంది. అపట్లాన్ని పదార్థమంతా యేమయిందని భార్య నడిగేటప్పటికి ఆ వెఱ్ఱి

యిల్లాలు....మీరు చెప్పినవారు మీరూ గ్రామాంతరం వయనించిన వుత్తర క్షణంలోనే వచ్చారుసుమండీ! యింకా యిక్కడే వున్నారు. యిప్పుడే యెక్కడికో వెళ్ళారు.

అంటూ యేమేమో చెప్పుతూవుండగా పాపం! అగ్నిహోత్రి-నిర్ఘాంత పోయి నీయమ్మకడుపు బంగారం గానూ! నేను చెప్పినవారెవరే? అని అడిగేటప్పటికి "మరిచిపోయారు కాబోలును. శ్రావణభాద్రపదాలు ఇద్దరు" అని బదులు చెప్పింది. దానితో ఆయన ఎవరో మోసంచేసి తినిపోయారను కొని పోనీ "సర్వం బ్రహ్మార్పణం" అని సరిపెట్టుకొని పెళ్ళాము తెలివి హీనతకు విచారపడి "స్త్రీలకువిద్యాజ్ఞానం లేకపోవడంవల్ల కొన్ని యిలాటి ప్రమాదాలు వస్తా" యనుకొని శ్రావణభాద్రపదాలు రెండు మాసాలున్నా యీ యింటిమీంచి కాకి ఆ యింటిమీద వాలడానికి వీలులేకుండా వర్షాలు కురిసేరోజులనిచెప్పి గృహస్థులు సావధానంగా జాగ్రత్త పెట్టుకుంటారు. అవి మాసాలు. యీమాత్రము నీకు తెలియదని నేను అనుకోలేదని చెప్పే టప్పటికి ఆ యిల్లాలు తన తెలివితక్కువను తెలుసుకొని భర్తను క్షమాపణ వేడుకొన్నట్టు పురాణంగా యెవరో చెప్పగా చిన్నప్పుడు విన్నాను. యీ యితిహాసాన్నిబట్టే అనుకుంటాను యీనాం సమీపంలోవున్న వాకపల్లెటూళ్ళో కొంచెం పప్పుధాల్లుమాత్రం వచ్చిన వక బ్రాహ్మణ సోదరద్వయాన్ని శ్రావణభాద్రపదాలని వేళాకోళంగా మారు పేరుతో వాడుతూ వుండేవారు. ఆ సోదరద్వయం వేరువేరు స్థలాల్లో వాకటేరోజున రెండుబ్రాహ్మణార్థాలు చేసేటట్టున్నా అదికూడా మోసం లోకే చేరుతుంది కనుక యీపేరు వాళ్ళకు వచ్చినట్టున్నా చెప్పగా వినడం. మొత్తం యీతిబాధల్లో అతివృష్టి మొట్టమొదటిదన్నమాట. యీరోజుల్లో సన్న్యాసులుకూడా సంచారం చేయరు. యీతిబాధలు లేనిదేశమే నివాస యోగ్యమైనది. అట్టిది ప్రపంచకంలోకల్లా మనభరతఖండమే అని చెప్పుకుంటాము. అలాటి దేశంకూడా యితరదేశ సంపర్కంవల్ల యిప్పుడు యెన్నో యీతిబాధలకు క్రొత్తక్రొత్తరకాలకు స్థానభూతం కావలసి వచ్చిందికదా! అని విచారం కలుగుతుంది. దీపం దగ్గిఱనుంచీ యిప్పుడు

మనం పరదేశాలమీఁద ఆధారపడి జీవించవలసిన దుస్థితిలో వున్నాము. పంపులున్నాయని నూతులు కప్పేసుకుంటూ వున్నచోట్లైనన్నా కనపడతాయి. యేకారణంచేతేనా పంపు మరమ్మతుకు వస్తే అది సవరణ అయేదాఁకా దాహానికి నీళ్ళు సున్నా అన్నమాటేకదా! మోటార్లూ, సైకిళ్ళూ కాలినడకకు స్వస్తిచెప్పాయి. మరబియ్యం దంపుడు బియ్యానికి కొక్కెట్టాయి. డబ్బాపాలు తల్లిపాలని తోసిరాజన్నాయి. యిలా వ్రాస్తే యెన్నిటినో వ్రాయాలి. పూర్తిగా జీవనం పరాధీనమైపోయింది. రాజకీయ విద్యలకు ధనాపేక్ష విధాయకమే అనుకుందాం. స్వదేశ విద్యలకుకూడా దానితో సంబంధం కలిగింది. ఆ యీ సందర్భాలన్నీ పూర్వంకంటేకూడా యిప్పుడు ప్రపంచాన్ని యీతిబాధామయంగా చేసివేసినట్టు తోస్తుంది. విస్తరించినకొద్దీ యీ విషయం పెరుఁగుతూనే వుంటుంది. ప్రస్తుతస్థితిని బట్టిచూస్తే సంసారజీవితమంతా యీతిబాధలతోనే నిండివుంది. పట్నవాసం కంటె పూర్వం పల్లెటూరు కొంత యీతిబాధారహితంగా వుండేది. ఇప్పుడో అక్కడవుండే సదుపాయాలు పల్లెటూళ్ళల్లో కనపడవుగాని అక్కడవుండే యీతిబాధలు మాత్రం కనపడతాయి. కొన్నివూళ్ళకి కోఁతులబాధ విశేషించి కనపడుతుంది. యీ కోఁతులు తాటాకు కొంపలవాళ్ళకన్నా పెంకుడు కొంపలవాళ్ళని యెక్కువగా బాధిస్తాయి. కొన్నివూళ్ళవాళ్ళు వీట్లకు జంకి పెంకుటిళ్ళు కట్టుకోవడమే మానుకున్నారు. యివి యెంతబాధ పెట్టినాసరే యేవో బెదరించడమేకాని వీట్లను చంపడానికి మన హిందువులలో యెవరున్నూ వప్పుకోరు. దీనిక్కారణం రామాయణ కాలంలో యీజాతి శ్రీరాములవారికి చేసిన సాయమే అనితోస్తుంది. సుమారు యేడెనిమిదేళ్ళ నాఁడు మావూళ్ళో వక కోఁతి ప్రవేశించి గృహస్థుల నందఱినీ అల్లకల్లోల పెట్టి బొత్తిగా నిలవనిచ్చిందికాదు. కోఁతులు కుక్కలకు భయపడడం సర్వసామాన్యంగా కనపడుతుంది. ఆకోఁతి కుక్కలకు లక్ష్యపెట్టేదికాదు సరికదా! వాట్లని పట్టుకొని చెంపకాయలు కొట్టేది. కోఁతిజాతి పగలేగాని రాత్రి చెట్టు దిగిరాదు. యీ కోఁతి రాత్రికూడా సంచరించేది. యిద్దఱు ముగ్గురుంటే తప్ప మనుష్యులమీఁద తిరగబడేది. యెక్కడో వక పిల్లిపిల్లనుసంపాదించి దాన్ని

పిచికలతో పట్టుకొని తెచ్చిన మూఁడు నాల్గురోజులకీ రెండు మూఁడురోజులు ప్రతి యింటిమీఁదను తిరుగుతూ వుండడంచూచి యిది చంటిపిల్లనెక్కడ యెత్తుకుపోయి యీలాగే తిప్పుతుందో అని గ్రామమంతా హడలి పోయారు. తుదకు ఆ పిల్లిపిల్ల నాచేతిలోనే చచ్చింది. చెప్పేదేమిటంటే? యింత దుర్మార్గంగా ప్రవర్తించినప్పటికీ దాన్ని చంపడానికి యెవ్వరూ అంగీకరించలేదు. పట్టుకొని గోదావరి దాఁటిస్తే వాళ్ళకు కొంత సొమ్మి వ్వాలని గ్రామస్థులు యేర్పాటుచేసుకున్నారు. యెవరో వచ్చి అందుకు ప్రయత్నించేస్తూ వచ్చారు కాని వాళ్ళకున్నూ అది దొరికిందికాదు. పట్టు కోవడమంటే మాటలా? మా గ్రామానికి అంటుమామిళ్ళతోపాటుగా చాలాకాలాన్నుంచి దొంగలక్కూడా కొంత పేరు ప్రతిష్ఠలున్నాయి. దొంగలంటే? సామాన్యంగా కన్నవేసే దొంగలున్నూ తోపలుకొట్టే దొంగలున్నూకారు. రాజులచేత మెప్పుపొంది మడిమాన్యాలు గడించిన దొంగలు. ఆమాన్యాలు యింకా అనుభవిస్తూవున్న కుటుంబాలు కొన్ని వున్నాయి. గర్భాధానంరోజున రాజుగారి కొమార్తె కట్టుకొన్న చీరెను చమత్కారంగా దొంగిలించి తెచ్చినప్పుడు అట్టి సన్మానం జరిగినట్టు చెప్పుకుంటారు. ఆ క్రీడాగృహానికి జల్లెడరంధ్రాలు చేసివుంది. ఆనరంధ్రమీఁద సాధన సామగ్రితో యేలాగో ప్రవేశించి చిన్నరంధ్రం చేసి తద్ద్వారాగా తామర తూఁడుగుండా నిద్రాసమయంలో ఆమె కట్టుకున్న చీర తడిసేటట్టు చేయడము తోటట్టుగానే అది చాకిరేవుకు రావడం కలిగిందనిన్ని అక్కడ నుంచి దొంగిలించడానికి సులువు కలిగిందనిన్ని చెప్పుకుంటారు. ఆలాటి చమత్కారపు దొంగతనాలు కుటుంబాలవాళ్ళు మాతండ్రులరోజుల్లో యెవళ్ల దగ్గరేనా ఋణమో వీసమో అప్పుచేయవలసివస్తే "యేలా తీరుస్తా?"వని అడిగే ఋణదాతకు—కోటిపల్లి తీర్థానికో—అంతర్వేది తీర్థానికో తీరుస్తా నని చెప్పడం కూడా యెఱిఁగినవాళ్ళు నిన్న మొన్నటిదాఁకా వున్నారు. వీళ్ళు బ్రాహ్మలు వేదం చెప్పుకొనేచోట యెందుకో కూర్చున్నట్టు కూర్చుని కొన్ని పప్పుబొట్లు సంగ్రహించి పరదేశాలకు వెళ్ళి బ్రాహ్మణవేషం వేసుకొని సంపన్నులయిన బ్రాహ్మణగృహాల్లో దేవతార్చనబ్రాహ్మణులుగా

చేరి గుట్టూమట్టూ కనిపెట్టి వీలిచ్చినప్పుడు వెండిబంగారాలు అంకినంత మట్టుకూ సంగ్రహించుకురావడం జరిగేదని చెప్పుకుంటారు. యీ బాపతు వాళ్ళిప్పుడు యే స్వల్పమో తప్ప లేరుగాని యిప్పటికి పన్నెండేళ్ళకు పూర్వం వొక దొంగ చాలా దారుణమయినవాఁడు వుండేవాడు. మృచ్ఛకటిక నాటకంలో వున్న శర్విలకుడికన్నా వాఁడి సామర్థ్యం హెచ్చని నేను అనుభవ పూర్వకంగానే వ్రాస్తూన్నాను. — వాణ్ణియెన్నోసార్లు ఖయిదులో పెట్టినా మళ్ళావచ్చింది మొదలు ఆపనే చేసేవాఁడు. కేశీలను పరీక్షించడం పోలీసువారికి తప్పనిసరి గనుక బీటుతిరిగే పోలీసులు వాణ్ణి పరీక్షించడానికి వెళ్ళేటప్పుడు వొంటిప్రాణంతో వెళ్ళవలసివచ్చేది. ఆసమయంలో వాఁడు తాగివున్నట్టాయెనా వీళ్ళను సుఖసుఖాల వదలిపెట్టక యేదోఅమర్యాదచేసేవాఁడు. వాఁడంటే వీళ్ళకుభయం. మొండివాఁడు రాజుకన్నా బలవంతుఁడు గదా! తాపీపనిలోచాలా గట్టివాఁడయివుండికూడా వాఁడు అది నౌకరీ అనిపించుకుంటుందని కాఁబోలును మళ్ళామళ్ళా యీవృత్తిలోనే తిరిగేవాఁడు — "నిక్కమ్ముగ నౌక్కవిన్ గొలుచుకొన్నను దొంగటికమ్ముతక్కువే" అన్న మృచ్ఛకటికకు వాఁడేయిటీవల వుదహారణంగా కనఁపడతాడు. మనిషిని చంపడమంటే వాఁడికి కోడినికాదు దోమనిచంపడంకన్నా యెక్కువకాదు. వాఁడిజీవితంలో కొన్ని హత్యలయితేచేశాఁడు కాని వాఁడికి వురిశిక్షపడలేదు. పట్టపగలు మాడోడ్డున వంటెద్దుబండి వెడుతూవుంటే అందులో నగలూ నాణేలూ వున్నాయంటే యెందరు చూస్తూవున్నాసరే! దొంగిలించాఁడన్నమాటే. చూచినా చూచినట్టు సాక్ష్యం చెప్పేటట్టయితే శిక్షలోనుంచి వచ్చాక చంపేస్తాఁడనే భయంచేత సాక్ష్యం చెప్పేవారుకారు సుమారు వాఁడికి అఱవై యేళ్ళువాఁటీదాఁకా యీలాగే నడిచింది. అసలింటికాపులని యెందఱినో యేమిరా అనే పిలిచేవాఁడు. యేపొలానున్నంచేనా వచ్చేటప్పుడు నేనుకనక వాఁడికి దారసిస్తేయెంతో వినయంగా నమస్కారాలు చేస్తూ వెంబఁడేవాఁడు. ఖయిదులో వున్నరోజుల్లో యితరజిల్లాల ఖయిదీయున్నూ తానున్నూ కలిసికొని మాట్లాడుకొనేటప్పుడు తనవూరు కడియమని తెలియడంతోటట్టేవాళ్ళు నన్నుఁగూర్చి అడిగేవారంటూ కూడాచెప్పేవాఁడు. ఖయిదులో వున్నరోజు

లలో తానుచేసే చిత్రవిచిత్ర చర్యలు వర్ణిస్తూ యింటివాండ్రా వచ్చేవాండు. తాగికూడా వుండవంచేత సుఖదుఃఖాల వదలిపెట్టేవాండువాండు. వదలించుకోవడానికి ప్రయత్నిస్తే కనిపెట్టి అనేవాడుకదా? "అయ్యా! నేనుదొంగననే హేతువుచేత మీరుభయపడుతూన్నట్టున్నారు నేను దొంగనేఅనుకోండి నిజమేకాని సామాన్యులయిళ్లల్లో నేనెన్నండూ దొంగతనం చేయను సుమండీ!" అనేవాండు. తుదకు ఇప్పటికి 13 ఏళ్ళన్నాండు కోరుకొండ తీర్థంలోపల వాక దొంగతనంచేసి వచ్చి దాన్నిగురించి పూర్వోవాళ్ళు సాక్ష్యం తనకు అనుకూలంగా యివ్వకునేటప్పటికి వాళ్ళనందఱినీ నఱకడానికిసంకల్పించుకొని మేదరాణ్ణి బెదిరించి కత్తి సంపాదించి వారకణ్ణినడిరోడ్డుమీంద పడవేసేవుదగ్గిఱ మొగంకడుక్కుంటూ వున్నప్పుడు నఱికి యింకోలాండమునసు చెప్పుచో అయినడిగితే బియ్యంయిచ్చింది కావని దాన్నిదెబ్బకొండ నఱికి పూరంతా 5—6 గంటలు అట్టుడికినట్టు వుడికించి యేకచ్ఛత్రాధిపత్యంగా ప్రభుత్వం సాగించి పోలీసువారు వస్తున్నారని తెలిసి వాక చెట్టెక్కి సాయంకాలంగా కూర్చున్నాండు. ఆ చెట్టుమొక్కదంలో మేకోంతిన్ని వాండిదికిపోలవని నేను అనుకున్నాను. వాణ్ణి పట్టుకోవడానికిశక్యమయిందికాదు. తుదకేలాగయితేనేమి కిందపడేటట్టు చేశారు. చేతులోవున్న డాలిందిజెల్ల పగిలి గాజుముక్కలు గుచ్చుకొని చచ్చాండన్నారు. చెప్పేదేమిటంటే? వానరజాతికూడా యెంతమించు నరజాతికి జీటయిందే! కాదుకాదు లాఘవంలో చాలాతేలికయిస్తుంది. దాన్నిపట్టుకో వలసివస్తే సుఖదుఃఖాల జరుగుతుందా? దానిచేత గాయాలుపడి చాలామంది ఆసుపత్రిలో కట్టుకట్టించుకోవలసి వచ్చింది. తరవాతయెవళ్ళో పట్టుకుంటామన్నారు. యిఱవైయైదు రూపాయీలిమ్మన్నారు. దస్తుచేసి యిచ్చుకున్నాము. సకలచిక్కులుపడి యేలాగయితే యేమి ప్రాణావశేషంగా వున్నప్పుడే పట్టుకున్నారు. కొప్పూరు ప్రాంతంలో వదలిపెట్టినట్టున్నారు తరువాత అదిఅక్కడ మరణించినట్టున్నూ విన్నాము. చెప్పేదేమిటంటే? యెంత చిక్కువచ్చినా కోంతినిగాని పందికొక్కునుగాని చంపడానికింగాని చంపించడానికింగాని మన హిందువులు సమ్మతించరు. మాంసభక్షకులు

స్వహస్త పరహస్తాలచేత యేవో కొన్ని జంతువుల చావుకు సమ్మతించేవారే అయినా పయి జంతువుల విషయంలో బ్రాహ్మణులతోపాటువారే. యీ విషయంలో పాశ్చాత్యులే అయితే లేశమున్నూ వెనుదీయరు. వారికిదాని వల్ల ప్రత్యవాయం కలిగినట్టున్నూ వినం. మనకయితే వెంటనే కలిగి తీరుతుంది. దానితోపదిమందిన్నీ-"అమగో అపనిచేశాడు. వెంటనే దృష్టాంతం కనపడిం" దంటారు. "యదనంతర" న్యాయాన్నిబట్టి అదీనిన్నీ సరిగానే తోస్తుంది. పూర్వం యేదేనా ఘోరకృత్యం చేయవలసివస్తే యేకచ్ఛత్రాధిపత్యంగా యేలే చక్రవర్తికూడా జంకేవాడు. యిప్పుడో పేరుకు గుళ్ళో దేవుడులాగ ప్రభువంటూవున్నా పాలించేది దేశంలోవుండే నోరుగల ప్రముఖులెవరో కొందఱుగా వుండడం చేత ప్రత్యవాయజనకమైన పనులు చేసినా వాట్లవల్ల వచ్చే ప్రత్యవాయాలు సంఘముమీఁద "తిలాఃపాపం తలో పిడికెఁడు" గాసర్దుకుపోతూవున్నాయి. కాని బాధిస్తూవున్నట్టు లేదు. యేదో ప్రసక్తాను ప్రసక్తంగా యింత వ్రాశాను. గృహస్థుకు యీతిబాధా రాహిత్యం చాలా అవసరం. అట్టి యీతిబాధలను కొన్నిటిని కనపఱిచి వ్యాఖ్యానించివున్నాను. మఱికొన్ని యింకా లేకపోలేదు. అవీ వ్రాస్తాను. భగవంతుఁడు సర్వదయాపరుఁడు. అట్టియీతిబాధలను తొలగించి తనప్రజలకు సర్వవిధాలా సుఖప్రదాత అగుఁగాక అని ఆశీర్వదిస్తూ దీన్నిముగిస్తున్నాను.

---

# కొత్తరకం ఈతిబాధలు

యిదివఱలో మన పూర్వులు ఆకాలాన్ననుసరించి చెప్పిన యీతిబాధలని గూర్చి వక విపులమైన వ్యాసాన్ని వ్రాసివున్నాను. యిప్పటి దేశకాల పాత్రలనుబట్టి చూస్తే యెన్నో యీతిబాధలు కొత్తరకాలు కనపడతాయి. యివన్నీ చాలాభాగం యీ యిరవయ్యో శతాబ్దంలోనే యెక్కువవ్యాప్తిలోకి వచ్చి గృహస్థులను పట్టి పీల్చి పిప్పిచేస్తూ వున్నాయి. యీ బాధలు పట్నవాసాలలో వుండేవాళ్ళకి చెప్పనే అక్కఱలేదు. పల్లెటూళ్ళ వాళ్ళని కూడా కొంతవఱకు బాధిస్తూవున్నాయి. వీట్లని యిన్ని అన్నీ అని చెప్పడానికక్కూడా శక్యంగావున్నట్టు తోఁచదు. యివి యెప్పటికప్పుడు వుద్భ

పదేళ్ళు. అప్పుడు నా వద్ద మూరెండో చిరంజీవి అదే యీడువాఁడున్నాఁడు. వాఁడుకూడా చాటునామాటునా అప్పటికే అలవాటు పడ్డాడేమో ? అని నాకు అనుమానం వుండడంచేత — "చూచావా, నాయనా ! ఆ పిల్లాఁడు పడేబాధ చూచావా ?" అంటూ యేవో నీతివాక్యాలు కొన్ని బోధించాను. ఆకారణం చేతో యేమో వాఁడుమాత్రం యీ అలవాటుకు లోఁబడలేదు. బీడీలు యింతింత వెలగల వున్నాయో లేవో కాని మన దేశంలో వాట్ల ప్రచారము మున్నూ ఆ బాలవృద్ధంగా వ్యాపించేవుంది. మా చిన్నతనంలో చుట్టలేకాని యివిలేవు. డబ్బు 1 కి యిరవై చుట్టలదాకా యిచ్చేవారు. సిగరెట్లూ, బీడీలు వచ్చాక చుట్టలేమైనా చవకైనాయేమో ? అనుకుంటే అదిన్నీ కన పడదు. అవి డబ్బు 1కి రెండుమూఁడూగా వున్నాయి. మొత్తం యీ మూఁడుగాని యిందులో రెండుగాని అథమం వకటిగాని అభ్యాసం లేని బాలవ్యక్తి నూటికి యే వొకటో తప్ప కనపడనే కనపడదు. కొత్త నాగరికత కలవాళ్ళు మాత్రం చుట్టజోలికి రారు. యేబ్రాసులుగావుండే పైల కావుపట్టాప్ల చుట్టలూ కాలుస్తారుగాని వీట్లల్లో యేదో మహావిశేషం వుందని యీ నాగరికపు చుట్టలు (సిగరెట్లు, బీడీలూ) కూడా పండుగ పబ్బాలు తటస్థించినప్పుడు మూధానంగా కాల్చుకుంటూ వుంటారు. యిది యిప్పటికాలానికి సామాన్యసంసారులకు వక యీతిబాధగానే కనపడు తుంది. కొంచెం వైదీకవేషంగా వుండేవాళ్ళకో ? చెప్పనే అక్కఱలేదు. యిది చుట్టకంటెకూడా అనారోగ్యమనిన్నీ దీనివల్ల గుండెజబ్బు వగయిరా యెన్నో జబ్బులు బయలుదేరతాయనిన్నీ యింగ్లీషుడాక్టర్లు చెప్పడమే కాకుండా పత్రికలలో కూడా వ్రాస్తూవుంటారు. కాని ఆ మాటలు యెవరూ పాటించేటట్టు కనపడదు. యితరుల మాటదాఁకా యెందుకు ? ఆ డాక్టర్లే సిగరెట్లను పరంపరగా కాలుస్తూవుంటే, యేమనుకోవాలి ? పాశ్చాత్య నాగరికతకు యిది వక శిరోభూషణంగా వున్నట్టు ఆ నాగరికతకు అల వాటుపడినవారి ప్రవృత్తివల్ల గోచరిస్తుంది. యెందరో యిది నోట్లో వుంచేనేకాని మాట్లాడనేలేరు. మనదేశస్థులలో చుట్టకంటె నస్యానికి సభా పూజ్యత వున్నట్టే ఆదేశంలో సిగరెట్టకున్నూ సభాపూజిత వున్నట్టు

విషేధానికి పునర్క్రమిస్తే 24 లక్షలు బడ్జెట్టులో లోటు కనిపిస్తూవుందిగదా! యీ సిగరెట్ల దిగుమతీని నిషేధిస్తే యెంతలోటు కనిపిస్తుందో? యివన్నీ పూడ్చాలంటే శక్యమో? కాదో? అదిన్నీకాక ఆ యీ వస్తువులు లేకుండా చేసి మాన్పించడమనేది కొత్తపంథ. మన పూర్వుల పంథ యిది కానే కాదు. నీతిచేత మనుష్యులు దుర్వ్యసనాలనుంచి తప్పించుకోవలసిందనే కాని, స్త్రీలను లేకుండాచేసి పురుష వ్యభిచారాన్నీ, పురుషులను లేకుండా చేసి స్త్రీ వ్యభిచారాన్నీ, మద్యం లేకుండా చేసి తాగుణ్ణీ తగ్గించడం కానే కాదు. సమస్తమూ వుండనే వుంటాయి. వున్నా యెవఁడు యోగ్యుఁడుగా వుంటాఁడో వాఁడే గణనీయుఁడని వాళ్ళ తాత్పర్యం. అట్టి యోగ్యత కలగడం యేమహావ్యక్తులకోతప్ప దృశ్యాదృశ్యం. కనక పదార్థం దొరక్కుండా చేస్తే— "పురుషాణా మభావేన సర్వానార్యః పతివ్రతాః" అనే మాదిరి నేఁటి ప్రాజ్ఞులు సదుద్దేశంతోనే వక కొత్తమార్గం తొక్కుతూ వున్నారు. దీన్ని కాదనడానికి అంతకన్నా మంచిమార్గం చూపించేవా రయితే తప్ప చేతఁగాని ఆక్షేపకులకు యుక్తంకాదు. కాఁబట్టి యీ యీతి బాధను తప్పించడానికి యీ సిగరెట్ల దిగుమతీ లేకుండా ఏదేనా సదుపాయం యిప్పటి గవర్నమెంటు చేస్తే చాలావిధాల బాలకులు బాగుపడతారని నాకు తోస్తుంది. కల్లు దుకాణాల స్థానంలో "టీ-కాఫీ" వగైరా పానపదార్థాలు విక్రయించే దుకాణాలు వెలిశాయంటూ కొన్ని పత్రికలు సంతోషాన్ని వెలిపుచ్చాయి. కాని ఆ సంతోషం కొంత ఆపాతరమణీయంగా లేకపోలేదనాని బాగా విచారిస్తే మన పూర్వజీవితానికిన్నీ మన ఆంధ్రదేశానికిన్నీ యివీ అనర్థాపాదకాలే అవడంచేత — "ముల్లు వుచ్చి కొఱ్ఱు డుఁచిన" చందమే అనుటకు సందేహంలేదు. కాని ప్రపంచదృష్టిలో మాత్రం యిది "గుడ్డిలో మెల్లగా" కనబడుతుంది. అయితే యీ పుద్యమాన్ని నడిపేవారు దాక్షిణాత్యులు కావడంచేతనేమి, వారికి "కాఫీ-టీ" పానం అనుశ్రుతంగా వున్నదే అవడంచేతనేమి దీనికి వారు సంతోషించారంటే వింత కనపడదు. మనదేశంలోకూడా యజ్ఞంలో శ్రౌతులదగ్గిఱ మంచిన్నీ సర్వదా సదాచారాలలో అసిధారావ్రతంగా సంచరించే వితంతు

వుపలబ్ధమైన దనేయెడల ఆశ్చర్యపడవలసి వస్తుంది. అష్టభాషా వాగను శాసనుడైన నన్నయ్యా కాఁడుగదా? అతని పసులకాపరి గూడ యిట్టి ప్రమాదానికి గుఱికాడు. తెలిసిందా?

"ఉ. మూగురయందు నన్నయ సమున్నతుఁడై కడు లక్షణంపు బ్రోవై"

"ఉ. అందాది దొడంగి మూడు కృతులాంధ్ర కవిత్వ విశారదుండు
విద్యాదయితుం డొనర్చె మహితాత్ముడు నన్నయభట్టు దక్షతన్."

"సీ. నన్నయకవి పెట్టినాడు కదా!
తిక్కనాది కవీంద్రుల కాటిభిక్ష."

అట్టి నన్నయ్యా యిట్టి తప్పుడు ప్రయోగం చేస్తాడంటే విజ్ఞలోకం సమ్మతించదు. ఇంతకూ సుప్రసిద్ధంగా వుపలబ్ధ మవుతూవున్న "భారత భారతీ సముద్రము." అనే పాఠం కంటె ఆ డొంక తిరుగుడు పాఠంలో యే విధమైన గుణము కనపడదు. పైగా దోషం కనపడుతూవుంది. నేని ప్పటికి చాలా ప్రతులు భారతం చూచాను. నాకీ భారతభారతీపాఠమే కాని భారత వాహినీ పాఠము కనపడలేదు అని మళ్ళా వ్రాస్తున్నాను. దీనిఅయో గ్యతను గూర్చి కొంచెం వ్యాకరించాను. అసలు పాఠము యొక్క యోగ్య తను కూడా వివరిస్తాను.

భారత భారతీ సముద్రము; భారత = (వ్యాసకృతమైన) భారత గ్రంథంయొక్క, భారతీ = వాణి, అనగా? భారత వాఙ్మయ మనెడి సముద్రము అని రూపించాడు కవి. అనేక వ్యాసఘట్టాలతో నిండి మహా గంభీరంగా వుండేది గనక— సముద్రత్వేనా రూపించడం యుక్తమే. యీ రూపణకు యితరాపేక్షతో పనిలేదు. కాళిదాసుగారి కవిత్వంలో మన పైత్యం చేర్చడంవల్ల అది ఛర్దికి కారణ మవుతూ వుంది. ఆయీ చక్కని రీతిని వదలుకోవడం డొంకతిరుగుడు త్రోవ పట్టడం. యిది "చక్కని రాజ మార్గము లుండగా సందులు దూరినట్లు" గాక మఱేమి? నన్నయ్యకు అప్రయత్నసిద్ధంగా యమకం దొర్లుతుంది.

1. ఉ. భారతభారతీ శుభగభ_స్తి చయంబులు.........
2. చ. భారత భారతీ సముద్రిము దరియంగ నీదను.........
3. మ. కురువృద్ధుల్ గురువృద్ధ బాంధవు లనేకుల్ .........
4. మ. మదమాతంగ తురంగ కాంచన లసన్మాణిక్య గాణిక్య....

యింకా యెన్నో యీలాటివి చూపవచ్చును. దిద్దిన వాహినీపాఠంలో చెప్పే అపార్థాన్నిబట్టి దురుద్ధరమైన వ్యాకరణదోషం తగలడమే కాకుండా (యీ దురుద్ధర దోషం హ్రిస్వం రావాలనేది స్థూలదృష్ట్యా చెప్పేమాట. సూక్ష్మదృష్ట్యా అయితేనో? భారతవాహినీకః అవి కప్పరావాలనేదే. ఇందులో యేదేనా మీకు చిక్కే అన్నది పరమార్థం) యమకం కూడా చెడుతూ వుంది. తాను యీవిధంగా తప్పుతోవ్రలో కలంనడుపుతూ అసలు పాఠాన్ని గూర్చి కొన్ని అసంగత వాక్యాలు 'భారతభారతీ' అని దిద్దినారు. ఈ మార్పునం దేమి విశేషము గ్రిహించిరో?............"ఇది అనౌచిత్యము సమంజసముగ లేదు." అంటూ వొక కాలం జ్ఞానలవదుర్విదగ్ధపు మాటలతో నలుపు చేయబడింది. వాహినీ అనేది పూర్వపాఠమట? యిది యదార్థమగు మాటేనా? కావన నేల? అంగీకరింతము గాక. ఆ పక్షంలో యిట్టి అవ్యుత్పన్నులు యీ పిదపకాలంలోనేకాదు. పూర్వకాలంలోకూడా కొందఱు వుండేవారని తేల్తుంది. వ్యుత్పన్నులే అయితే వ్యాకరణ దుష్టమైన పాఠాన్ని కల్పించరు. యితరులు కల్పి_స్తే సమ్మతించరు. "నోచే ద్దుష్కృత మాత్మనా కృతమివ స్వాంతా దృహి ర్మాకృథాః" అన్నాడు పండితరాయలు. యేదో సందర్భంలో యెప్పుడో మేమున్నూ— "—వాకురు కింతుమాకురు వృథా పద్యాని గద్యానివా" అని వొకరిని మందలించవలసి వచ్చింది. అర్హత వుండుగాక; లేకపోవుగాక, యేదో భారతాన్ని బాగుచేదామని పూనుకోవడం బాగానేవుంది. యీ తలకు తగని మాటలెందుకు? "మొండివాదం.... తెలివితక్కువ....తాజెడ్డకోతివనమెల్ల జెరచె...." అఈ ప్రిసంగం నన్నుగూర్చి చేసింది. యెందుకంటే? నేను "భారత భారతీ సముద్రము" అనేపాఠం వ్యాకరించినందుకు. పైగా అర

జ్యాపర్వంలో సూచితమైన "పరపూరితమ్ములై" అనే భావ్యనర్థ సూచకమైన విశేషం. ఆదిపర్వంలోనే "చ. అమలిన తారకాసముదయమ్ములన్... ...." అనేపద్యంలోనే సూచితమయిందని ఋజువు చేసినందుకు. నేను ఆయీ అపార్థం భాసిస్తూందన్నానుకాని ఆయీ అపార్థం గ్రంథకర్తకుసమ్మతమని అనలేదు. యీయన నేను సమ్మతమని అన్నట్లు కల్పించడం వొకటి; (చూచారా? యీయనకు అసత్యమంటే యెంత భయం లేదో) అపార్థాలూ అమంగళార్థాలూ వొక్కొక్కప్పుడు అవశాత్తూ యెంతటి మహావిద్వత్కవికేనా సరే దొర్లుతూ వుంటాయి. ఆపని జరిగాక పరిశీలించుకుంటే (గ్రంథకర్తమరణానికి సంబంధించేవి కాకపోతే) గ్రంథకర్తకే గోచరిస్తాయి. యిది అట్టిది కాదు గనక, యేది? "పరపూరితంబులై" అనేది యితరులకు గోచరించింది. యిక నేనల్లా—"అమర్చిన దానిలో అత్తగారు వేలెట్టింది" అన్నట్టు కవి పరంపర చెప్పుకొనేదాన్నే ఆయీ "అమలిన తారకా" పద్యంలోని "ఎన్నను – ముట్టను – ఈదను" అనే తుమున్నంతాలను వ్యతిరేకార్థ కోత్తమ పురుషైక వచనాలుగా (వీలుండబట్టే సుమండి) సమన్వయించి చూపి బలపరిచాను. అయితే ఈయన యెవరో, పాపం! నాఁమీద **కలియబడతారెందుకో**? యెందుకా? పేరు కోసం అంటారనుకుంటాను. యింతమాత్రంతో పేరు వస్తుందా? అయ్యో? రాకేం. వెనక జరిగిన యితిహాసం కీ॥ శే॥ రాణి శ్రీ విక్టోరియారాణిగారికి సంబంధించింది. టుపాకీగుండు దాటిపోయింది. ఆకొట్టిన వ్యక్తిని పిల్చి "యిదేం పాపం జగన్మాత నీకేం అపకరించింది" అని అడిగితే ఆ మనిషి చెప్పాడుగదా అయ్యా! నాకు వొక కోరిక వుంది. నా మనస్సులో లేశమూ దురుద్దేశంలేదు, చిత్తగించండి. ఆ కోరిక పెద్ద పేరు సంపాదించాలనేది. దానికి యింతకన్న వుపాయంకనపడలేదు. యీ పాటికప్పుడే నా పేరు యెన్ని పత్రికలలోనో అచ్చవుతూ వుంటుంది. సప్తసముద్రాలూ దాటుతుంది. అని చెప్పేటప్పటికి చక్రవర్తిని ఆ మానిసి చెప్పినది యదార్థమే అయివుండునని నిశ్చయించి అతనికి యేవిధమైన శిక్షలేకుండా

విడుదల చేయించిందని చెప్పుకోగా వినడం. యీాయన యిప్పుడిప్పుడు వార్ధక్యంలో పైకివచ్చారుగాని, పేరుకోసం యత్నం చాలా కాలాన్నుంచి చేస్తూన్నట్టు వ్రాతమూలకాలు ఆధారాలున్నాయి. యీాయన కేవో కొన్ని బిరుదాలు (నేతి బీఱ కాయలు) కూడా స్వగ్రామంలోనే (యింట గెల్చి రచ్చ గెలవమన్నారు. గదా!) అలంకరించారు. యిక నేం కావాలి? "తిక్కన సోమయాజిగారు" భారతాన్ని పూర్తిచేస్తే యీాయన వ్యాకరించడానికి ఆరంభించారు. తెలుగుగదా అనుకున్నారు కాబోలును! అలా అనుకుంటే విరాట పర్వం దగ్గిఱనుంచి పని జరుగుతుందేమో? లేదా? అరణ్యపర్వంలో వున్న—

"చ. స్ఫురదరుణాంశు రాగరుచి బొంపిరి వోయి........"

అనే పద్యం దగ్గిఱనుంచి కూడా పని జరుగుతుందేమో కాని,

"ఉ. శారదరాత్రు లుజ్జ్వల లసత్తర తారక హారపంక్తులన్
జారుతరంబులయ్యె వికసన్నవ కైరవగంధబంధురో
దారసమీర సౌరభము దాల్చి సుధాంశు వికీర్యమాణ క
ర్పూరపరాగపాండు రుచి పూరము లంబరపూరితంబులై"

యీా వాళ్ళెఱుగని శివపు ధోరణి కవిత్వాన్ని వ్యాకరించడానికి చాలా సామగ్రి వుండాలి. ఆ యీా పద్యంగాని, యింకా కొన్ని పద్యాలు ఆదిపర్వంలోనే "మాకు బ్రిసన్నులయ్యెడుఁ" అనే ఘట్టంలో వ్రాసే నన్నయ్యకే తాను చెప్పేది తెలుగు కవిత్వ మనే జ్ఞప్తి వుందనడానికి లేశ మేనా అవకాశం కనపడదు. వీట్ల ధోరణి మినపగుగ్గిళ్ళు కాదు, యినప గుగ్గిళ్ళు. అతనికి యెన్నో తెలుగు పదాలు మాఱుమూలవి వచ్చివున్నా సంస్కృత పండితులు యీాసడిస్తారనే శంక యింకా వదలక విశేషించి సంస్కృతమే వాడేవాడు. అయితే ఆరంభించిన స్వల్పకాలంలోనే స్వర్గ తుడు కాబట్టిగాని, ఆలాకాక యావద్భారతమూ అతడేఅంధ్రీకరిస్తే తెలుగు పదాలకే ప్రాధాన్యం యిచ్చే రచనకూడా ముందు ముందు విస్తరించి వుండేదేమో? అక్కడక్కడ ఆంధ్రి రహస్యజ్ఞత—

క. అడవులు నేఱులు నప నీవిడసినయవి యెట్లు పుణ్యభాగీరథి యీా
పుడమి గలవారి కెల్లను నెడపక సేవ్యంబకాక యిదినీయదియే.

యిత్యాది పద్యాలలో వెల్లడిస్తూనే వచ్చాడు. యీ పద్యంలో నల్లా— "పుణ్య భాగీరధి — సేవ్యంబు" యీ మూడు పదాలు మాత్రమే. లేదా? పుణ్యభాగీరధి సమస్త పద-మనుకుంటే రెండు మాత్రమే తత్సమాలు కాని తక్కిన యావత్తూ తెలుగే. కవి బ్రహ్మకు యిదే ఒజ్జబంతి. దీని త్రోవనే యావత్తూ నడిపించాడు మహనీయుడు. యిక వుదాహరించిన— "శారద రాత్రులు" మార్గం నేటివఱకు యెవ్వరికీ అందలేదు. "వీరుడిక లేడు ప్రితి రఘువీరుడొకడు" "మొక్కపాటింట నోటంట ముక్కలేదు పేరి శాస్త్రికి గలదంట పెదవిపాటు" అన్నమాదిరిని ఆంధ్ర కవితా పితామహు నికి కొంత అందిందని చెప్పవచ్చును. ఇందులకు— "మ. బహు రత్న ద్యుతిమేదు రోదరదరీ .... .... మత్కాంతార సంతానముల్" వగయిరా కొన్ని పద్యాలు బోధకాలుగా తోడ్పడతాయి. అయితే తెలుగు కవిత్వం ఆలా (శారద రాత్రుల పద్యం చూ.) వుండాలా? లేక యీలా (క. అడవులు నేరులు పద్యం చూ.) వుండాలా? అనే సందర్భం యిక్కడ వివరించేది లేదు. రెండు విధాల రచనకూ నన్నయ్యయే మార్గదర్శి (మధుమయ ఫణితీనాం మార్గదర్శీ మహర్షిః) ఆ రెంటిలో వొకటి అంతో యింతో అనుసరించడానికి వీలు. అదేనా యెవరికి? తిక్కన్నవంటి మహనీయునకు, యెఱ్ఱన్నవంటి మహనీయునకు, పోతన్న వంటి మహనీయునకు, యింకా కొందరు మహనీయులకు మిగిలినదో? (శారద రాత్రిలు) ఆంధ్రి కవితా పితామహుని రచనలో కొంత కనపడు తుంది అని తెలిపేవున్నాను.

అయితే యితరకవులకు సంస్కృత సమాస గ్రధనమే చేతగాదన్న మాట కాదు. అట్టి ధార దొరలదు. "కో వేత్తి కవితాతత్త్వం" నన్నయ్య రచించిన భాగం కూడా సోమయాజిగాని, శంభుదాసుడుగాని, పునఃపాకా నికి దింపలేక వుపేక్షించలేదు; నన్నయ్య యందు వుండే అనుగ్రిహం చేతనూ కాదు. దింపితే వచ్చే చిక్కు వారికి తెలుసు. ఆ యీ విషయం పునఃపాకానికి దింపినవారు ఋజువుచేసేవున్నారు గనుక, వివరించ నక్కఱు లేదు. శాఖాభిమానాలు వగయిరాలతో యివి తేలేవిగావు. "గుణాః పూజా

స్థానం గుణిషు నచ లింగం నచవయః" "ఘనమతు లెల్లవారికి నకారణ బంధులుగారె? సత్కవుల్"

యిక ప్రస్తుతం యీ వ్యాసం వ్రాయడానికి కారణభూతులెవ్వరో? ఆ వృద్ధులకు వైదీకి అనేటప్పటికల్లా, ఆకాశం పొడుగున ఆగ్రహం ఆవిర్భవిస్తుంది. చచ్చిన భట్టారకునిమీద కూడా యీయనకు ఆగ్రహమే. అయితే బ్రతికివున్న నా (తి. వెం. కవులలో నొకడనైన) మీద చెప్పేదేమిటి? ఆ కారణం చేత— "పదవనాటి ముత్తైదువ" లోనగు తిట్లు తనకు వాచోవిధేయంగా వచ్చినవి విమర్శనమనే మిషతో బహూకరించడం జరిగింది. (ఆయన విమర్శనం చూ.) అందుకే సంతోషించి నేను— సేల్జోడు బహూమతీ (70 రూపాయీల విలువది) చేయదలచి ఆహ్వానించాను. గాని, తిట్టి యేమొగం పెట్టుకొని సత్కారం పొందేది అనే సందేహం బాధించి కాబోలును రాలేదు. (కృష్ణ చూ.) యేదో మిషపెట్టి దూషించడం మాత్రం మానలేదు. కొన్ని "ఐమీను" వ్రాతలుగా వుంటాయి. కొన్ని తప్పుకోవడానికి అవకాశం లేకుండానే వుంటాయి. ఈయన "కవియశఃప్రాప్తి" దిగ్విజయానికి ప్రయత్నం. అందుకోసం భారతంలో వుండే సంశయాలు తీర్చడానికి పూనుకున్నారు. ప్రథమకబళే మక్షికాపాతంగా దివ్యమయిన- "భారత భారతీ సముద్రి" పాఠం అపపాఠంగా తోచింది. పాపం అది అనాదిసిద్ధమైన శుద్ధమైన పాఠం అనేసంగతి గోచరింపక నేనేమో కల్పించిందనుకొని వషట్కారాలకు ప్రారంభించాడు. అన్నిటికన్నా నాకు ఆశ్చర్యాన్ని కలిగించేది యీయన యనాత్మజ్ఞత యే ధర్దుఫారం కుఱ్ఱలకో వుండే తెలుగు పాండిత్యంతో "భారత మాంధ్ర సత్కవుల పాలిటివేదము" అనే భారతాన్ని, అందులోనూ నన్నయ్య కవిత్వాన్ని వ్యాకరించడానికి పూనుకోవడం ఆశ్చర్యం కాదా? మఱి "నసాహస మనారుహ్య నరో భద్రాణి పశ్యతి" భారతిని వాహినిగా మార్చడం, నదులను సముద్రంలో కలపడం, ఆ నదులు భరతవీర చరిత్రలనడం, యెంత సౌదభ్యంగా వుందో విజ్ఞులు పరిశీలించాలి. "యథా నద్య స్స్యందమానాస్సముద్రే అస్తం గచ్ఛంతి నామరూపే విహాయ" యీ వ్యాఖ్యానపు ఒడావడిలో బాజాల సందడిలో

మంగళసూత్రం మఱిచినట్లు వాహినీశబ్దం పొందేమార్పు గోచరించలేదు. తాడూ బొంగరమూ లేక వ్యాఖ్యానాలు మొదలెట్టే త్రిలోక విజయులకిది గోచరించేదికాదు. దీనికి సంస్కృత వ్యాకరణ పరివేశముండాలి. లెక్కా-డొక్కా-, సర్వీగిర్వీ యివి వుపకరించవు. ధారవుంటేసరి; ప్రతివాడూ అంతో యింతో కవిత్వం అల్లవచ్చు— "వుంసివా కొమ్మెక్కి యిత్యవులు గూయగా కోనంగుడేయగా...." "శుద్ధనురన్నది రుద్రరూపమై" యీమాదిరిగా పద్యాలల్లడానికీ వ్యాఖ్య చేయడానికీ చాలా భేదం వుంటుంది. దీనికి పిండి వుండాలి—అని యీయనకు చెప్పడం తప్పక వచ్చింది. హితవు చెపితే యీయనకు కోపం వస్తుంది. తిట్లు తినవలసివస్తుంది. భవతు. అందుకు వైదికశాఖలో పుట్టడమే చాలును. యితరాపరాధాలతో ఆవశ్యకం లేదు. అసలు తిక్కన్న సోమయాజులుగారికి వైదీకమంటే యెంత గౌరవమో యీ అభినవ పూర్వునకు అంత వైరం. ఆ మహనీయుడు భారత రచన కారంభిస్తూ "వైదికధ్యాయిత కిచ్చమెచ్చు పరతత్త్వము గొల్తు" అంటే యీయన "వైదికధ్యాయిత కిచ్చ మచ్చరము దాల్తు" అనడానికి సిద్ధం. తగినంత శక్తిలేదు. పెద్దకుండల కెసళ్ళు పెట్టడం. "ఉద్బాహురివ వామనః" దిద్దిన పాఠం లేదా సదసద్వివేచనా జ్ఞానం లేక స్వీకరించిన (వాహినీ) పాఠం సరుకు బైటపెట్టింది. యిప్పుడు కాగతిః, యీయన యేదో వంకపెట్టి నన్ను దూషించడానికి అలవాటుపడి చాలా కాలమైంది. "అథాతో ధర్మజిజ్ఞాసా" అంటే నీయమ్మ జిజ్ఞాసా అనేమాదిరి వారితో వాదోపవాదాలు సమంజసం కావని వూరుకున్నా యేదో మిష కల్పించి, "తిరుపతి వేంకటేశ్వర కవులు అధమ కవులు" అనీ, యేమో అనీ వ్రాయడానికి (ఆంధ్రవాణి చూ.) అంగీకరించి వుపేక్షించా. యీ వ్రాతనే "ఐమీను" పదంతో స్పృశించి విడిచాను. లోగడ గ్రంథ విమర్శనమనే పేరుతో బోలెడు— అవాకులూ చవాకులూ లోగడ ప్రచురిస్తే అందుకే నేజోడు బహుమతి చేదామనుకున్నాను. వ్రాతల ధోరణిలో వున్న మాటలు చూచి నాకన్న వృద్ధుడనుకున్నాను. ఆ గ్రామ కాపురస్తుల ద్వారా విన్న వినికిని బట్టి చూస్తే అయిదాఱేళ్ళు చిన్నగానే తేలింది. దేశాభిమాన దేహాభి

బండను అన్న సోఁపేశాఁడ్రి పెద్దలద్దు) చెప్పుకొనే తెగలోది. మీ మట్టుకు భారతాదులు చదువుకోవడానికీ, కవిత్వ ధారవుంది గనక పద్యాలల్లుకోవడానికీ సరిపోతుంది గాని యితరానికి సమర్థం కాదు. యితరమనగా వ్రాజ్ఞటికం. వ్రాజ్ఞటికమంటే వ్యాఖ్యానం. మీరుభారత సంశయ విచ్ఛేదం వ్రాయడమంటే వ్యాఖ్యానం వ్రాయడమన్నమాటే. భాషాజ్ఞానం నిష్కృష్టమైనది లేని మీకు అంతా సంశయమే. వాహినీ పాఠానికీ భారతీపాఠానికీ వున్న తారతమ్యం తెలియదాయె, మీరు సంశయాలు తీర్చేదేమిటి? సంస్కృత జ్ఞానం సంపాదించుకోవలసిందని మీవంటి పెద్దలకు సలహా యివ్వడమూ పొసఁగదు కదా? యెందుచేత? ''శైశవేఽభ్యస్త విద్యానామ్'' అన్నాడు కదా? కాళిదాసు. అందుచేత యీ జన్మానికి అది ఘటించదనుకోవాలి. అలఁబహూనా

తే. గీ. తెలుఁగు తెలుఁగని అద్దాన దిగుటెకాని
సంస్కృతమ్మనకన్నఁ గష్టమ్మ హెచ్చు
ఒక్కదానఁ బరిశ్రమమున్నజాలు
దాని కిద్దానికో? రెంటఁదవులవలయు.

రోలొచ్చి మద్దెలతో మొఱపెట్టుకుంటే మద్దెల చెప్పిన సమాధానం మీరు వినే వుంటారు. నా సలహా సమంజసంగా తోస్తే స్వీకరించండి. లేదా త్యజించండి. పెద్ద కుండల కెసళ్ళు మానండి.

---

## వడ్లగింజలో దిబియ్యపుగింజ

"ఉ. దిద్దకుఁడయ్య! భారతము" అని సుమా రిప్పటికి నలభై యేళ్ళకుముందు మేము (తి. వెం.) ప్రార్థించివున్నాం (కలగూరగంప). దాన్నిగూర్చి నేడు కొంత ప్రసక్తికల్గి నాలుగు మాటలు వ్రాస్తున్నాను. నాకిప్పుడు 77 వత్సరాల వయస్సు. నా జీవితంలో యెన్నఁడూ అనుభూతం

కానిది యీవిషయం. కేవలం-సత్యం మీఁద ఆధారపడి వుండేది. (నాఽనృతం వదేత్) శ్రీమదాంధ్రమహాభారతం ఆదిపర్వంలో గ్రంథారంభంలో-

"చ. అమలిన తారకా సముదయమ్ముల నెన్నను సర్వవేదశా
స్త్రముల సశేషపారము ముదమ్మునఁ బొందను బుద్ధి బాహువి
క్రమమున దుర్గమార్థ జలగౌరవ భారత భారతీ సము
ద్రము దఱియంగ నీఁదను విధాతృనకైనను నేరఁబోలునే?"

అని గ్రంథకర్త వినయార్థం వొకపద్యం వ్రాశాఁడు. కదళీపాకంలో వున్న దీనికి వ్యాఖ్యానం అక్కఱలేదు. కాని ప్రకృతం దీన్నిగూర్చి వాదోపవాదాలు జరుగుతూ వుండడంచేత కొంచెం సమన్వయం చూపుతాను. అమలిన తారకా (నక్షత్ర) సముదయములను లెక్కపెట్టడానికిన్నీ సర్వ వేదశాస్త్రములయొక్క, అశేష పారము = యావత్తు అంతమూ పొందుటకున్నూ (అనంతశాస్త్రం బహువేదితవ్యం....య త్సారభూతం తదుపాసితవ్యం) ముదంబునన్, అన్నది ఛందోమాత్రప్రయోజకం, బుద్ధిబాహు విక్రమమున = బాహువిక్రమమునందు బుద్ధిబలంచేత (ఉపమితం, కాని రూపకం కాదు. నన్నయ్య తుదముట్ట తగ్గది సముద్రమువంటి భారతవాఙ్మయంగాని సముద్రం కాదు) దుర్గమార్థజలగౌరవ = జలాతిశయము వఁటి లోతు తెలిసికో శక్యం గాని అర్థము (వ్యాసఘట్టములు) గల భారత భారతీ; భారత = వ్యాసకృత భారతంయొక్క భారతీ = వాఙ్మయము (గీర్వాగ్వాణీ సరస్వతీ. సరస్వతీ పర్యాయము లన్నీ వాగ్వాచములగుటకు విప్రతిపత్తి లేదు) ఆ వాఙ్మయము (భారతగ్రంథమన్నమాట) ఎంతటి బాహుబలంకలవాఁడూ, యెంతో జలంతో నిండివుండే సముద్రాన్ని యీఁదలేఁడు. అలాగే యెంతటి బుద్ధిబలం వున్నవాఁడూ భారతవ్యాస ఘట్టాలు సమన్వయించుకో నేరఁడని తాత్పర్యం. యిదిటివ్వణి- సముద్రమువంటిది. (దురవగాహకత్వాత్ సముద్రంతో పోల్చినాఁడు).

సముద్ర తుల్యమగు భారతమును (సపాదలక్షగ్రంథం అనువదించాలి. శ్రేయాంసి బహువిఘ్నాని. కీడెంచి మేలెంచమన్నారు పెద్దలు)

దటియంగా ఈఁదను, గ్రంథపక్షంలో లక్షణయా అనువదించడమునకు (సముద్రపక్షంలో వాచ్యార్థమే) విధాతృనకైనను నేరఁబోలునే- అని నన్నయ్యగారు అహంకార నిరాసార్థం యీ పద్యం వ్రాసియున్నారు. యిది కవుల ఆచారం. యింతమాత్రంచేత గ్రంథకర్త అసమర్థుఁడని తాత్పర్యంరాదు.1"శ్లో. భాష్యాబ్ధిః క్వాతిగంభీరః క్వాహం మందమతిః ...." 2 "శ్లో. మందః కవియశః ప్రార్థీ." యీలా అన్నంతమాత్రంచేత ఆకవి అసమర్థుఁడూగాఁడు. "కోఽన్తి ధన్యో మదన్యః" అంటే సర్వాధికుఁడూ గాఁడు. ప్రస్తుతం విద్వత్కవీంద్రులైనవారిని నేను ప్రశ్నించేదేమిటంటే? నేను వ్రాసినసమన్వయం గ్రంథకర్తకు వివక్షితమైనదేనా? లేక దానికి భిన్నంగా వుందా? అనిన్నీ, ఆ యీపద్యంలో యేదేనా పాఠాంతరం వున్నట్టు మీ రెఱుఁగుదురా? అనిన్నీ, అవున్న పాఠాంతరం నేను దీనిలో లిఖించినట్టిన్నీ నేఁటిప్రతులలో బాహాటంగా వుపలబ్ధమవుతూ వున్నట్టిన్నీ- పాఠంకంటే రమణీయమా? అనిన్నీ.ఋజుబుద్ధిచేత విచారిస్తే ఆయీపద్యం సమన్వయించుకోవడానికి నిఘంటుసహాయం గాని యితరసహాయంగాని అక్కఱ లేదు. వుండులేనిచోట వుండు పుట్టించి యేదో వింతపాఠాన్ని కల్పించి వ్యాఖ్యానం చేయడానికి ఆరంభిస్తే వ్యాకరణదోషం కనపట్టింది. కాని యథాశ్రుతపాఠంలో "వర్లగింజలోది బియ్యపుగింజ." ఆయీ పద్యంలో అసంపూర్ణ క్రియలు (ఎన్నను, పొందను, ఈఁదను) అనేవి మూడున్నాయి. గ్రంథకర్త వుద్దేశంలో అవి అసమాపక క్రియలే. కాని అవి వ్యతిరేకార్థ కోత్తమ పురుషైకవచనాలుకూడా అగుటకు యేవిధమైన విప్రతిపత్తీ లేదు. ఆలా అగుట నిర్వివాదమే. అయితే వచ్చే విప్రతిపత్తిని గూర్చి లోఁగడ వ్యాఖ్యానించి వున్నాను. ప్రస్తుతం దాన్నిగూర్చి మిమ్మ ప్రశ్నించను—

పాఠాంతరాన్ని గూర్చియ్యేవే అందటికీ వుపాదేయమైన భారతాన్నిగూర్చనవిచికిత్స కనుక భాషాభిమానులు వుపేక్షింపరని నా నమ్మిక.

శ్లో."స్వాధీనో రసనాంచలః పరిషద శ్శాన్తాః....స్వతంత్రం జగత్
క్షోణీంద్రోననియామకః....ప్రతిపద్మగర్జత-వయంమౌనవ్రతాలంబినః."

# వైకర్తనశబ్దవిచారము

1922 సం॥ అక్టోబరు 25 వ తేదీ న్యాయదీపికా పత్రికయందు సంపాదకీయవ్యాసమునందు వృథాకలహ కారకులెవ్వరో నన్నుమిక్కిలిగ వెక్కిరించుచుఁ గొన్ని వాక్యములు ప్రచురించిరి. కాని యాపత్రికను మాత్ర మేకారణముననో పత్రికాధికారులు నాకందింపరైరి. కొందఱు మిత్రులు నాపేరఁబై విషయమును గూర్చి కొంచెముగావ్రాసిరి, కాని వారుకూడఁబత్రికను నాకంపరైరి. ఇటీవల ననఁగా డిశంబరు 17, 18 తేదీలలో గోదావరి డి॥ చిత్రాడలో జరిగిన వార్షికోత్సవమునకు నేను వెళ్ళియుండుటచే, నచ్చట న్యాయదీపిక నాకు గోచరించినది. అందలి

1. చెళ్ళపిళ్ళ వెంకటకవిగారి హాస్యప్రసంగము

2. బ్రాహ్మణేతరుఁ డీ యగ్రపీఠమునకు నియమింపబడెనే యని కొందఱు ఛాందసపండితులు వాపోయిన నేమిఫలము.

3. సహనబుద్ధిలేని పూర్వనాగరికపండితు లెట్లు గ్రహింపఁ గలుగుదురు.

4. మూర్ఖవాదమొనర్చుట పండితలక్షణ మనిపించుకొనదు.

5. అధికప్రసంగమున కెంతమాత్రమును సాహసించి యుండ రని మావిశ్వాసము.

6. వేంకటశాస్త్రిగారు సంస్కృతభారతమును మఱియొకమాఱు తిన్నగాఁజదివి,

7. మన వేంకటశాస్త్రిగారి కప్పటికి సంస్కృత మహాభారతము యొక్క పరిశోధన యిసుమంతయులేదని వెల్లడియగుచున్నది.

8. వేంకటశాస్త్రిగారు .... తమతప్పును బహిరంగముగా నంగీక రింపఁ గోరుచున్నారము.

ఇత్యాది లఘుప్రసంగములు చూచితిని. శ్రీయుత కట్టమంచి రామ లింగారెడ్డిగారి యాధిపత్యమున రాజమండ్రిలో శ్రీరాజ రాజనరేంద్రవర్ధం

తికి సంబంధించిన సభలోఁ బరస్పర విరుద్ధవిషయములు నన్నయ్యభట్టార కునిచే నాంధ్రీకృతమగు భారతము నందే కలవా ? లేక వ్యాసభట్టారకుని మూలగ్రంథమందుఁగూడ నున్నవా ? యను సంశయముంగూర్చి కొండొక చర్చ ప్రసక్తానుప్రసక్తముగాఁ దగిలిన మాట వాస్తవము. పైవిషయ మునుగూర్చి యగ్రాసనాధిపతిగారుగాని, నేను గాని యేమాత్రమును బర స్పరజయేచ్ఛతోఁబ్రసంగించినది లవమునులేదు. అస్మద్గురువరేణ్యులలో నొకరగు బ్ర॥ శ్రీ॥ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి కవిరాజుగారాసభకు నెట్లో వచ్చి కూర్చుండిరేకాని శ్రీవారిమనస్సు బొత్తిగా నస్వస్థముగానుండుటచే వారేని పైవిషయముంగూర్చి విస్తరించి ప్రసంగించినవారుకారు. ఆ యీ విషయములనుగూర్చి నాఁటిసభలోనున్న పెద్దమనుష్య లనేకులు సాక్షులు. ఇందేమేని ప్రమాదమున్నచో శ్రీయుత రెడ్డిగారు తెలుపఁగలరని నమ్ము చున్నాఁడను. అదిగాక నాఁటిసభలో నాయొనర్చిన ప్రసంగమెవ్వరికిఁ గాని బాధకరముగ నుండినచో నఁదఱు మహనీయులలో నొకరేనిలేచి నన్ను మందలింపవలసియుండును. "బ్రాహ్మణేతరుఁ డీయగ్రపీఠమునకు నియమింపఁ బడెనే" అను దుఃఖమే మాకున్నచో మేమట్టి సభకు రానే రాకపోవచ్చును గదా ? అది యిటులుండె. ప్రస్తుతవివాదమునకెల్లఁ బ్రతి పక్షులకు ముఖ్యాధారమగు న్యాయదీపికా వాక్యమును—— "వైకర్తనుడను విశేషణము కర్ణునకు సంస్కృతభారతముయొక్క ఆదిపంచకమునందుఁ బ్రయోగింప బడియున్నను దానికి సూర్యపుత్రుఁడను నర్థముకాక కవచ కుండలములను బెఱికియిచ్చినవాఁడను మఱియొక యర్థము కూడ నుండి యుండుటచే" అనుదానిని విమర్శింపుదము. ఏప్టి నిఘంటువలనను, శ్రీకృష్ణ భారత విరాటపర్వమునందలి టిప్పణివలనను, వైకర్తనుఁ డనఁగా సూర్య పుత్రుఁ డనియే స్ఫుటమగుచున్నది. సహజకవచకుండలములను బెఱికి యిచ్చుటచే వైకర్తనునికిఁ గలిగినపేరు "కర్ణుఁడు" అనునదియే కాని వైకర్తనుఁ డనునది కాదని శ్రీకృష్ణభారతారణ్య పర్వాంతములగు "కుండ లార్ధంబు కర్ణకర్తనంబు చేయుటంజేసి యతండు కర్ణుండునాఁ బ్రసిద్ధిగాంచె" అను నక్షరములు తెల్పుచున్నవి. యీయర్థమునే, "సహజకవచ కర్త

నాత్కర్ణః" అను నీలకంఠయ వ్యాఖ్య ధ్రువపఱచుచున్నది. దీని యనంతరము "విశేషతః కర్తనః. స్వార్థేతద్ధితః" అని పూర్వపక్షుల వాక్యము ననువదించి వెంటనే "వస్తు, తస్తు, వికర్తనస్య సూర్యస్యాపత్యత్వాద్వైవ కర్తనః" అను వాక్యమువలన దానినిఖండించుటచే వ్యాసభట్టారకుని కావ్యుత్పత్తి సమ్మతము కాదని స్ఫుటమగుచున్నది. కర్ణ, భేదనే, అను ధాత్వర్థ మిందులకుఁ దోడగుచున్నది. కాని శ్రీకృష్ణభారతములోని యాది పర్వ స్థితమగు "సహజ కవచకుండలమ్ములు కర్తనముచేసి విప్రరూపుం డగు వియచ్చరవల్లభునకిచ్చిన కతనఁ గర్ణుండు వికర్తనుండునాఁ బడియె" అనువాక్యము పూర్వపక్షులకించుక చేయూఁతకావచ్చును గాని యయ్యది పూర్వప్రదర్శితప్రమాణమువలనఁ బూర్వపక్ష మతానువాద మాత్రముగాని సిద్ధాంతకోటి ప్రవిష్టము గాకుండుటచే వారి నుద్ధరింపఁ జాలదు. ఇందును గూర్చి ముందింకను విపులముగాఁ జర్చింపఁబడును. మఱియు యథామూలముగా శ్రీ ప్రతాపచంద్రరాయలవారు హూణ భాషాంతరీకరణమొనర్చిన గ్రంథమువలనగూడ నట్టివ్యుత్పత్తిచెప్పుట ప్రమాదమని స్థిరపడుచున్నది. మఱియు శ్రీకృష్ణభారతములో స్వార్థతద్ధి తాంశమునువదలి వికర్తనపదమునే వాడుటకూడ గొంతచింత్యము. ఏమందురా దీనింబట్టి తండ్రియగు సూర్యుఁడును, గొమరుఁడగు కర్ణుఁడునుగూడ వికర్తనపదవాచ్యులు కావలసి వచ్చును. అట్లు ప్రసిద్ధిలేదు. వ్యాసభట్టారకుఁ డెచ్చటను వాడలేదు. కావుననే వ్యాఖ్యాతదాని నాచారనిర్వహణార్థముచూపి వెంటనే వస్తు తస్తు అని ఖండించెను. కనుకనే శ్రీకృష్ణభారతము స్థలాంతరమున దీనినే యనుసరించెను. అదియటులుండె, తేలినసార మేమనగా ? వైకర్తనపదము సూర్యపుత్రుఁడను నర్థమునఁ గర్ణునకు వాడుట యుక్తమనియు వికర్తనపదము సూర్యునకుమాత్రమే వాడఁదగినది కాని కర్ణునకు వాడఁదగదనియు, కేవల యౌగికముగా గైకొని మనము వాడఁబూనినచో సంస్కృతభారతమున, స్థలాంతరమున నీయుభయపదములకును గర్ణపరముగా వాడిన ప్రయోగము లుండవలసియుండు ననియు, నట్టిప్రయోగము లేకుండుటచేఁ బై తోఁప., వ్యాసభట్టారకున కిష్టము లేదనియుఁ దేలుచున్నది. ఇష్టమే

యున్నచో బంధు, బాంధవ, శత్రు, శాత్రవాది శబ్దములవలె వైకర్తన వికర్తనశబ్దములు రెండును గర్ణునకు వాడియేదీర వలయును. నిజముగా వ్యాసభట్టారకుని హృదయ మీపదప్రయోగమువట్టున నిట్టిదియేయైనచో నిట్టి ద్రావిడప్రాణాయామమేటికి ? మార్గాంతరముకలదు చూడుడు. వైకర్తనః అని విడదీసికొని కర్తనశబ్దమునకు మీరు త్రొక్కిన త్రోవను ద్రొక్కుట కడునులభవుగదా ? చక్కని రాజమార్గములుండ సందులేల దూఱవలయును ? స్వార్థప్రత్యయ కరణాదిప్రయాస లేకుంటచే నిది మీకు మిక్కిలిగ నుపకరింపఁగలదు. కానియిదియును మిమ్ముద్ధ రింపనేరదు. ఏమందురా ? ఈత్రోవ గ్రంథకర్తకు సమ్మతమగు నేని కొన్నిచోట్ల వైసహితముగా వైకర్తనః అని ప్రయోగించినను మఱికొన్ని చోట్ల పాదపూరణార్థకమగు వైపదమునువదలి కేవల కర్తనపదమును గూడ వాడవలసియుండును. అట్లొచ్చటఁగాని కర్ణునిగూర్చి భట్టారకుఁడు వాడకుంటచే బూర్వపక్షులు త్రొక్కినత్రోవ నిర్మూలమని స్ఫుటమగు చున్నది. వైసహిత ప్రయోగములు సంస్కృతమహాభారతమున బెక్కులు. అందు దిఙ్మాత్ర ముదాహరింపబడుచున్నవి.

1. కర్ణోవైకర్తనోరాజ న్యారయామాస 2. కర్ణోవైకర్తనస్తథా 3. ఏష వైకర్తనశ్శ్వేత 4. తతోవైకర్తనః కర్ణః 5. హతోవైకర్తనో రాజన్ 6. హతంవైకర్తనంశ్రుత్వా 7. కర్ణోవైకర్తనోహతః 8. కర్ణో వైకర్తనోరణే 9. కర్ణోవైకర్తనస్త్వరన్.

పైనుదాహరించిన ప్రయోగములలో (3) వ యంకెగల ప్రయో గము స్త్రీపర్వములోనిది. గాంధారీవాక్యము నందలిది. గాంధారికర్ణజన్మ రహస్యము నెఱిఁగినదికాదు. కావునయథాశ్రుతార్థమున విరోధపరిహారము దుర్ఘటము. (4) వ యంకెగల ప్రయోగము ఆదిపర్వములోనిది. గ్రంథ కర్త వైశంపాయనముఖమున బలికించినది. ఈప్రసంగమునాఁటికిఁ గర్ణు నకు బూర్వపక్షుల త్రోవకనుకూలించు నపార్థముగల ప్రాయశ్చిత్తము జరుగలేదు కావుననియ్యెడల యథాశ్రుతార్థమునే చెప్పికోవచ్చును. అట్టి స్థితిలో "ఆది పంచకమునందు" అనివైకర్తనపదమునెత్తికొని యన్వార్థ

మును జెప్పఁబూనినవారి పాండిత్యమును లోకమే నిర్ణయింపవలసియున్నది. ఇక 8, 9 అంకెలుగల ప్రయోగములు ద్రోణపర్వస్థములు, తక్కిన వన్నియును గర్ణపర్వస్థములు. ఇటు యథాశ్రుతార్థము చెప్పికొన్నను నంత బాధకము లేదు. వీని నుదాహరించుటకుఁ గారణము వ్యాసభట్టారకుడు సర్వత్ర, వైవిశిష్టముగనే ప్రయోగించుటచే బూర్వపక్షుల కుకల్పన ఖండిత మగుచున్నదని తెల్పుటకే యని యెఱుఁగునది. మఱియు నరణ్యపర్వమున ఘోషయాత్రాసందర్భమున 1. వైకర్తనం పరీప్సంతః 2. కర్ణోవైకర్త నోరాజన్ అని ప్రయోగింపఁ బడియున్నవి. ఘోషయాత్రనాటికిఁ గర్ణునకుఁ బూర్వోక్త ప్రాయశ్చిత్తము జరుగలేదు కావున నర్థాంతరకల్పన వలనఁ బూర్వపక్షులు తమవాదమును బ్రదికించుకోవలసియుండదు. అట్టి స్థితిలో "ఆదిపంచకమునందు" అని యెత్తికొని వింతత్రోవను ద్రొక్కుట మిక్కిలి చింత్యము. పూర్వపక్షులు తమ్ముఁ బైవైకర్తనశబ్దమెక్కడ వచ్చికొట్టునో యన్నంత భయముతో రక్షణవాక్యములను జాలవ్రాసికొనియున్నారు. అందు మొట్టమొదటి వాక్యమునందలి యసారతను జూపియున్నాను. వేఱొక వాక్యము నుదాహరించి పిమ్మట శేషమును వ్రాయుట కొంత యుక్తమని యట్లు చేయుచున్నాను. న్యాయదీపికలో "కర్ణుఁడు కన్యాపుత్రుఁ డని తెలిసిన వారేడ్గురనియు, నది కర్ణవధానంతరము వఱకుఁ బాండవులకుఁ దెలియదనియు, స్త్రీపర్వమునందు ధర్మరాజు నోట వెలువడిన ధర్మజ్ఞుని వాక్యములఁ బట్టి స్పష్టముగా జోద్యమగుచున్నది. సూర్యుఁడు, కుంతి, కృష్ణుఁడు, ధృతరాష్ట్రుఁడు, భీష్ముఁడు, విదురుఁడు, సంజయుఁడు, అను వార లకుఁ గాక మిగిలిన వారి కెవరికిని గర్ణజన్మరహస్య వృత్తాంతము తెలిసియుండినను మహాభారతయుద్ధమునకు హేతువే లేనట్లు వ్యాసుఁ డీకథను బోషించుచు వచ్చిన విషయమును భారతమును జదివినవారు సులభముగా గ్రహింపవచ్చును" అని యొకరక్షణ వాక్యమును వ్రాసికొనియున్నారు. ఇందులోని "ధర్మరాజు నోటవెలువడిన ధర్మజ్ఞునివాక్యములు" అను నవాంతర వా క్యమునందలి యసారత నటులుంచి రహస్యజ్ఞుల పట్టికలోఁ జేర్చుటకుఁ దిక్కనని ష యాజిగారి కిష్టము లేని — ధృతరాష్ట్రునిఁ గూడఁ జేర్చుటకు

సంస్కృతభారత తోద్యోగపర్వమునందలి యాధారమును గూర్చి ప్రస్తుత మనావశ్యకమగుటచే వదలి యీపట్టికలోఁ జేరని దుర్యోధను నికటమునఁ జేరిన భీష్ముఁడు ప్రసంగించిన ప్రసంగము నుదాహరించు చున్నాఁడను.

శ్లో. ఉత్సాహ యతిరాజంస్త్వాం విగ్రహే పాండవైస్సహ ః
పరుషః కత్థనోనీచః కర్ణోవైకర్తన స్తవ.

(ఉద్యోగపర్వము, 168 వ అధ్యాయము.)

పైనుదాహరించిన వైకర్తనపదప్రయోగము రథాతిరథనిర్ణయ ఘట్టమునందలిది. దుర్యోధను నుద్దేశించి పలికినది, కావునఁ బూర్వపక్షు లిట నర్థాంతరకల్పనకు దిగవలెను. ఆయర్థాంతరకల్పనయందలి యసారత మరలఁ జర్చింప నవసరములేదు. కావునఁ బైపట్టికలో దుర్యోధనుని గూడఁ జేర్చికోవలసియున్నది. ఒకవేళ దుర్యోధనుఁ డెఱుఁగకున్నను భీష్ముఁడు రహస్యమెఱిఁగినవాఁ డగుటచే నట్లుప్రమాదవశమున నుడివి ఆప్రమాదమును సవరించుకొనుటకే యీక్రిందివిధముననవలంబించెనేమో, ఆశ్లోకములుగూడ నుదాహరించి చర్చించుకొందము.

శ్లో. వియుక్తః కవచేనైవ సహజేన విచేతనః
కుండలాఖ్యాంచ విఖ్యాఖ్యాం వియుక్తస్సతతంఘృణీ.

పైశ్లోకమునందలి కర్ణకవచకుండల ప్రస్తావము మొదటి వైకర్తన పదము వలన సంశయమునందుచున్న దుర్యోధనుని కనులనీరు తుడుచుటకే ప్రవర్తించినట్లు కల్పింపుదమన్నను, అయ్యవారు తానాడిన యబద్ధమును దిద్దికొన్నను తెలివితేటలుగల దుర్యోధనుఁడు శీఘ్రోపస్థితమగు సూర్యపుత్రుఁడను నర్థమునువదలి తాతగారు తన పొరపాటు సవరించుకొనుటకుఁ బ్రసంగించిన బహిరంగార్థమునెడల నెట్లు విశ్వాసమూనఁగలఁ డనునది యిట ముఖ్యాంశము. మఱియు దుర్యోధనునికిఁగూడ దెలిసినను ధృతరాష్ట్రునితోపాటే చిక్కులేదని యీమీఁదఁ బూర్వపక్షులు వాదమునకు దిగుదురు కాఁబోలును, అగుచో నీక్రిందియంశమున కేమందురో ?

శ్లో. కోహిశాంతనవం భీష్మం ద్రోణం వైకర్తనంకృపం॥

(కర్ణపర్వము, 67 అధ్యాయము.)

పైశ్లోకములోని వైకర్తనపదము శ్రీకృష్ణుఁ డర్జునునిగూర్చి పలికిన వాక్యములోనిది. శ్రీకృష్ణుఁడు పట్టికలోఁ జేరినను నర్జునుఁడందుఁ జేరలేదే? కుకల్పన కుదిరినఁ గాని యర్జునునికి యథాశ్రుతార్థమున నిజముతెలిసి కొంప మునుఁగునే? అర్జునుని కీరహస్యమే తెలిసినచో భారత మాగిపోక సాఁగునా? ఇట గతియేమి? అర్జునునిగూడ రహస్యజ్ఞులీ పట్టికలోఁ జేర్చుకొనియే భారతమును సాఁగించుకొనుటకుఁ బూర్వపక్షులు ప్రయత్నింతురుకాఁబోలును. అట్లు ప్రయత్నింతురేని వెనుక నెవరో నల్లమందభ్యాసముగల మహాపురుషుఁడు సన్న్యాసమును స్వీకరించుచు నల్లమందునకును దానికి వలసిన గేదె లోనగు పరివారములకుగూడ సన్న్యాసమిప్పించవలసినదిగా ప్రసంగించిన ప్రసంగముంబోలె నుండునుగదా? వైకర్తన పదద్వారమున నర్జునునికి రహస్యము తెలిసినను జిక్కులేకున్నచో నది తెల్పెడిరహస్యమునే తెల్పు— కానీన పదమును, నన్నయ్యభట్టారకుఁ డర్జునువినోటఁ బలికించినఁ దప్పేమి? ఇప్పటికి నన్నయభట్టారకుని భారతమును దమకుఁదోఁచి నట్లెల్ల విమర్శించి యజ్ఞతను గల్పించు వారికి వ్యాసభట్టారకుని భారతముగూడ గుఱియగుచుండుట ధ్రువపడినది. కనుక మనపూర్వపక్షులు వ్రాసిన యీక్రిందిపంక్తులు వృథాభిమాన ప్రయుక్తములో కావో ప్రాజ్ఞులు నిర్ణయింపఁగలరు.

"కానీన శబ్దమునకట్టి సాధువాదమున్నట్లు మనవెంకటశాస్త్రిగారు సాధింపఁగలరా? అనునంశము ముందు పరీక్షింపఁ దలఁచియు"

అట్టి సాధువాదమనఁగా నెట్టిసాధువాదము? మనపూర్వపక్షులు వైకర్తనపదమునకుఁ జెప్పఁబూనిన యసంబద్ధవాదము. అది యసంబద్ధమైనప్పుడు కానీన శబ్దమున కట్టి దురర్థమును వెంకటశాస్త్రిగారేల చెప్పెదరు? చెప్పరు. చెప్పనిచో విరోధపరిహారమెట్లు ఘటించును? వెంకటశాస్త్రిగారి వాదము విరోధ ముభయత్రకలదని చెప్పుటయే కాని పరిహా

రించుటతో సంబంధించినది కాదని నాటిసభ్యులెఱుఁగుదురు. ఈ యంశమును చిరకాలము క్రిందటనే ముద్రింపించిన మాభారతనాటక పీఠికలో వ్రాసియే యున్నారము చూడుఁడు—

చ. ఒకటికి నొండు గ్రంథమునకుండు విరోధము దానికేమి ? వ్యా
సకృతములైన పొత్తములెనైఁప నొకండొకఁడున్ మఱింతయే
టికి నొకపొత్తమేనియుఁ బఠించిన దానికి దానికే లగిం
పక పెఱరీతి గల్గునిది బ్రహ్మకునైన లగింపశక్యమే.

సంస్కృత మహాభారతమునందలి వైకర్తన పదమువలనఁదోఁచెడి విరోధములేమి, తెలుఁగు భారతము నందలి కానీనపదమువలనఁదోఁచెడి విరోధమేమి, బాగుగ యోజించినచో విరోధాభాసములుగాని నిక్కమగు విరోధములు కావని చాలమంది సహృదయులు వక్కాణించు చున్నారు. వారి సమాధానము నాకు హృదయంగమముగానే కనుపట్టినను బ్రస్తుతము దానిని జూపవలసిన యావశ్యకత లేశమును లేకుండ చేసెను. పూర్వపక్షులకు కానీన శబ్దమెంత యపకారమో వైకర్తన శబ్దమును నంతియ యపకారకమనిచూపి ముగించు చున్నాఁడను. తెలుఁగు భారతమునందలి కానీన శబ్దము ప్రసిస్థానమున వాడఁబడియుండుటను బూర్వపక్షులు గమనింపవలసియున్నది. ఇది యిటులుండఁగా రామాయణములో పిడుకల వేట్లాటగా నీసందర్భములో క్షమాపణ పదమునుగూర్చి పూర్వమెన్నఁడో యెవ్వరో మమ్మడుగఁగా మేమల్లవారిని బూర్తిగా సమాధానపఱచిన దానినెత్తికొని మమ్ముఁ గొంతవెక్కిరింపఁ బూనుట యాశ్చర్యములో నవాంతరాశ్చర్యము. ఈసందర్భమున వారి వ్రాఁతలోని కొన్నియక్కరము లుదాహరించు చున్నాఁడను.

"క్షమాపణ సాధువనుటకు సంస్కృతవ్యాకరణ సూత్రములేమి ? దీనికి ధాతువేది ? ప్రత్యయమేది ? ప్రకృతియేది ? క్షమాపణశబ్దము యొక్క అంత్యమైన "ణ" కారమెట్లు వచ్చును ?"

ఇట్లు వ్రాసి యీక్రింద మాత్రముకొండొక వినయమును జూపుచు నంతతో ముగించెను. పైవ్రాఁత వలన మేము నాఁటిదినములలోఁ గృష్ణ

పత్రికలో వచ్చిన "క్షమాపయసిచేన్మాంత్వం" అనునది మాత్రమే యీప్రశ్నకుఁ దెలుఁగును గాని యాదినములలోనే యచ్చటన పాండ వాశ్వమేధములో లిఖించిన పంక్తులుగాని గురుదక్షిణ పీఠికలో నుదాహ రించిన క్షమాపణైక పదయోః అను రసగంగాధరస్థ ప్రయోగమునుగాని లేశమును నెఱుఁగఁడవి ధ్రువపడుచున్నది. ఈమాత్రమే చూడక ప్రశ్నించు నీయలఘుఁడు వాచస్పత్యమునం దీవిషయమై యెత్తుకొని నామధాతువు నుగా రూపనిష్పత్తిని జూపి వేదము నుండియుఁ, బురాణమునుండియుఁ లక్షణగ్రంథము నుండియుఁ జూపిన యుదాహరణములు చూడకపోవుట యొకదోసఁగు కాదుగదా? పోనిండు పైఁజెప్పిన సందర్భములేవిగాని చూడకయే ప్రశ్నించెననుకొందము. ప్రశ్నించుటకేని యీమహాభాగున కధికారమున్నట్లుతోఁపదు, చూడుఁడు. "ధాతువేది ప్రత్యయమేది" అని ప్రశ్నించెను? యుక్తమే. వెంటనే ఆవాక్యమునందే ప్రకృతియేది? అనికూడ నడుగ మొదలిడెనే? దీనికి నేనేమి సమాధానము చెప్పఁగలను. ఇయ్యెడ ధాతువు వేఱుగను బ్రకృతి వేఱుగను సమర్థించుటయెట్లు? ధాతువేప్రకృతి ప్రకృతియే ధాతువు. కావున నీవిషయమునఁ బ్రచ్ఛకున కేవిధమైన సమాధానముగాని యీవలసినదిలేదు. ఆదిగాక పరిజ్ఞాతయే యైనచో మొట్టమొదట మేము కృష్ణాపత్రికలోఁ జూపిన క్షమాపయసి యను ప్రయోగమువలననే సూత్రప్రాయముగా సర్వమును గతార్థమగు చుండఁగా మరల నెందులకుఁ బ్రశ్నించెడిని. కావున దీనింగుఱిచి వ్రాయఁ బూనుట జలతాడనాదివ్యర్థ వ్యాపారములలోఁ జేరునని ప్రస్తుత మింతతో విరమించు చున్నాఁడను.

———

# జలతాడనము

శ్లో. పాణ్డ్వామత్స్యకథితం వసుషేణ ఇతి క్షితౌ
కర్ణో, వైక ర్తన శ్చైవ కర్మ ణాతేరసోభవత్.

(భారతము, ఆదిపర్వము)

ఇట వ్యాఖ్యానమున నిటులున్నది— వసునా = కుండలకవచాదిద్రవ్యేణ—బద్ధ ఇతి వసుషేణః,సహజకవచక ర్తనా త్కర్ణః,విశేషతః, కర్తనః స్వార్థే తద్ధితః వస్తుతస్తు వికర్తనస్య,సూర్య స్యాపత్య త్వాద్వైకర్తనః. ఇటులు విస్పష్టముగా వైకర్తనశబ్దమునకు నిర్వచనము కనుపట్టుచుండఁగా 5 వ మార్చి 1923 సం॥ న్యాయదీపికలో వృధాగా నేదో చెత్తనుగూర్చి వ్రాయుచుఁ బై వైకర్తనశబ్దమునకు తమపొరపాటును సమర్థింపఁగల యర్థముకూడ నున్నట్టు వ్రాయుచున్నారు చూడుఁడు—

సహజకవచక ర్తనాత్, కర్ణః, విశేషతః కర్తనేన వైకర్తనః స్వార్థే తద్ధితః. తాత్పర్యము— అతనికి పూర్వము వసుషేణుడు అను పేరుండెడిది. ఆకర్మవలన ననఁగా, సహజకవచకుండలములు కోసియిచ్చుట వలన కర్ణుఁడు అని,వైకర్తనుడు,అని పేరుల నందెను. అని యేమో వ్రాయ మొదలిడి "వ్యాసుఁడు ముక్తకంఠముతో వైకర్తనశబ్దమునకు సహజకవచకుండలములఁ గోసియిచ్చినవాఁ డనునర్థమును స్పష్టపరచు చుండఁగా నది వ్యాసునియభిప్రాయము కా దనుటకంటెను, కుతర్కమును విరుద్ధవాదమును మఱి యొకటి లేదు" అని వ్రాసి యున్నారు. వ్యాసుని యభిప్రాయ మిట్టిదియే యైనచో— "కర్ణాత్తస్మాత్కర్మణాతేనకర్ణః" అను నరణ్యపర్వనిర్వచనము విరోధించును.కర్తనకర్మవలనఁ గల్గినపేరు— కర్ణుడు అనునదియే కాని "వైకర్తనుఁడు" అనునది కా దని యరణ్య పర్వనిర్వచనము స్పష్టీకరించుచుండుటచేతనే— "వస్తుతస్తు వికర్తనస్య సూర్యస్యాపత్యత్వా ద్వైకర్తనః" అను నీలకంఠీయవ్యాఖ్య స్పష్టపఱచెను. ప్రతిపక్షు లీ"వస్తుతస్తు" అను వాక్యమునే యెత్తకుండుట శోచనీయము. పంచాంగములు చింపినచో నక్షత్రములు పోవు గదా! భారతమునఁ

బ్రిస్తుతవిషయ మాదిపర్వమందును,అరణ్యపర్వమందును గూడఁ గలదు. అందు నాదిపర్వములో— "కర్ణో వైకర్తన శ్చైవ'' అను సముచ్చయార్థక మగు చకారఘటితప్రియోగము కానవచ్చుచున్నది.దానింబట్టి కొందఱు కర్తనరూపకర్మవలనఁ గలిగినపేర్లు— కర్ణుఁడు వైకర్తనుఁడు అను రెండును నని భ్రిమించుచుండఁగా విశేషదృిష్టయగువ్యాఖ్యాతస్థలాంతరమున నున్న— "కర్ణా త్తస్మాత్కర్మణా తేన కర్ణః" అనుదానిని దిలకించి వారిభ్రిమను వస్తుతస్తు అని ఖండించె నని ప్రాజ్ఞుల కెల్ల విస్పష్టమే కాన-విస్తరింపను.

మఱియు నీ— చైవ అనుపాఠము కొన్నిప్రితులలో నుపలబ్ధమగుచున్నది. కాని తారానాథతర్కవాచస్పతి తన నిఘంటువులో "తతో వైకర్తనః కర్ణః కర్మణాతేనసోఽభవత్''అను పాఠమునే యుదాహరించి యున్నాఁడు.ఆపాఠమువలన— వైకర్తనః, వికర్తనపుత్రుఁ డైన, సః, ఆ వసుషేణుఁడు,తతః అనంతరము, అనఁగా సహజకవచకుండల దానానంతరము, తేన కర్మణా;ఆకర్తనరూపకర్మచేత, కర్ణః కర్ణుఁ డనుపేరు కలవాడు,అభవత్-అయ్యెను. అని నిస్సందిగ్ధార్థ ముపలబ్ధ మగుచున్నది.ఈ యర్థమునకు "కర్ణధాతువును" అరణ్యపర్వనిర్వచనమును, నిఘంటువును వ్యాసుని యితరత్రిప్రివృత్తియును, వ్యాఖ్యాతృసిద్ధాంతమును దోడగుచున్నవి.పైఁగా నపసిద్ధాంతమువలనఁగల్గు— వికర్తన-కర్తన పదములు తెచ్చిపెట్టెడిచిక్కులకు వలను లేదు. మఱియు వైకర్తన శ్చైవ, అను పాఠము నెత్తుకొనికూడ వ్యాఖ్యాత తప్పుత్రోవ త్రొిక్కలేదు. చైవ అను దానింబట్టి యుభయసామానాధికరణ్యమును వివక్షించుట ము న్నెవరో కృతకసన్న్యాసి— "మహాయోగిభ్య ఏవ చ" అను శ్లోకమందున్న "ఏవచ'' అను నవ్యయద్వయమునకు— "ముండమోపు" అను నర్థమును జెప్పి తనతో నున్నవితంతుశిష్యురాలికి గూడ నొకవిస్తరిని వేయు మని చెప్పిన తప్పుత్రోివవంటిదగు నని వ్యాఖ్యాత బాగుగఁ దెలిసికొనియెను. కావుననె చైవ అనునది పాదపూరణార్థ మని త్రోసివేసెను.ఇట్టి యవ్యయములే కాక ఋషులకవిత్వములో మఱికొన్ని సమాసపదములుగూడఁ

బాదపూరణార్థము లుండు నని ప్రాజ్ఞు లెఱుఁగుదురు. "కుంతీపుత్రో యుధిష్ఠిరః" "రామో రాజీవలోచనః" ఇత్యాదులు పెక్కుచోట్ల నుండు నవి నిరర్థకములు కలవు. అది యటు లుండె.ప్రస్తుత మపార్థమును బురస్కరించుకొని యయిదుకాలములవ్యాసమును వ్రాయుటయే కాక,పైఁగా 'వస్తుతస్తు' అను వాక్యమును పూర్తిగా మ్రింగివేయుటయును గాక,నాఁటి సభలో— "వైకర్తనశబ్దమునుగూర్చిన" ప్రసక్తి లే దని యపలపించుటయును గాక — ద్రౌపదీస్వయంవరఘట్టమున నన్నయ్యభట్టువాడినట్లే, వ్యాసుఁడుగూడ సంస్కృతమున కానీనశబ్దమును వాడె నని వెంకటశాస్త్రి వచించె నని బొంక మొదలిడుట మిక్కిలి విషాదకరము.సంస్కృతమునం గూడఁ గానీనశబ్దమే వ్యాసుఁడు వాడె నని వెంకటశాస్త్రి యనుట నిక్కమే యగు నేని మొట్టమొదట వెంకటశాస్త్రి నే మని యడగవలసియుండునో లోక మెఱుఁగదా? వైకర్తనశబ్దమున కన్యార్థము సెప్పి యది పూర్తిగా దమకు విషమింపఁగా దానిని బ్రతికించ నెంచి యిన్నిపాట్లు పడుటతోఁ బనియే యుండదు గదా? "సంస్కృతభారతమున నున్నకానీనశబ్దమును జూపఁ దగు" అని ప్రశ్నించుటతో సర్వమును గతార్థము కావలయునే. పైఁగా నిది యిటులుండఁ దమకు బొత్తిగా సంబంధములేని క్షమాపణ శబ్దము నెత్తుకొని వ్రాయుచు— "టెంకాయ పిచ్చికొండ" సామెతను జ్ఞప్తికిఁ దెచ్చి దానిని వెఱ్ఱిమొఱ్ఱిమాటలతో నపలపించు టెందులకు? ఇది యంతయు గుఱితింపఁగలప్రాజ్ఞలోక మింకను గలదు.గాన నిందుంగూర్చి భారము వారికే వదలితిని. మఱియు నీ విషయమై యంతో యింతో ప్రసక్తి శ్రీ మా గురువరేణ్యుల కున్నట్లు 1923 సం॥ 21 వ తేది న్యాయదీపికలోని వైకర్తనశబ్దవిచారము అను శీర్షికక్రిందివ్యాసమువలన ధ్రువపడుచున్నను, నేను వారి శిష్యుఁడ నగుటచే మోమోటము విడిచి యీ విషయమున వారిని ప్రశ్నింపఁజాలను. శ్రీవారి గ్రంథస్థమగునక్కరములే మీ కాధారము లనియు, శ్రీవా రేకారణముననో పరస్పరవిరుద్ధముగా నందు లిఖించి యుండిరనియు,దానిం గైకొని పిలిచ్చినంతలో నుపపత్తిని వ్రాసి నాకు సాధ్యముగానిపట్టున "చింత్యము" అని వ్రాసి విడిచితిననియుఁ బ్రాజ్ఞ

లోక మెఱుఁగును.కాని నా గురుభక్తి నెఱిఁగిన శ్రీవారు నన్ను క్షమింపక వాదప్రధానముగాఁ గొంత వ్రాసియున్నారు.వారి ప్రతివాక్యమునకును వారుమొదలగుగురువులప్రసాదమువలన నుత్తరము మనవి చేసుకోఁదగిన శక్తి యంతో యింతో కల్గియుండియు నందులకుఁ బ్రాజ్ఞలోకము సహింప దని యెంచి శ్రీవారు చెన్నపురినుండి దయచేసినపిమ్మట వారి దర్శనము చేసికొని నాకుఁ గలయభిప్రాయమును వారి సన్నిధిని మనవిచేసుకొనఁ దలచి యిం దెత్తక మిన్నకుంటిని. మరియు శ్రీవారి భారతమునందలి—

"(1) వైకర్తనుండు, వికర్తనసుతుండు, భానుసుతుఁడు. (2) కుండలార్థంబు కర్ణకర్తనంబు చేయుటంజేసి యతండు కర్ణుండునాఁ బ్రసిద్ధి గాంచె. (3) సహజకవచకుండలమ్ములు కర్తనముచేసి విప్రరూపుండగు వియచ్చరవల్లభున కిచ్చినకతనఁ గర్ణుండు వికర్తనుండు నాఁబడియె" అను త్రితయములో నొకటిరెండులకు మూఁడు పూర్తిగా విరుద్ధము. ఈమూఁడవ వాక్యము మీ రిపుడు వ్రాసినతాత్పర్యమునందలి సామానాధికరణ్యమునకుఁ గూడ ననుకూలింపదు; అనుకూలించుచో శ్రీవారివాక్య మిటు లుండవల యును— "ఇచ్చినకతన నతండు, వికర్తనుండును, గర్ణుండు నాఁబడియె" మరియు శ్రీవారియభిప్రాయము కూడ నుభయసామానాధికరణ్యబోధకము గా దనుటకు నిటీవల శ్రీవారు న్యాయదీపికలో వ్రాసినవ్యాసములోని "వచనపతితము" లోనగు నక్కరములవలన నయ్యెడం గల వికర్తనపద మును వైకర్తనపదముగా సవరింపఁ బూనినట్లు విస్పష్టమే. అంతియకాని "చైవ" పాఠమునుబట్టి వా రప్పటికిఁ బ్రవర్తింపఁ దలఁపలేదు. ఇందును బ్రవర్తింపరు. అది నిలువ దని శ్రీవా రెఱుఁగుదురు. వారి రచనకుఁ గొండొక సమర్థనము గలదు. అది వారును నేనును గలసికొన్నపిమ్మటఁ బ్రకటిత మగును. ఉభయసమానాధికరణ్యమున కనఁగా? కర్తనమువలనఁ గల్గిన కర్మప్రయుక్తనామమును కర్ణుఁడు, వైకర్తనుఁడు అను రెండును నని ప్రతిపక్షులు వ్రాయుచు భారతమునఁ దఱుచుగా వాడిన "కర్ణోవైకర్తనః" అనుచోఁ గలపునరుక్తిని సమర్థింపఁ బూనిరి. వ్యాసున కభిప్రేతముగాని తప్పుటర్థమును జెప్పినప్పుడుగదా కర్ణశబ్దవైకర్తనశబ్దములకు

పునరుక్తి కలుగుచున్నది. సిద్ధాంతార్థములోఁ బునరుక్తి గలదా? లేదు. ఈ పునరుక్తి వచ్చుట యెఱిఁగియే వ్యాఖ్యాత "వస్తుతస్తు" అని యా తప్పుడువ్యుత్పత్తిని ఖండించె నని ప్రాజ్ఞు లెఱుఁగుదురు. పైఁగా కర్తనము వలననే వైకర్తనుఁడేని యితరత్రి వ్యాసుఁడు కర్ణునకు కర్తన - వికర్తన శబ్దములు రెండును, వైకర్తనశబ్దముతోపాటు వాడవలసి వచ్చును. ఇత్యాదిబాధలు నా వ్యాసమునఁ జూపఁబడినవే. చూపినవిషయమును మరల నెత్తుచుంటచేతనే యీవ్యాసము "జలతాడనము" నాఁబడుచున్నది. వ్యాసులు వేయొక్కచో నెక్కడనేని నీ చూపిన వ్యుత్పత్తిని జూపుట గాని లేదా వ్యాఖ్యాతలు వివరించుట గాని లేదా వ్యాసులు వికర్తన, కర్తనపదములు కర్ణపరముగ వాడుట గాని, మీ కుపలబ్ధ మగువరకు మీ వాదము బ్రిదుకదు. మనమనవాదములను బ్రతికించుకొనుటకు "భారతః పంచమో వేదః" అనునంతటి ప్రమాణగ్రంథమునకు మొదట నెఱుఁగకున్నను నిటీవల నెఱిఁగికూడ దప్పుడుకల్పనలు చేయుట మిగుల హానికరము. శ్రీయుతరెడ్డిగారి పరిశీలనయెడల నీ స్వల్పలోపము నంగీకరించినంతలో వారికిఁ గాని, మనకుఁ గాని కల హాని యంతగా నుండదు. కాని భారతమున కపార్థము చెప్పఁబూనినచోఁ గలిగెడి హానికి పరిమితి యుండదు. శ్రీయుతరెడ్డిగారు వ్యాసంగ మితరభాషలోఁ జేసి యీ భాషలో నింతటి విమర్శనము చేయఁగలవారై యుండుట మిగుల యభినందనీయమే కాని శ్రీయుతులు వ్రాసిన యక్కరము లన్నియు నిల్చి తీరవలయు ననుట కష్టసాధ్యము. ఇది వారికే కాదు ప్రత్యేకించి సంస్కృతభాషలో వ్యాసంగ మొనర్చినవారికిఁ గూడఁ గష్టసాధ్యమే. మొదటఁ దెలిసియో, తెలియకో మీరు కొంత ప్రయత్నించి "కానీన" శబ్దవిషయమునఁ దెలుఁగుభారతము నాక్షేపించిరి. సజాతీయమైన విరోధ మట్టిది. "వైకర్తన" శబ్దమువలన సంస్కృతభారతమునకును గలుగు నని నేను నుడివితిని. దానిమీఁద మీరు వైకర్తనశబ్దమునకు, అర్థాంతరకల్పన చేసి చూపుచు నామీఁదికి దాడి వెడలుచు నన్ను మిక్కిలిగ వెక్కిరించిరి. ఆ వెక్కిరింపులను నేను గణింపక ప్రధానవిషయమునే యెత్తికొని సప్రమాణముగ వ్యాసమును బ్రిక

టించితిని. ఇపుడు మీకు వైకర్తనశబ్దమునకు సూర్యపుత్రుఁ డను నర్థమే యుక్తముకాని వేఱొక యర్థము యుక్తము కాదని తెలిసినది. కనుకనే "కర్ణో వైకర్తనః" అనుచోఁ బునరుక్తిని వారింప మొదలిడినారు. మరియు నీ "వైకర్తన" శబ్దప్రసక్తి నాఁడు రాలే దని యపలపింప మొదలిడినారు. ముంజేతికంకణమున కద్దమేల ? ఈవిషయమై నాకు మీరీపైని వృథాపరిశ్రమము గలిగింపకుండునట్లు చేయుటకు శ్రీమాగురువరులు సమర్థులు గాన నేను వారిని బ్రార్థించుచున్నాఁడను. శ్రీవారు నేను ప్రస్తుతము గ్రంథాములనుగూర్చి విశేషించి బుద్ధిపరిశ్రమచేయుచోఁ దలతిప్పువలన బాధపడుచునను నంశమును బూర్తిగా నెఱుఁగుదురు. అట్టిచో మీ రొనర్చు కువాదము సహింపరాదు. ఇఁక నేని సన్ననుగ్రహించి మిమ్ము నీ యపార్థవాదమునుండి మరల్తు రని నమ్ముచున్నాఁడను. మీకేని యీ పంచమవేదవాక్యమున కీ యపార్థకల్పన సముచితము గాదు సరికదా ? శ్రేయఃప్రదము కూడ కాదు.

మ. ఆల శ్రీహర్షుఁడు వేదవాక్యముల కన్యాయార్థమున్ జెప్పి బా
 ములపాలై చెడె లుప్తమాసమును వమ్మున్ జేయఁ బోరాడి పే
 రలుకన్ జెందినయట్టివిశ్వపతి పాడాయెన్ బ్రమాణమ్ముగాఁ
 గలదే నీ వనినట్టియర్థ మిట వక్కాణింపు మింతేటికిన్.

నానారాజసందర్శనములోని పైపద్య మిట్టి డిద్ధడబిద్ధవాదములొనర్చువారింగూర్చియే యుపయోగింపఁబడినది. మీరు చెప్పినయపార్థమును వ్యాసుఁడు చెప్పలేదు, లేదు, లేదు. మీరాతనియందా లోపము నాపాదించి పాపమును గట్టుకొనుచున్నారు. మీవాదమును మీరు స్థిరపరచుకోనెంచు నెడల మీకు సహాయభూతులగుపండితులతో రాజమహేంద్రవరమునసే సభ నేర్పఱచి యందులకు దయచేసి వాగ్వాదము నొనర్తురేని మాధ్యస్థ్యము వహించిన పండితోత్తములు నాదేపిడివాదమో ఇతరులదే పిడివాదమో,లేక అధాత్తువాదమో నిర్ణయింపఁగలరని మనవిచేయుచు నీ జలతాడనమునుండియో, యీ పిష్టపేషణమునుండియో యింతట విరమించుచు నీశక్తియుక్తుల నెఱుఁగక యింతదనుక జేసినవ్యాసంగమునకై వగచుచున్నాఁడను.

శ్లో. ఉచిత మనుచితం వా కుర్వతా కార్యజాలం
పరిణతి రవధార్యా యత్నతః పండితేన
అతిరభసకృతానాం కర్మణా మావిపత్తే
ర్భవతి హృదయదాహీ శల్యతుల్యో విపాకః.

ఈ శ్లోకమునకు గూడ మీరు నాయందే సమన్వయము కల్పింప యత్నింతు రని నేను మీ వ్యాసమందలి యీ క్రిందియక్కరముల వలన నెఱుఁగుదును. అయీయక్కరములు మీకుఁ గలసాహసమునకు మేరయే లే దని తెల్పుచున్నవి చూడుఁడు.

"వ్యాఖ్యానతో విశేషప్రతిపత్తి ర్నతు సందేహా దలక్షణం" (సందేహమున్నంత మాత్రముచేత లక్షణము కాదు. వ్యాఖ్యానము విశేషములఁ జెప్పి సంశయములఁ దీర్చును) ఈవ్రాఁతలో "నహి" అనుటకు బదులు "నతు" అనుట కేమి యాధారమో? పరిభాషేందుశేఖరములో "హి, యస్మాత్" అని యర్థము వ్రాసికొనియెనే. ఇపుడు "తు" అని మార్చుట కర్థమేమో? గ్రంథకర్త వ్రాసిన యర్థము "తు,తు,తు,తు" అని నిషేధించుటకుఁగదా. పైఁగా దానికి మీరు వ్రాసినయెడల యెవ్వఁడు విశ్వసించునో? ఇది యంతయు "తు,తు,తు,తు" అని యర్థము చెప్పి పోవలయును గాఁబోలు. క్షమాపణశబ్దమును గూర్చి వ్రాసినతప్పుమాటలను ముద్రాపకప్రమాదము లని యపలపించితిరి గదా? ఇపుడుపరిభాషను బాడుచేయుట నెట్లు తప్పికొందురో గదా?.... ఇంకను నిప్పటి వ్యాసమున "నోరుజాఱుట" లోనగు లఘుతరోక్తులు కొన్ని గలవు. ప్రధానాంశమునకు సంబంధింపనియట్టి తప్పుడుప్రసంగము నెత్తి గ్రంథవిస్తరమొనర్చుట నిష్ప్రయోజన మని యుపేక్షించుచుఁ గర్మవశమున మీకుఁ దటస్థించినపండితసహాయ్యమును దుర్వినియోగము చేయక భారతశ్లోకమునకుఁ బండితసమ్మతమైన యర్థమును దెలిసికొనుటయందు వినియోగించి బాగుపడఁ గోరెదను.

---

# "అమవసనిసి యన్నమాట"

"అమవసనిసి యన్నమాట అలసన పెదనా" అని తెనాలి రామలింగకవి పెద్దన్నగారిని వెక్కిరించినట్లు శిష్టపరంపరవల్ల వినడం వుంది. యీ వెక్కిరింపు రామలింగంవంటి విద్వత్కవివల్ల జరిగిం దంటే నాకు చాలా ఆశ్చర్యంగా వుంటుంది.

"అమావాస్యాశబ్దతద్భవం అమవస" అని కూడా యెఱుక్కుండా వుండే కవులు ఆ కాలంలోకూడా వుంటే వుంటారనుకుందాం గాని, ఆలాంటివాళ్ళు ఆపెద్దన్నగారి వద్దకువెళ్ళి—"ఎమిదిని సెపితివి కవితము" అంటూ యెకసక్కెంచేస్తూ "పెదనా!" అని సంబోధించి మాట్లాడడం కూడానా అని నా సందేహం. ఆంధ్ర గీర్వాణాలలో సమగ్రమైన పాండిత్యంవుండి, అనేక ప్రయోగాలు అత్యపూర్వాలు ప్రయోగించి, యెవరేనా కిక్కురు మనేయెడల—"ఒకరికవిత్వమం దెనయు నొప్పులుఁ దప్పులు నా కవిత్వమం దొకనికిఁ దప్పు వట్టఁ బనియుండదు" అని గర్జిస్తూ, తప్పు పట్టేయెడల వెంటనే — "సిక మొదలంటఁ గోతు, మఱి చెప్పునఁ గొట్టుదు" నంటూ ఢంకామీఁద దెబ్బగొట్టి ప్రకటించే రామలింగ మేమిటి? నిర్దుష్టమైన "అమవస" పదాన్ని తప్పనడ మేమిటి? అని నాకేకాదు, ప్రకృతి వికృతి జ్ఞాన మేమాత్రంవున్నకవికేనా శంక కలక్కపోదనుకుంటాను. పనిలోపని "కోతున్" అనేది చిన్నయ్యసూరి తప్పనడంకూడా అనాలోచితమే అనకతప్పదు. యెక్కడో ప్రయోగించాఁడా రామలింగం ఆ పదాన్ని? తనకవిత్వంలో "తప్పు" అనేమాట నోటమ్మట వచ్చేటప్పటికి జరగఁదగ్గమర్యాద జరిగితీరుతుందని ప్రతిజ్ఞపట్టే పద్యంలో ప్రయోగించాడుకదా? దీన్నిబట్టిచూస్తే ఆకాలంనాటికి "చేతున్" "కోతున్" అనే ప్రయోగాలు తప్పులనే సిద్ధాన్తం పుట్టివుండదనేమాటకు ప్రతిచెప్పేవారుండరనుకుంటాను. ఆకాలందాకా యెందుకు? కూచిమంచి తిమ్మకవిగారి కాలంనాఁటికికూడా ఆయీ అపసిద్ధాంతం బయలుదేఱనేలేదు. కనుకనే "తనరారన్నుతి సేతు సేతుహిమవత్" అని ఆ సార్వభౌముఁడు వాడు

కొని వున్నాఁడనేది అపోహకాదు. యేదేనా దిద్దితే దిద్దఁబడుతుంది గాని యీ "నుతి సేతు సేతు" ప్రయోగం దిద్దితే యింగువ దొంగతనంలాగ పట్టిచ్చి తీరుతుంది. యింతకూ అప్పటికి యీ యిరవయ్యోశతాబ్దంలోలాగ తెలిసీతెలియని జ్ఞానంతో భారతాన్ని దిద్ది "బగ్గంపాడు" చేయడం తటస్థింప లేదుకనక, యీశంకాసమాధానాలకు అవకాశమే వుండదు. తిమ్మకవిగారికి కొంచెం యివీవలికాలంలో వున్న మాముత్తాత నరసకవిగారున్నూ యీ "సేతు సేతు" యమకంకోసం అంగీకరించేవున్నారు. మాముత్తాత గారు లక్షణగ్రంథాలు వ్రాసినట్లు లేదుగాని ఉభయ భాషలలోనున్నూ మంచి పాండిత్యం గల కవి అనుకోవడం వినివున్నాను. కొన్నిచోట్ల వ్యత్యాసాలుకొన్ని కనపడతాయికాని, అవి ఆయనకు అప్పకవీయం దొరకని కారణం చేత దానికి సంబంధించినవిగా వుంటాయి. పోనీ మాముత్తాత గారిని తోసేసినా తిమ్మకవిగారిని తోసేయడానికి అవకాశం బొత్తిగా కనపడదు. యీ కర్మం సంస్కృతంతోపాటుగా తెలుక్కి కూడా లట్టులూ, లిట్టులూ, లృట్టులూ పెట్టి ప్రక్రియలు మొదలెట్టడంలో కుదరకపోవడం చేత వచ్చింది. సంస్కృత వ్యాకరణంవంటిదానికే లొంగనివెన్నో వున్నట్టు ఆవ్యాకరణమే చెపుతుంది. అట్టిస్థితిలో యీ "చిన్నదీపం" తెలుక్కేమంత వెలుగిచ్చి సంస్కారంచేస్తుంది ?

ఇంతకూ మనకు కావలసింది, రామలింగకవినాఁటికి "చేతురు" "కోతురు" అసాధువులనే విపరీతజ్ఞానం కవులలో ప్రవేశించలేదనేది. ప్రవేశించేవుంటే యెవరో వకరు లేచి— "యేమిటమ్మా ? నీప్రతిజ్ఞ మళ్ళా చెప్పు నీవు నీకవిత్వంలో తప్పులేదంటావే ? తప్పులేదనే ప్రతిజ్ఞాపద్యంలోనే "కోతున్" అన్నది వుందే ?" అని ముదలకించకపోతారా ? ముదలకించి అంతతో సరిపెడతారా ? అతఁడు యితరులకు జరిగిస్తానన్న మర్యాదని అతనికే జరిగించి తీరుతారన్నమాట. కాఁబట్టి "చేతురు–కోతురు"అసాధువులనడం నిన్న నేటి విపరీతజ్ఞానంలో జమకట్టుకోక తప్పదన్నమాట.

యిట్టి ప్రతిజ్ఞలుకొట్టి నెగ్గించుకొనే రామలింగకవి పెద్దన్నగారి— "అమవసనిసి" తప్పనడాన్ని గూర్చిన యితిహాసం పుక్కిటిపురాణంక్రింద

తోసివేస్తే బాగుంటుందనుకోవాలి. కాని శిష్టపరంపర చెప్పుకోవడం యేలా తటస్థించిందో గూడా మనం కొంత విచారించాలి. అయితే యీ విచారణ లోకి దిగితేమాత్రం గట్టెక్కడం కష్టం. శిష్టపరంపరవల్ల వినేకథలు అన్నీ నిజాలున్నూ కావు. అబద్ధాలున్నూ కావు. కాబట్టి యీ అవకతవక పద్యాన్ని ఆకాలంలోవుండే యేజ్ఞానలవదుర్విదగ్ధుడో అల్లివుండడంమట్టుకు సత్యం. ఆపద్యం వాళ్ళనోటా వాళ్ళనోటాపడి కాలప్రవాహంలో యిమిడి వుందనుకోవాలి. వికటకవిత్వపుగాథ లెవరివేనా రామలింగానికి జమకావడం సర్వానుభూతమే కనక యిదికూడా ఆయనదానికింద జమకట్టఁబడిం దనుకోవాలి. అంతేకాని రామలింగం "అమవస" అనే దాన్ని తప్ప నడం యెన్నఁటికీ పొసఁగ దన్నది నిక్కం కాక తప్పదు.

అయితే అసలు రామలింగం పెద్దన్నగారికాలంవాఁడే కాఁడని నిన్న మొన్నటిచరిత్రకారులు సహేతుకంగా నిరూపించివున్నారు. కనుక తద్ద్వా రాగాకూడా దీన్ని తోసివేయడానికి వీలుంటుందని కొందరంటా రను కుంటాను. కాని, యెన్నో కథలు రామలింగానికీ, కృష్ణదేవరాయలికీ, వీరిమతగురువులు తాతాచార్లవారికీ, వీరికి కృతి నిచ్చినధూర్జటి, ముక్కు తిమ్మన్న లోనైనవారికీ సంబంధించినవి వున్నాయి, వట్టిపొడిమాటలు మాత్రమేకాక—

ఉ. ఆ రవి వీరభద్రచరణాహతి డొల్లినబోసినోటికి
న్నేరఁడు రామలింగకవి నేరిచెఁ బో మన ముక్కుతిమ్మన
కూ్రరపదాహతిన్ దెగినకొక్కిరివంటికి దుప్పికొమ్ముప
ల్గా రచియించినాఁడు కవి గాననిచో రవిగాంచ నేర్చునే.

అనే పద్యంలోకూడా రిజిష్ట రవడం తటస్థించింది. ఆయీసందర్భా లన్నీ తుడుతుపాకీ యెగిరిపోయేటట్టు "గజం మిథ్య పలాయనంమిథ్య" గా తోసివేయడానికి అవకాశం కనపడదు. యిటీవలవారు పరిశీలించి చేసిన కాలనిర్ణయాన్ని తోసివేయడానికిమాత్రం అవకాశం వుందా అంటే; అది మాత్రం సుఖసుఖాల ఖండింపఁబడుతుందా? దానికి ఆధారాలకోసంపాట్లఁ

బడాలి. పడ్డాదొరకడం కష్టం. నిన్న మొన్న యేభైవత్సరాలనాఁడు జరిగిన వక విషయంలో సాక్ష్యం సంపాదించవలసివచ్చి యీమధ్య నేను సకల చిక్కూ పడ్డాను. ఇంద్రద్యుమ్నునికి యేదో మహాకూర్మం దొరికినట్లు ఆ కాలంలో నాతో చదువుకొన్న వకాయన దీనితత్త్వం యిది అంటూ చెప్పి లోకానికి సందేహనివృత్తిని చేసివున్నారు. దీనిమాటే యీలావుంటే కొన్నివందలయేళ్ళనాటిసంగతికి తగ్గసాక్ష్యం దొరకడం సులభసాధ్యంకాదు. కాఁబట్టి ఆయీకథలని వినోదంగా చదువుకొని ఆనందించేవారి కుతూహలాన్ని భంగపరచడం మనకెందుకు? యీకథలు చెప్పుకొనే సమయంలో పెద్దన్నగారు వగయిరా దిగ్గజాలతోపాటు రామలింగంకూడా రాయలవారి ఆస్థానంలో వున్నాఁడనే మనంకూడా విశ్వసిద్దాం. విశ్వసించిన్నీ అతఁడు మాత్రం "అమవస" శబ్దాన్ని తప్పు పట్టి వుండఁడని అతనిప్రజ్ఞాతిశయం వల్ల మనం తెలుసుకుందాం, యెప్పుడూకూడా కథాకల్పనలుకొన్ని బొత్తిగా సత్యంగానివి జరుగుతూనేవుంటాయి. వకటి వుదాహరిస్తాను.

వకమహామంత్రవేత్త, మహాతార్కికుఁడు అయిన విద్వాంసునికి, "ఉచ్ఛిష్టగణపతి"ని గూర్చినగ్రంథం నావద్దనుండి తెచ్చిపెడతానని వక బ్రాహ్మణపిల్లవాఁడు వాగ్దానం చేసి, నావద్దనుంచే సంపాదించినట్లు చెపుతూ "శ్వేతార్కగణపతి" "లక్ష్మీగణపతి" అనేవి రెండున్నూ పట్టుకువెళ్ళియిచ్చి వున్నాఁడు. "ఉచ్ఛిష్ట" మాత్రం తరవాయి వుండడంచేత ఆ మహాపండితుఁడు నన్ను స్వయంగా అడగడం తటస్థించింది. అందువల్ల నాకీసంగతి తెలియడానికి కారణం అయింది. ఈకల్పనవల్ల ఆ పిల్లవానికి యేం లాభం వుందో? పరిశీలిస్తే యేమీ వున్నట్టు తోఁచదు. ఆపండితుఁడు మాత్రం నావద్ద "ఉచ్ఛిష్టగణపతి" కల్పం వుండికూడా నేను యివ్వక అబద్ధమాడినట్లు నిశ్చయించుకొన్నాఁడు. యింకొకటి, యెంతోమంది "పాండురంగ విజయం" అనే పుస్తకం రామలింగకవి రచించింది యెక్కడో వుందనిన్నీ చూచామనిన్నీ చెప్పేవారిని నేను స్వయంగా యెఱుఁగుదును. కొందఱు తమవద్దనే వుందంటూ చెప్పడమున్నూ కలదు. అందుకోసం నాచిన్నతనంలో వారివారి గ్రామాలకు నేను తిరగడం కూడా తటస్థించేది. పాండు

రంగమాహాత్మ్యమే తప్ప ఆపుస్తకంమాత్రిం యెక్కడా కనపడ్డట్టులేదు. "పాండురంగవిభుని పదగుంఫనమ్మను"అనే పద్యపాదంలో వున్నమాటకు "పాండురంగమాహాత్మ్యకర్త"అని చెప్పుకున్నా సరిపోతుంది. పైపద్యంలో తుట్టతుదను వున్న— "కాకమానురాయ" అనే పదంలో "మానురాయడం" అంటూ యేదో అర్థాంతరం వున్నట్లు కల్పించి వసుచరిత్రికర్త కున్నూ రామలింగానికీ యేదో జరిగిందంటూ వకకథ చెపుతారు. కాని యీపద్యం పాంచాలీపరిణయగ్రింథకర్తను గూర్చిన ప్రిశంస కాని అన్యం కాకపోవడంచేత ఆకథ బొత్తిగా విశ్వాసార్హంకాదు.

పాండురంగ మాహాత్మ్యాలు రెండున్నూ వకటేకాని వేఱువేఱు కావనుకొనేవారిలో నేనూ యేకీభవించే వాణ్ణే. కాని "విజయం"లోవంటూ శిష్టపరంపర నాచిన్నతనంలో చదివే పద్యాలలో వకటిన్నీ "మాహాత్మ్యం" లో కనపడడంలేదు. దాన్ని గుఱించి యిప్పటికిన్నీ నిర్ధారణ నాకు కుదిరిందికాదు. ఆపద్యాలు విశేషించి లేవుగాని పదింటిదాఁకా వుండేవి. యిప్పుడు జ్ఞాపకం వున్నవాట్లల్లో కొన్ని చూపుతాను. "సీ. ద్విరదంబు నడతోడ నెఱిఁ జెంది" అనే సీసపద్యం మఱిచిపోయాను. ఎవరికేనా వచ్చివుంటుంది. ఇందులోవున్న విశేషం, యీద్విరదపదం "ద్వి" అనేదాన్ని పోఁగొట్టుకొని "రదం" గా మారడం, మాఱిన తర్వాత, ఆకన్నెయొక్క నవ్వుతో సామ్యాన్ని పొందడం వగయిరా శబ్దచిత్రాలతో చేరివుంటుంది. మఱిన్ని—

తే. గీ. "అతివ కచనాభిజఘనదేహాననముత
మీనదరసాల తారాజపానికరణ"

అనే పద్యంలో, "తమీ-నద-రసాల" యీరీతిగానున్నూ, మళ్ళా మొదటి అక్షరం "త" కారాన్ని తొలఁగించి "మీన—దర" యీరీతిగానున్నూ, నానాచిక్కులతో వుంటుంది. యిదిన్నీ శబ్దచిత్రానికే సంబంధించి వుంటుంది. యీకవిత్వాన్ని అధమకవిత్వం కిందనేలాక్షణికులు నిర్వచించి వున్నారు. గాని చెప్పవలసివస్తే మాత్రిం యేరామలింగమో యే పింగళి సూరన్నో కాని చెప్పలేరనుట సిద్ధాంతమే.

చ. "అలఘనచంద్రబింబనిభమై తనరారెను వక్త్రమందులోఁ
గలిగిన నామభేదములకై వడి భాసిలెఁ గప్పుకొప్పు, చె
క్కిలి రదనాంశుకమ్ము, లవిగుబ్బలకున్ సరిరాకపోయె జే
తులుసరు లయ్యె దానివలెఁ దోఁచెను బొంకపుటూరు నాతికిన్"

ముఖము చంద్రబింబంలా వుందనిన్నీ, కొప్పు, చెక్కిలి, పెదవి, మేఘము, చంద్రుఁడు, దొండపండు వీట్లవలె నున్నవనిన్నీ, చెప్పుకుంటే కొంత సులువుగా కొంతవఱకు పద్యార్థం తెలుతుంది. "అవి" అనేపదం కేవలం మోసంగా కనపడుతుంది. దానికి పర్వతం అని చెప్పుకుంటే, ఆమోసం తొలఁగిపోతుంది. చేతులు సరులయ్యె, పూలమాలికలజోడువలె వున్నాయన్నమాట. "దాని" అంటే కత్తి, నూగారు కత్తివలె వున్నదన్న మాట. "అవి" "దాని" యీరెండున్నూ తెలుగుపదా లనే భ్రమకు పూర్తిగా అవకాశంకలిగించేలాగు వాడడమే కవినైపుణి. మొదటి చరణంలో "చంద్రబింబ" పదం కొంతఅపమార్గానికి అవకాశాన్ని సూచిస్తుంది. అయినప్పంటికీ ఆవల ఉపమేయాలు మూఁడుండడంచేత కవితారహస్యజ్ఞులు "చంద్ర"వేఱనిన్నీ "బింబ"వేరనిన్నీగుర్తించడానికి అవకాశంలే కపోలేదు. మొట్టమొదటిదశలో వున్నకవులకు యీలాటిపద్యాలన్నానాలుఁగు చరణాలు వకటిగానే వుండే—"సారంగ మద హారి సంపన్నత వహించు ఘనసారసచ్ఛాయ కడుఁరహించు" అనేమాదిరిపద్యాలన్నా యెంతో ఆప్యాయనంగా కనబడతాయి. అలాటివి తాను చెప్పలేకపోయినా చెప్పాలనిమాత్రం కుతూహలపడడం తప్పదు. మాముత్తాతగారు కొన్ని పద్యాలు యీమాదిరివి వారి గ్రంథంలో వ్రాసి వున్నారు,

ఆ. వె. జలజకనక కటక నళిన భద్రేభముల్
సకియకంఠకాంతి జఘన చరణ
గమనములకు సాటిగానక వనవృత్తి
నెదిరి పూర్వరూపపదమునందె.

ఇందులో "వనవృత్తి" అనేపదం శ్లేషిస్తుంది మొదట వాడిన ఉపమావాచకాలు తలకిందైనప్పంటికి రూపం వకలాగేవుంటుంది. లక్ష్మీ

సహస్రంలో చాలా వఱకు యీమాదిరి కవిత్వాన్ని వేంకటాధ్వరి వాడి వున్నాఁడు. ఆరోజుల్లో మేముకూడా యీమాదిరి కవిత్వాన్ని వాడుతూ వుండేవాళ్ళము. ఆకవిత్వం సంస్కృతంలోనే యిప్పటికిన్నీ వుంది. తెలుఁగులోమాత్రం చెప్పినట్లులేదు—

శ్లో. విపక్షరక్షఃపరిశిక్షణక్షమో వ్యభీక్ష్ణ తీక్ష్ణాక్షర రూక్షవీక్షణే.

ఇది ధాతురత్నా కరంలో యమకంగా మేము వాడినది. కాశీసహస్రంలో యీతికమకలున్న శ్లోకాలు చాలా వున్నాయి. వాట్లల్లో కొన్నిటికి అర్థంచేసుకోవడానికి మళ్ళా మావద్దకు రావలసిందే. అలా చెప్పడమే యెక్కువ ప్రౌఢిమ అనేవారే లోకంలో పండితులలో చాలామంది. తేలికగా రచించేరచన అసలు కవిత్వమే కాదనిన్నీ, గొడ్లకాపరులకున్నూ గొల్లలకున్నూ వుపయోగిస్తుందనిన్నీ వారివుద్దేశం. వయిగా కాళిదాసభవభూత్యాదుల కవిత్వం—"రఘూణా మన్వయంవక్ష్యే" "శైశవేభ్యస్త విద్యానాం" "ఇదంకవిభ్యః" మాదిరిది కవిత్వమే కాదనిన్నీ అనేవారు పలువురు కనపడతారు. కాని, యీకాలంలో భావకవిత్వం చెప్పేవారిలో ఆయీరహస్యం యెఱిఁగినవారున్నారని నేననుకుంటాను. వారులోకాన్ని వారివారి క్రొత్తరచనచేత యెంతవఱకు తృప్తిపఱుస్తూవున్నారో నేను నిర్వచించి చెప్పఁజాలనుగాని, శబ్దచిత్రమంటే వారికి బొత్తిగా కిట్టదనిమాత్రం చెప్పవచ్చును. యీ భావకవు లందఱున్నూ నరకానికి పోతారనే వారివాదం నాదికాదు. కవిత్వం పక్వావస్థకు వచ్చేటప్పటికి ఆ యీశబ్దచిత్రాలమీఁద కవికి రుచి తగ్గి తీరుతుంది. అట్లుతగ్గడంతోటట్టే స్థూలదృష్టులు వెనకటి కవిత్వంలాగ అప్పటికవిత్వం లేదని అనుకుంటూ వుంటారు.

శబ్దచిత్రాలమాటా అర్థచిత్రాలమాటా యేలావున్నా వక్క కవికి జన్మానికల్లా యేదోవక గ్రంథంవల్లనే పేరు వస్తుందిగాని రచించిన పుస్తకాలన్నింటివల్లా రమ్మంటేరాదు. వసుచరిత్ర కున్నంతపేరు, ఆ కవి తాలూకు తక్కిన పుస్తకాలకులేదు. పెద్దన్నగారు మనుచరిత్ర కంటె మరి వకటి రచించియున్నారేమో కాని బయటికి రానేలేదు, కనక చిక్కేలేదు. కృష్ణదేవరాయలు చాలా పుస్తకాలు రచించినట్లు కనపడుతుంది, బిరుసు

పాకంగావున్నప్పటికీ ఆముక్తమాల్యదవల్లనే ఆయనపేరుశాశ్వతమయింది. ఆభాసవిమర్శకులు కొందఱు ఆయన కాపేరుకూడా లేకుండా చేయడానికి కొన్ని అవ్యక్తపు వ్రాఁతలైతే వ్రాశారు గాని ఆ వ్రాఁతలు తుట్టతుదకు మటుమాయమైపోయి రాయలవారి కర్తృత్వం దానికి స్థిరపడి చాలా రోజులు కావచ్చింది. యీవిషయంలో కందుకూరివారిని మిక్కిలీ అభినందించవలసి వుంటుంది. కర్మంచాలక వంశవర్ణన పద్యాలు మనుచరిత్రలోవి రాయలు పుచ్చుకోవడం ఆయనకు ముప్పుతెచ్చింది. అందులో స్వవిజయయాత్రాదులు వర్ణించవలసి వస్తుందిగదా అని రాయలు పెద్దన్నగారి పద్యాలే వుదాహరించుకున్నాఁడు. పాపం దానితో ఆయన కొంప ముంచడానికి యిటీవల కవులు చాలామంది సిద్ధపడ్డారు. యీ ఆభాస విమర్శకకోటిలో అప్ప కవిగారు కూడా చేరడం మిక్కిలి శోచ్యం. యేలా కలిసిందో యింకొక సీసపద్యం శ్రీవిష్ణువర్ణనంకూడా చాలాభాగం కలిసింది. దానితో మఱింత సందుదొరికింది ఆభాసకులకు. యీజనాపవాదను పూర్తిగా తొలగించడానికి సాహసం చాలక కందుకూరివారుకూడా ఆముక్తమాల్యదలో మృదుపాకంగా వుండే పద్యాల కర్తృత్వాన్ని కొంత మట్టుకుఅర్ధాంగీకారంతో తాతగారికే అట్టేపెట్టినారు. యీ అపవాదకు కొంత ఆధారమేనావుంది. యే ఆధారం లేకుండానే మహాభారతాంధ్రీకరణాన్ని నన్నయ్యగారి నుండి తొలగించి రాజరాజనరేంద్రుఁడి నెత్తిని పులిమేవారు కొందఱున్నారు. కొందఱు నన్నయ్య గారి రచనలో చాలాభాగం నారాయణభట్టు నెత్తిన పులుముతూ వున్నారు. యీ అపోహలకి తలగాని తోఁక గాని వుండదు. తోచినట్టు వ్రాయడమే వారిపని. నన్నయ్యగారి లోపం వల్లనే యీ కల్పన పుట్టిందనుకుంటే తప్పులేదు. నన్నయ్య తన సహాధ్యాయియైన నారాయణభట్టువల్ల రచనావిషయంలో కాకపోయినా తాను ఆంధ్రీకరించేటప్పుడు సంస్కృతం వినిపిస్తూ వుండడమో లేక అప్పుడప్పుడు తాను రచిస్తూ వుంటే వ్రాసిపెట్టడమో నారాయణభట్టువల్ల జరగడంవల్ల కృతజ్ఞతా సూచకంగా "—నారాయణభట్టుతోడయి నిర్వహింపగన్" అని వ్రాసినాఁడు. ఆ వ్రాయడం వచనంలో కాక పద్యంలో

అవడంచేతనో, లేక అతనికివున్న నారాయణ నామధేయాన్ని సార్థకం చేయడానికో, యితరులను గొప్ప చేయడం యోగ్యులకు సహజగుణ మవడంచేతనో, నిశ్చయింపఁజాలంగాని — "పాకశాసనికి నారాయణు నట్లు" అనివ్రాసినాఁడు. దానితో మఱింత మునిగింది. బాగా పరిశీలిస్తే నన్నయ్యగారు పెట్టిన పోలికవల్లనే నారాయణభట్టు రచించిన రచన లేశమున్నూ లేదని స్పష్టపడుతుంది. కాని కొందఱు అందుకు వప్పు కోరు. "నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్" అన్న గీతా వాక్యాన్ని పుచ్చు కొంటారు. భారతయుద్ధంలో అందఱినీ కృష్ణుఁడేసంహరించాడంటారు. అర్జునుణ్ణి—"లంబోదరాయనమః, ఉదరంపూజయామి" కింద జమకడ తారు. ఆయీ ధోరణులు చూస్తే నవ్వువస్తుంది. ప్రస్తుతం మనకు కావల సిందల్లా, కృష్ణదేవరాయలే ఆముక్తమాల్యదను రచించినవాఁడనేదే.

ప్రారంభించినవిషయం విషయాంతరంలోకి చొరబడింది కాని మఱికొన్ని మాటలు యింకా దీన్నిగుఱించి వ్రాయాలి. వకరు నన్నయ్యా గారి కవిత్వాన్ని విమర్శిస్తూ—అర్జునుఁడిచేత "కానీన" అని కర్ణుణ్ణి సంబో ధింపఁజేసిన నన్నయ్యగారు అనాలోచనాపరులంటూ వకఆభాసవాదాన్ని బయ లుదేఱఁదీశారు. అవునంటూకొందఱు వారి వెనకాల హాంగు చేయడానికి మొదలుపెట్టేరు. కర్మంచాలక నేనన్నానుగదా: "అయ్యా ! యీలోపాన్ని నన్నయ్యగారి కంటగట్టడం న్యాయంకాదు. వ్యాసుల వారికే ఆపాదించండి అని దానికి తగ్గ ఉపపత్తులు సూచించివూరుకున్నాను. నేను చేసిన అప రాధం అంతమాత్రమే. అయినా దాన్ని పెద్దచేసి నన్ను దూషిస్తూకొందఱు యేదో పత్రికలోయేమేమో వ్రాశారు. దానిమీఁద—"కొండ తవ్వి యెల కనిబట్టినట్లు" కొన్నివ్యాసాలు వ్రాస్తే ఆవలివారు యోగ్యులు కనుక అంత టితో విరమించి వూరుకున్నారు. ఆవలవా రట్టివారే కాకపోతే పిడివాదంగా పరిణమించి యెప్పటికి తేలేదికాదు. అక్కడ "కానీన" పదప్రయోగంవల్ల వచ్చే చిక్కేమిటంటే; ఆసందర్భం ద్రౌపదీ వివాహఘట్టానికి సంబంధిం చేదవడంచేత, అప్పటికే అర్జునుఁడికి కర్ణుఁడు కన్యకాపుత్రుఁడని తెలిసి నట్లవుతుందనిన్నీ, ఆలాతెలిసేయడల ఆరహస్యం ధర్మరాజాదు లందరికీ

తెలియక మానదనిన్నీ, దానితోటి— "కర్ణుఁడితల భారతం" గనుక, భారతగాధే ఆఁగిపోవలసివస్తుందనిన్నీ శంకించేవారి ఆశయం. యీ అభిప్రాయం ఆపాతరమణీయంగా వున్నప్పంటికీ కొంత లోఁతుగాఆలోచించి చూస్తే అంత యుక్తంగా తోఁచదు. "కానీన" అంటే "ఓకర్ణా" అని సముదాయార్థమే వివక్షింపవలసి వుంటుంది. గాని, కన్యకకు అనఁగా కుంతికి సూర్యునివల్ల కన్యకావస్థలో వున్నప్పుడు పుట్టినవాఁడు అనేఅర్థం వివక్షితంకాదు. అక్కడ అట్టితాత్పర్యమే కాకపోతే నన్నయ్యవంటి మహావిద్వత్కవి దాన్ని వాడివుండఁడు. పాదపూరణార్థంగా— "కుంతీపుత్రో యుధిష్ఠిరః" అన్నట్లే వ్యాసులవారు యెన్నోచోట్ల పాదపూరణార్థంగా— "కర్ణోవైకర్తనస్తథా" అని వాడి వున్నారు. అలాటిస్థలాలలో, వైకర్తన పదంతో లేశమున్నూ అవసరమే కనపడదు. కవిత్వాన్ని సమన్వయించేటప్పుడు వ్యాకరణసూత్రాలలోనున్నూ తార్కికులఅనుగమాలలోనున్నూ వున్న లేశలేశాలకు చెప్పినట్లు సార్థక్యం చెప్పడం యెన్నఁటికీ సంఘటింపదు. అలాచెప్పేటట్టయితే నిలిచే కవిత్వమే వుండదు, సరిగదా; అది యే శాస్త్రంకిందకో వస్తుంది గాని కవిత్వంకిందకికూడా రాదేమో! దీన్ని తెల్పడానికే — "ప్రధ్వంసాభావము ప్రాగభావమనుచున్ దర్కింతురు" అంటూ శ్రీనాథుఁడు పరిహసించి వున్నాఁడు. ఇది, అనగా, "కానీన" పదప్రయోగం ప్రాసస్థానంలో వుండడంచేత దిద్ద వలనుపడదుగాని దిద్దడానికి అవకాశం కలిగే స్థలాలలో కవిత్రయంవారి వెన్నో ప్రయోగాలు అవయవార్థం వివక్షచేస్తే బాధ కలిగించేవి గోచరిస్తాయి: యెఱ్ఱన్నగారు సకలధర్మస్వరూపుఁడగు యమునిచేత మహాపతివ్రతాశిరోమణి యైన సావిత్రిని, శృంగార ధోఁరణిగా "తను లతాంగి" అని సంబోధింపఁజేసెను. అక్కడ అవయవార్థం వివక్ష చేయవలసిందని ప్రయోక్త తాత్పర్యమనుకొనేవాళ్ళుంటారా? ఓ అమ్మాయీ అని పిలిపించినట్లే సహృదయులనుకుంటారు. యిట్లే గరుడుఁడు "పయోరుహాననా" అని తల్లిని సంబోధించినట్లు భారతంలోవుంది. దీన్ని వెక్కిరించినవారున్నూ వున్నారు. ఆ యీ చర్చ కొంత భారతవిశేషాలలో వ్రాసినట్లు జ్ఞాపకం. యీలాటి అనా

లోచన ప్రసంగాలతో భారత మహాకవులను అర్థంకరించడానికి నాకు బొత్తిగా యిష్టంవుండదు. యింతమాత్రం కూడా తెలియనివారు భారత కవులని నా హృదయం విశ్వసింపదు. అట్టివారే అయితే ఆంధ్రభాషకు పరమ గురువులు కావడం తటస్థింపదని నా ధృఢవిశ్వాసం.

నన్నయ్యభట్టునుగూర్చి కొందరు మహామహులు శుద్ధ చేదస్తునిగా వ్రాయడం మొదలెట్టినారు.— ఆ మొదలెట్టడం "రిసర్చి" లో సందర్భం కాబట్టి అది వారి కేదోలాభకారికావచ్చును గనుక కొంతసహ్యాం. ఆచేద స్తలక్షణాన్ని సమర్థించడానికొ_బోలును. "జపహోమతత్పరు" వగయిరా విశేషణాలు కొన్నిటిని సాధకంగా తీసుకుంటారు. వారికి "లోకజ్ఞు" అనే విశేషణం పొడకట్టదో యేమో! లోకజ్ఞత్వం లేని జపహోమ తత్పర త్వాదులు కవిత్వసారస్యాన్ని భంగిస్తే భంగిస్తాయేమో కాని, దానితో మిళితమైనవి బాధించవు. అప్పటికాలంలో బ్రాహ్మడికి కవిత్వం చెప్పడం కంటే కూడా వైదికకర్మానుష్ఠాన సంపన్నత్వమే అత్యావశ్యకంగా వుండేది అనే మాటను విశ్వసించనివా రుండరు. ఆకారణంచేతనేకదా తిక్కన్న మంత్రిపదవిలో నుండికూడా సోమయాజులు కావలసివచ్చింది. యిప్పటి కాలానికి బ్రాహ్మణత్వానికి వచ్చిన అగౌరవం యెన్నడూ వస్తుందని యెవ్వరున్నూ ప్రాచీనులు కనిపెట్టినట్టే తోచదు. కలియుగధర్మాలుఅంటూ వ్రాసినవారు కూడా యీ సందర్భాన్ని బాగా సూచించినట్లే కనబడదు. వారు వ్రాసినత్రోవ వేరుగానున్నూ యిప్పుడు జరిగేది వేఱుగానున్నూ కనపడుతూవుంది. ప్రస్తుతమేమిటంటే: నన్నయ్యగారినిగూర్చి వ్రాసే వ్రాతలు కొన్ని బొత్తిగా యుక్తిసహంగా కనపడటం లేదనేదే. యీ వ్రాసేవారికి నన్నయ్యగారి జ్ఞానంలో సహస్రాంశంకూడా వుండ దను కోవడం సత్యదూరంకాదు. కవికి వేదశాస్త్రపరిచయం వున్నంత మాత్రం చేత పుస్తక మంతా చేదస్తమయ మవుతుందనడానికి ప్రాజ్ఞులొప్పరు. యితర సామగ్రి లేక కేవల శ్రోత్రియత్వం మాత్రమే వుంటే — "శ్లో. భోజనం దేహిరాజేంద్ర ఘృతసూపసమన్వితం" మాదిరిగా కవిత్వం వుంటేవుంటుంది అంతేకాని బోలెడు లోకజ్ఞత్వం వుండీ అష్టభాషలకు

వాగనుశాసనుఁడై రాజసంస్థాన మర్యాదలు పూర్తిగా యెఱిఁగిన నన్నయ్య గారు కవిత్వాన్ని చెపుతూ బూడిదరాల్చినారనడాన్ని వినడానికి సహృదయు లకు కర్ణకఠోరంగా వుండకమానదు.

యీలాటిసందర్భాన్నే పిండిప్రోలి లక్ష్మణకవిగారికిన్నీ శిష్టు కృష్ణ మూర్తిగారికిన్నీ సంబంధించిన కథలలో చరిత్రకారులు వ్రాస్తూవచ్చారు. యుక్తిప్రయుక్తులలో లక్ష్మణకవిగారు కృష్ణమూర్తిగారిని అతిక్రమిం చినట్లు శిష్టపరంపరవల్ల వినడం కలదు. కాని కృష్ణమూర్తిగారిశక్తి అసా ధారణమైనదికాని పకమాదిరిదికాదు. శ్రీభాగవతుల హరిశాస్త్రుల్లు గారి వంటి మహాసముద్రులు కృష్ణమూర్తిగారి పాండిత్యాన్ని మెచ్చడం నేను స్వయంగా వినివున్నాను. అయితే యేకారణంచేతనో చాటువులుతప్ప వారి యితరకవిత్వం వారి పేరుకు తగ్గదిమాత్రం బయలుదేరలేదు. లక్ష్మణకవి గారుకూడా పట్టిచమత్కారపుమాటలే కాని గ్రంథాలంతగా వ్రాయలేదు. కాని, రావుదమ్మన్నగారి ధర్మమా అని రావణదమ్మీయం అనే పేరుగల "లంకావిజయం" చెప్పడం తటస్థించడంచేత మళ్ళా రెండో పింగళి సూరన్నగారేమో అని లోకులు సన్నుతించడాని కవకాశం కలిగింది. ఆ లంకావిజయంలో సుమారు మూడు నాలుగు వందల పద్యాలకన్న అధికం వుండవు. కాని వున్నంతలో చాలా యుక్తియుక్తంగా ఉభయా ర్థాలూ స్ఫురించేటట్టు మాత్రం వున్నాయి. వాట్లల్లోకొన్ని యిక్కడ వుదా హరించి చూపడం ప్రస్తుతమే అయినప్పటికీ వ్యాఖ్యానం కూడా వ్రాస్తేనే కాని పాఠకులకు అర్థబోధ కాదని సంశయం కలిగింది. అయినా పక్క పద్యాన్ని వుదాహరిస్తాను.

తే. గీ. జ్యేష్ఠుఁడా ! లక్ష్మణాగ్రజక్షేత్రమీవు
వదలకుండిన మోసంబువచ్చుఁ నింకఁ
జండనిర్భీకవనచారిపిండిప్రోలి
కవికులవరుతో రిపుత ముఖ్యముగ వలదు.

యీ పద్యంలో రామాయణార్థం, రావణాసురునితో తమ్ముఁడు విభీషణుఁడు రాములవారిభార్యను ఆయనకు సమర్పించితేనేతప్ప చండ,

ర్భీక, వనచారి (కోతులయొక్క) పిండి (సముదాయము) వచ్చి మన మీఁద పడుతుంది, దానివల్ల మనకు మోసం కలుగుతుంది. అని పలికి నట్లు గ్రహించవలెను. ఇఁక లక్ష్మణకవిగారి స్వవిషయం, లక్ష్మణకవి గారి భూమిని వెంటనే యివ్వకపోతే మనకు మోసం కలుగుతుంది, చండ, నిర్భీక వనచారి, అనఁగా తీక్ష్ణమైనట్టియు, భయం లేనట్టియు, కవనమందు వర్తించే పిండిప్రోలి కవిశ్రేష్ఠునితో శత్రుత్వం పనికిరాదని దమ్మన్న గారి తమ్ముఁడు అన్నగారికి నీతిని చెప్పినట్లు గ్రహించవలెను. రెండో పింగళిసూరన్నవంటి మహాకవి దిద్దరాని స్థలములో ప్రయోగించిన "కవన" శబ్దాన్ని కూడా ఆక్షేపించే యీకాలపు పాండిత్యాలనుగూర్చి యేమివ్రాయ డానికిన్నీ తోఁచదు. ఆశబ్దం యే ధాతువునుంచి పుట్టిందో, ఆశబ్దంలేకపోతే "కవి" శబ్దం మాత్రం యేలా వుంటుందో అనే విచారణ చేసేశక్తి లేని వారు విమర్శనలంటూ చేయడం శోచనీయం. దీన్ని గుఱించి అన్యత్ర విస్తరించడంచేత యిక్కడ అధికముగా వ్రాయలేదు. మనకు ప్రధానవిష యం, యిప్పటివలెనే పూర్వకాలంలో కూడా తప్పొప్పులు తెలియక ఆక్షే పించేవారుండేవారనిన్నీ అట్టి వారే యెవరో— "అమవస" అనేదాన్ని గూర్చి వెక్కిరించి వుందురనిన్నీ ఆవెక్కిరింపును రామలింగంవంటి మహా పండితుని కంటఁగట్టడం అయుక్తమనిన్నీ వ్రాస్తూ ప్రసక్తాను ప్రసక్తంగా నానావిషయాలు నడిచివున్నాయి. ఈలా నానా విషయాలు నడవడాన్ని కొందఱయితే అభినందిస్తారు కాని అసూయాపరులు "నానాకూళకషా యం" అనివెక్కిరిస్తారు.

పరిశీలనలేనివారు రామలింగకవికి సంబంధించిన వికటకవిత్వపు గాథలు లక్ష్మణ కవిగారికి అంటగట్టడం కూడా కలదు. రాయల కాలంలో రామలింగం యెట్టివాఁడో యిటీవల లక్ష్మణకవి కూడా అట్టివాఁడే అనడా నికి తగ్గ గాథలు చాలా వున్నాయి. లక్ష్మణకవిగారికి కొంతపూర్వకాలంలో అడిదం సూరకవిగారికిన్నీ, సోమకవిగారికిన్నీ జరిగిన గాథలుకూడా కొంతచిత్ర విచిత్రంగా వుంటాయి. వీట్లనుగూర్చి అనకాపల్లి హైస్కూ లుకో లేక లోయరు సెకండరీ స్కూలుకో హెడ్మాష్టరుగావుండే బులుసు

పాపయ్యశాస్త్రుల్లుగారు చాలా గాథలు చెప్పగా వినివున్నాను. సోమకవి గారు శిష్టు కృష్ణమూర్తిగారి వంటివారు. ఆడిదం సూరకవిగారు లక్ష్మణ కవివంటి కవి. వీరిద్దఱి వాదోపవాదాలున్నూ వినసొంపుగా వుంటాయి. వట్టితిట్లయితే అసహ్యంగా వుంటాయికాని యితరాలు యేకవులవేనా శ్రోత్ర పేయంగానేవుంటాయి. వీరిద్దఱున్నూ విశాఖపట్నండిస్ట్రిక్టువారే. సోమ కవిగారి గ్రంథాలు చాలా వున్నట్లు వినడమేకాని అవి యింకా బయటికి వచ్చినట్లు కనబడదు. కొందఱు గ్రంథాలు వ్రాసినా అవి ప్రసిద్ధికి రాకపోవడమున్నూ కొందఱు వ్రాసినవి కొంచెం గ్రంథాలే అయినా ప్రసిద్ధికి రావడమున్నూచూస్తే వారివారివాణియందు వుండే రసారసములే కారణం అనుకోవాలి. పూర్వకాలంలో రసవంతమైన కవిత్వాన్ని పలుమంది వ్రాసుకోవడమున్నూ నీరసాన్ని వుపేక్షించడమున్నూ జరిగేది. దాని వల్లనే మంచి చెడ్డలు లోకానికి కొంత బోధపడేవి. యిప్పుడు మదో మాన్యమో తాకట్టుపెట్టైనా సరే వారివారి కవిత్వాలు అచ్చువేసుకోవడం జరుగుతూవుంది. వాట్ల నెవఱూ కొనకపోవడంవల్ల ఆకవిత్వం బాగులేదని తెలిసికోవలసి వస్తూవుంది. లోకం యేలాటిదాన్ని ఆదరిస్తుందో యేలాటి దాన్ని ఆదరించదో తెలుసుకొని కవిత్వం చెప్పడం దుర్ఘటం. కవి తనకు తోచినవిషయమంతా కవిత్వంగా వ్రాస్తూవుంటే అందులో యేదోవకటి లోకాదరాన్ని పొందితే పొందుతుం దనుకోవాలి. "ఏష్టవ్యాబహావః పుత్రా యద్యేకోఽపి గయాం వ్రజేత్" చాలామంది కొడుకులు గల వాఁడికి అందులో యెవడో వకఁడు గయ వెళ్ళేవాఁ డుంటే వుంటాఁ డని అభియుక్తులు చెపుతారు. అలాగే కవి వ్రాసే పుస్తకాలున్నూ కావచ్చును. లోకంతోపాటుగా గ్రంథకర్తకుకూడా తనకవిత్వంలో రసారస విచారణ విషయంలో "వోటు" వున్నట్లే లాక్షణికులు వ్రాసివున్నారు కానీ యేమేనా ఆ విషయంలో భారమంతా లోకులమీఁదనే పెట్టడం యుక్త మనుకుంటాను.

అయితే వకప్పుడుమాత్రం కవి కల్పించుకుంటేనేగాని తేలదు. జంట కవిత్వాలవిషయంలో "ఇది వారిదీ, అది వీరిదీ" అంటూ తబ్బిబ్బు

ప్రసంగం వచ్చేయెడల తత్వాన్ని వారువారు చెప్పవలసివస్తుంది. అలా చెప్పి నప్పటికీ కొంతమంది వారివారిధోరణిని మార్చుకోవటమే తటస్థిం పదు. అట్టిస్థితిలో ఆ విషయంకూడా ప్రాజ్ఞలోకంమీఁదకే రావలసివస్తుంది. వాళ్ళధర్మమా అని భారతకవులు వారివారి కవిత్వాలు విడివిడిగా వ్రాసినట్లు తేల్చారు కాని, అలా తేల్చకేపోయి మొత్తం భారతం వుమ్మడిమీఁద రచించినట్లు గద్యలో వ్రాసే యెడల యిటీవల విమర్శకులు వారిచిత్తం వచ్చినట్లు కలియఁ దొక్కుకోవలసివచ్చేదే అనుకుంటాను. అలా టప్పుడు కూడా కొన్ని గుర్తులవల్ల బ్రహ్మష్ఠోబ్రహ్మంమీఁద వారివారిపద్యాలు విడఁదీయవలసి వస్తేనో? సమాస భూయిష్ఠమైనదిన్నీ తత్సమపదభూయిష్ఠ మైనదిన్నీ వకరిదనిన్నీ, ఆంధ్రపద భూయిష్ఠమైనది వకరిదనిన్నీ, ఉభ యంకలది వేఱొకరిది అనిన్నీ యేర్పాటయితే చేస్తారు గాని, అందులో కొంత అన్యాయం జరక్కపోదు. వకటి మాత్రం వుంది. సమాసాలు దీర్ఘదీర్ఘంగా వాడినవారు తెలుఁగుకవులలో పలువురయితే వున్నారు గాని నన్నయ్యగారిసమాసధోరణిమాత్రం యెన్నివేల పద్యాల్లో పాతిపెట్టినా కనుక్కోవడానికి అవకాశం వుంటుందని నా నిశ్చయం. యేమేనా యిటీ వలివాళ్ళు "కలగాపులగం" గా కలియఁ దొక్కకుండా వుండడానికి వారి వారి గద్యలే ఆధారమైనవన్నమాట ప్రధానమయినది. వారేకకాలపువారు కారుగదా, "ఉమ్మడిదిమ్మడి" వ్రాఁత యేలా తటస్థించడం. అంటారేమో? అది నాకున్నూ తెలుసును. నారాయణభట్టు కన్నడంలో కాఁబోలును చాలా గ్రంథాలు వ్రాసినట్టు యెవరో వ్రాసినట్లు జ్ఞాపకం. కావచ్చును. ఆయన కవిత్వంకిందఁ గాని రాజనరేంద్రునికవిత్వంకిందఁగాని నన్నయ్యభారతాన్ని జమకట్టడం అన్యాయ మనేకాని నేను వ్రాసేది, నారాయణభట్టు మహాకవి కాదనడానికి కాదు. రాజనరేంద్రుఁడు విద్వాంసుఁడే కాని కృష్ణరాయలవలె కవిమాత్రం కాఁడు. కవి అయి వుంటే ఆమాట నన్నయ్యగారు పీఠికలో వ్రాయకపోతారా? "భోజచంపు" అనే నామాంతరం కల రామాయణ చంపును కాళిదాసున్నూ భోజుఁడున్నూ కలిసి రచించినట్లు వక పుక్కిటి పురాణం వినఁబడుతుంది. ఆ పురాణంలో కాళిదాసుని వేశ్య ధనాశచేత

కత్తిపీటతో మెడకోసి చంపినట్టున్నూ, పిమ్మట భోజుఁడు తనఆయుర్దా యంలో సగం కాళిదాసుకి యిచ్చి బ్రతికించినట్లున్నూ, ఆసమయానికి యిద్దఱికీ శేషించిన ఆయువు స్వల్పమాత్రమే అయినట్లున్నూ ఆస్వల్పా యుర్దాయాన్ని యీ రామాయణ చంపూరచనక్రింద వుమ్మడిగా యిద్ద ఱున్నూ వినియోగించినట్లున్నూ, యుద్ధకాండ తరవాయిగా వుండఁగా వారిద్దఱున్నూ కీర్తిశేషులైనట్టున్నూ, అందుకే ఆభాగం యితరులు పూరిం చవలసివచ్చినట్లున్నూ చెప్పుకుంటూరు. కాని పూరించినకవి యీ సంద ర్భాన్ని లేశమున్నూ వ్రాయకపోవడంచేత యీకథ బొత్తిగా విశ్వాస్యం కాదు. వకరి ఆయుర్దాయాన్ని వకరికివ్వడాలు పురాణాలలో లేక పోలేదు గాని భోజకాళిదాసులు పురాణ పురుషులలో చేరరుగదా ?

యితర పుక్కిటిపురాణాలను ఖండించి నిజం తేల్చడంకన్న, శబ్దా లకు సంబంధించిన పుక్కిటిపురాణాలను ఖండించి నిజం తేల్చడం చాలా తేలిక. యెందుచేతం టే, శాస్త్రాధారం వుంటుందికదా? అమవస, అమాస, అమావాసి, యీ మూఁడున్నూ అమావాస్య శబ్దానికి వికృతులని నైఘంటి కులు సమ్మతించడానిక్కారణం మహాకవిప్రయోగాలే కదా ? అట్టి నిర్దుష్ట శబ్దాన్ని రామలింగం వెక్కిరిస్తాఁడా ? యింకా "యింతలు కన్నులుండఁ దెఱువెవ్వరి వేఁడెదు భూసురేంద్ర" అన్నస్థలంలో "ఇంతలా ? తాతా ?" అని స్వల్పత్వద్యోతకంగా అభినయించినట్టున్నూ దానిమీఁద పెద్దన్నగారు విపులత్వద్యోతకంగా హస్తనిర్దేశం చేసి— "కాదోయి మనమఁడా ? యింతలోయి" అని వకచెంపకాయ బహుమతీ చేసినట్టున్నూ చెప్పుకొనే కథ నిజమో అబద్ధమోకాని, హృదయంగమముగానున్నూ విశ్వాస్యంగా నున్నూ వుంది. యిదేమిటి పనికిమాలిన కల్పన, రామలింగం "అమవస" తప్పని వెక్కిరిస్తాఁడా ?

కొందఱు తప్పుకానిదాన్ని అనవసరంగా తప్పని తప్పుతోవలు త్రొక్కడం లేకపోలేదు. వుదాహరణకి వకటి చూపుతాను:— వసుచరి త్రలో— "చ. కొమిరె మనోవ్యథం దెలిసి గుబ్బిచ్చికవుంగిటఁజేర్చి తల్లి శుక్తిమతి" అన్నచోట తల్లియైన శుక్తిమతి కూఁతురుయొక్క మనోవ్యాకు

లత్వాన్ని తెలిసికొని అనే అర్థం వ్యాఖ్యాత రాస్తే, అక్కడ- కొమిరె అంటే కూఁతురు కాదు, వ్యాఖ్యాత పొరఁబడ్డాడు, అని కొందఱు వాదిస్తూ, యౌవనవతియొక్క మనోవ్యథ అని అర్థం చెప్పాలంటారు. యింతకన్న దురన్వాయం వుంటుందా? పోనీయండి గణంచెడితే చెడింది గాని అక్కడ "కుమారి" అని తత్సమపదంగాని, "కుమార్త" అని వికృతిపదంగాని వుందనుకుందాం. అప్పుడు కూడా యౌవనవతి అని అర్థమే చెప్పుదురోటుః అందాఁకా యెందుకు? యెవరేనా, "మీకుమార్తపెండ్లెప్పుడుః" అని శారదాబిల్లుకు వ్యతిరేకించే పెండ్లికూఁతురునుగూర్చి అడుగుతారనుకుందాం. అప్పుడు చవగండాలు దీరని ఆపసిపిల్లనుకూడా యౌవనవతిగానే అపల పించవలసిందేనా? కుమార శబ్దమునకు స్త్రీత్వబోధకమైన యీకారప్రత్యయం చేరితే— "కుమారీ" అనేరూపం ఏర్పడింది. దాని తద్భవరూపాలు కొమిరె, కొమార్త, కొమారిత, క్రొమరిత, కొమారి, లోనైనవి. యిందులో మొదటిదిన్నీ చివరిదిన్నీ కుమారీశబ్దానికి మఱీదగ్గరగా వుంటాయి. కొమారి అనేదానికి కూఁతురు అనే నిఘంటు కర్త వ్రాశాడు. కొమిరె పదానికి వ్రాయలేదు. అంతమాత్రంచేత, అది యేశబ్దాన్నుంచి పుట్టిందో, ఆశబ్దానికి సంస్కృతంలో వున్న అర్థాలెట్టివో ఆలోచించుకోవద్దా? పాపం నిరపరాధి వసుచరిత్ర వ్యాఖ్యాతనుతూలనాడ వలసిందేనా?

దీనిమాదిరిని అమావాస్యా శబ్దానికివున్న అర్థం "అమవసకు" రాదని మాత్రం ఆ పద్యం "ఎమిదిని నెపితివి" అనేది చెప్పినమహాను భావుఁడు అనలేదు. అందుకు సంతోషించవలసివుంటుంది. శబ్దతత్త్వం తెలుసుకోవడం చాలాకష్టం. బాగా ఆలోచించిచూస్తే ఆ యీ శబ్దాలుచదువుకొని దానితత్త్వం తెలిసికొని కవిత్వం చెప్పడం కంటె, యేమీ చదువుకోకుండానే లోకవ్యవహారపు మాటలతో కవిత్వం చెప్పడమే మెఱుఁగనుకుంటాను. యేమంటారా? గ్రాంధికభాషాకవికి వున్నబాధ యీకవికి వుండదు. "ప్రత్యక్ష మేకం ప్రమాణమితి చార్వాకాః" అన్నట్లు అన్నిటికి లోకమే ప్రమాణంగా వుంటుంది. గ్రాంధికకవిత్వమయితేనో? ప్రయోగాలు వెతకవలసివస్తుంది. వెతికియిస్తే అవి లేఖకప్రమాదాలంటూ ఫక

వాదం. కావు సరియైనవే అంటూ సమర్థించడానికి తలప్రాణం తోఁకకు వస్తుంది. కొంచటికి వాదమే ప్రధానంగాని సత్యాసత్యవిషయంలో బొత్తిగా పట్టింపే వుండదు. అందుచేతే కాఁబోలును భవభూతి "వాచాం సాధుత్వే దుర్జనో జనః" అని అన్నాఁడు. అంతతో కూడా తృప్తితీరక— "అతిదుర్జన ఇతి వక్తవ్యం" అని ఆసూత్రం క్రింద వార్తికాన్ని కూడా తగిలిపించాఁడు. భవభూతి తాత్పర్యాన్ని బట్టి సుశబ్దాలను అపశబ్దాలనే వారు—"అతిదుర్జను లని" వున్నప్పటికీ దీన్ని యెఱిఁగి తప్పనే వారికే సమన్వయించుకోవడం యుక్తంగాని యెఱక్క తప్పనేవారినిగూర్చి సమన్వయించకూడదు. వారి కంతేజ్ఞానం భగంవతుఁడనుగ్రహించాఁడనుకోవాలి.

జ్ఞానాతిశయం కలవారు కూడా వొకప్పుడు ప్రమాదపడి ఒప్పును తప్పనడం కనపడుతూవుంది. పండితరాయలు అంటే యెఱుఁగనివారే లేరుకదా? "శ్లో. ఆమూలాద్రత్నసానోః.... వాచా మాచార్యతాయాఃపద మనుభవితుంకోఽస్తి ధన్యో మదన్యః" అని గర్జించినకవితావీరుఁడు. యీయన ఢిల్లీపాదుషా కూఁతురిని పెండ్లాడినట్లు చెపుతారు. కూఁతురు కాకపోవచ్చునేమో కాని తురుష్కకులస్థురాలుమాత్రం కాకపోదు. "యవనీ నవనీతకోమలాంగీ" వగయిరాశ్లోకాలు సాక్ష్యమిస్తాయి. ఆయనభార్య యవనస్త్రీమాత్రమే కాదు. ఆయన యౌవనదశ యావత్తున్నూ తురుష్క ప్రభువుదగ్గిఱే గడిచింది. "శ్లో. ఢిల్లీవల్లభహస్తపల్లవతలే నీతం నవీనం వయః" అని రాయలే వ్రాసుకున్నాఁడు. చెప్పొచ్చేమాటేమిటంటే యీయ నకి తుట్టతుదరోజుల్లో పశ్చాత్తాపం కలిగి, పోఁగొట్టుకున్న బ్రాహ్మణత్వాన్ని సంపాదించుకోవాలని ప్రయత్నం చేశాఁడు. అప్పుడు అప్పయ్యదీక్షితులు గారు కాశీవాసం చేస్తూవున్నారు. భట్టోజీదీక్షితులుగారు అసలు కాశీవాసులే. వీరిద్దఱున్నూ విచారణచేసి— "నీకు బ్రాహ్మణత్వం యిఁక యీజన్మానికి తటస్థింపదు" అని ఖండితంగా చెప్పేటప్పటికి వారిద్దఱిమీఁదా పండితరాయ లకు పట్టరాని కోపం వచ్చి భట్టోజీదీక్షితుల వ్యాకరణగ్రంథం మనోరమ మీఁద — "మనోరమా కుచమర్దనం" అనేపేరుతో ఖండన వ్రాసిన ట్టున్నూ, అప్పయ్యదీక్షితులవారి అలంకారశాస్త్రగ్రంథంమీఁద యేదోవక

గ్రంథము వ్రాసినట్లున్నూ శిష్టపరంపరవల్ల విన్నాను. "మనోరమాకుచ మర్దనం" అక్కడక్కడ వున్నట్టుకూడా వినడం కలదు. చెప్పవచ్చే మాటేమిటంటే అంతటి మహాపండితుఁడు పండితరాయలు అప్పయ్యదీక్షితుల గ్రంథాన్ని ఆక్షేపించడంలో — పురతః అనేప్రయోగాన్ని అపశబ్దంగా నిర్వచిస్తూ, అంతతో వూరుకోక— "కాళిదాసభవభూత్యాది ప్రయోగాణా మభావాచ్చ" అంటూ కూడా వకవాక్యాన్ని వ్రాసివున్నాడు. ఈమాట వున్నగ్రంథం "రసగంగాధర" మనేదానికి శేఖరగ్రంథకర్త మహావైయాకరణ శిరోమణి నాగేశోపాధ్యాయులు వ్యాఖ్యానంవ్రాస్తూ, పండితరాయల మాటలను అనువదించి సమన్వయించి— వస్తుతస్తు అనిప్రారంభించి, ఆపదంయొక్క సాధుత్వాన్ని నిర్వచించి కాళిదాస ప్రయోగాన్నికూడా కనపఱిచినట్లు జ్ఞాపకం. కేవలమున్నూ కోపమే ప్రధానంగాఁ బెట్టుకొని పండితరాయలు అప్పయ్యదీక్షితుల వారిని దూషించే తాత్పర్యంతో వ్రాయడంచేత సుప్రయోగాలు కూడా అపప్రయోగాలనడం తటస్థించింది. కాని లేకపోతే అట్టి ప్రమాదం కలగదేమో అని నేననుకుంటాను. అటుకృతం యెంతకోపం వున్నా విమర్శనకు వుపక్రమించేటప్పటికి దాన్ని తగ్గించుకోవడం విమర్శకులమర్యాదను కాపాడుకోవడానికి ముఖ్యసాధనం. పండితరాయలకు కోపం రావడానికి కారణం వ్రాసేవున్నాను. పాపం. అతణ్ణి బ్రాహ్మణజాతిలోన్నుంచి బహిష్కరించడం కంటె యేఁకావాలి? మనకు ప్రస్తుత మేమిటంటే; ప్రతిప్రాణికిన్నీ కోపం సహజగుణమైనప్పటికి విద్యావివాదములలో దాన్ని తగ్గించుకొనిన వారికి పరాభవము రాదనిన్నీ అన్యథాగానైతే పరాభవం తప్పదనిన్నీ తెలిసికోవాలి. ఎంత పాండిత్యం కలవారికేనా కోపం ప్రమాదాన్ని కల్గించి ఒప్పులను తప్పులనిపించేటప్పుడు, అసలులో కొంత లోటుంటే వేఱే చెప్పనే అక్కరలేదని వ్రాయనక్కఱలేదు. పండితరాయల విషయం కన్న యెక్కువ వుదాహరణం కోపానికి చూపవలసివుండదు.

పెద్దన్నగారి "అమవసనిసి" మీఁద ఆయీ విషయాంతరాలు దీనిలో నడిచాయి. మహాపఁడితులకు కూడా అప్పుడప్పుడు శాస్త్రీయమైన ప్రమా

దాలు తటస్థించడం కలదు కాని వారు మార్గాంతరం తొక్కి సమర్థిస్తూ వుంటారు. దీన్నిగూర్చి మా గురువుగారు బ్రిహ్మయ్యశాస్త్రిలవారివల్ల విన్నదే వక సంగతి వ్రాస్తాను. అనంతశయనం మహారాజావారు కాశీకి విచ్చేసినప్పుడు వారు చేయించిన విద్వత్సభలో యెవరో మహాపండితుఁడు శ్రీ రాజావారిని సంబోధించి మాట్లాడే సందర్భంలో— "మహారాజన్" అని సంబోధించేటప్పటికి సభంతా పండితమయమై వుండడంచేత ఆశబ్దాన్ని గూర్చి వకరిమొఖాలు వకరు చూచుకోవడానికి మొదలుపెట్టేరఁట. అంతకు పూర్వమే అసలు పండితుఁడికి ప్రిమాదం గోచరించింది. ఇదియేమంత పెద్దవిషయం కాదు. కర్మధారయ సమాసంలో రాజన్ శబ్దం అకారాంత మవుతుందని సర్వసామాన్యంగా తెలిసేదే. అట్టి స్వల్పవిషయం పెద్ద పండితుఁడి నోటరావడంచేత చట్టన తప్పనలేక వకరి మొఖాలు వకరు చూచుకోవలసి వచ్చిందఁట. అప్పుడాపండితుఁడు ఆశబ్దానికి విశేషార్థం చెప్పి ఆపండితుల సంశయాన్ని తీర్చినట్లు గురువుగారు చెప్పఁగా విన్నాను. మహారాజ శబ్దం కర్మధారయసమాసంగా వుంటేకద మీరనుకొన్నట్లు అకారాంతం కావడం. ప్రిస్తుతం నాఉద్దేశంలో అది బహువ్రీహి కాని కర్మధారయ కానేకాదు. కర్మధారయలో "గొప్పరాజు" అని మాత్రిమే వస్తుంది అర్థం. బహువ్రీహిలోనో! మహచ్ఛబ్దవాచ్యుఁడు, అనఁగా "అణోరణీయాన్ మహతో మహీయాన్" అనే శ్రుతినిబట్టి సర్వమహత్తరుఁడు పరమాత్మ కనుక అతఁడు ప్రిభువుగా కలవాఁడా, అనఁగా రాజులలో నీకన్న నెవ్వఁడును అధికుఁడు లేఁడనే విశేషార్థం వచ్చిందన్నమాట. ఇట్లాటి సందర్భాలు వింటూవుంటే మహాపండితుల ప్రిమాదాలు కూడా కొంత వన్నెనే కలిగిస్తాయనే అంశం తేటతెల్లమవుతుంది. వారు చెప్పిన అర్థానికి పండితులున్నూ మహారాజావారున్నూ సంతోషించి ప్రిశంసించారఁట. ఇది విషయాంతరం.

తప్పొప్పులు భాషావిషయంలో విచారించేవారు క్రిమంగా సన్నగించారు. యీ చర్చ యెందుకూ కొఱగాదనేవారే పలువురు కనపడతారు. ఇది అట్టి చర్చే అయితే అన్నిగ్రింథాలు దీన్నిగుఱించి యెందుకు పుడ

తాయో? నిన్న మొన్న ఆంధ్ర యూనివర్శిటీవారు చిత్రిపత్రిక అనే వక మహాగ్రంథాన్ని ముద్రింపించారు. ఆగ్రంథం సుప్రసిద్ధ మహావైయాకరణులు శ్రీభాగవతుల హరిశాస్త్రుల్లుగారు రచించిన కౌముదీ వ్యాఖ్యాన వ్యాఖ్యానమవడంచేత వర్గత్రియందాఁకా దేకింది. అసలు వ్యాకరణం చదువుకొన్నవాఁడి కవిత్వమే— "భాగోతప్పద్యాలు, బొమ్మలాటపద్యాలు, పొఁగటివేష ప్పద్యాలు" గానున్నా వుంటుందనే యీ కాలంలో ఆలాటి గ్రంథాలవల్ల ప్రయోజన మేముంటుందో? యూనివర్శిటీవారు యీమాత్రం పరిశీలించనే లేకపోయా రనుకోవలెనా? యేమనుకోవడానికిన్నీ అవకాశం కనపడదు. యేదో డబ్బోయేగాణో చేతులో పడేవాదాలయితే యెన్నైనా చేయడానికి చాలామంది అంగీకరిస్తారు. కాని, యీలాటి శబ్దార్థాలు గాని సుశబ్దాపశబ్దాలుగాని విచారించే దిక్కు కనపడదు. కవులకు మాత్రం యిది తప్పదు.

ఇప్పుడు మనకు "అమవస" అపశబ్దమో సుశబ్దమో తేలింది కదా? వొక్కొక్కదాన్నిగూర్చి వ్రాయవలసివస్తే యీలాగే కట్టకట్టలుగా పెరుఁగుతుంది చూడండి—"ఈపాటికి కట్టిపెట్టు నీప్రసంగం" అంటూ తఱచుగా జనులు వాడుతూ వుంటారు. యీశబ్దాన్నిగుఱించి విచారణ చేస్తే యెంతచేయాలో ఆలోచించండి. ప్రసంగం నోటితో చేసేదిగదా. కట్టడం తాడుకూ, తంకరకూ సంబంధించింది. అట్టి సందర్భంలో యేలా కుదురుతుఁది? ఔపచారికంకాక తప్పదు. భాషాప్రపంచకంలో నూటికి తొంభై మాటలు యీలాటివే కనపడతాయి. యిది బహుశః తాటాకు పుస్తకాలు వాడుకొనే రోజుల్లోదేమోఅని నేననుకుంటాను. పండితులు శిష్యులను చదువు ముగింపు మనిచెప్పడానికి యీలా వాడేవారేమో, ఆమాట క్రమంగా యితరాన్నికూడా ఆపుచేసే విషయంలో వాడుతున్నారేమో, కాగితప్పుస్తకానికి కట్టడమూ పెట్టడమూ వుండదుగాని తాటాకుపుస్తకమైతే భద్రంగాకట్టి జాగ్రత్తపెట్టడమవసరమే కదా? ఏదోస్థూలదృష్టిని వ్యవహారానుసరణంగా అర్థంచేనుకొనేవారికి యేచిక్కూ కనపడదుగాని శాస్త్రప్రకారం తెలుగుభాషలోకూడా క్రియాకారకాన్వయాలు కుదర్చవలసి

వస్తే నన్నయాదుల ప్రయోగాలలో యెన్నో కుదరవు. "నన్ను వివాహమై నహుషనందన!" యీవాక్యం దేవయాని యయాతినిగూర్చి పలికేది. అగుధాతువు యొక్క క్త్వార్థక రూపం కదా "ఐ" అనేది. దానిలో కర్త యయాతిమహారాజు. యయాతి యేమికావలెను? వివాహంకావలెను. యయాతి వివాహంగా యెన్నటికేనా మాఱతాడా? "తీర్థానికి తీర్థమూ, ప్రసాదానికి ప్రసాదమూ" గా వుందో, లేక యేలావుందో? అన్వయజ్ఞులు విచారించుకొందురుగాక. పైగా, నన్నున్ అనే ద్వితీయాంతానికిగతియేమిటి? "ఓ రాజా నీవు నన్ను పెండ్లియై" అన్నా సరిగా కుదరదు. రాజు యీ పెను పెండ్లి అవడమేమిటి? యివన్నీ కుశంకలు. యీ శంకలు తెలిసీతెలియని పండితులకు గోచరించేవి. యేమీ తెలియనివాళ్ళకు లేశమున్నూ పైస్థలంలో శంక కనపడదు. "నీవునన్ను భార్యగా స్వీకరించి" అనే అర్థమే అవుతుంది. వాళ్ళని యీ ద్వితీయాంతమూ బాధించదు, ఆ ప్రథమాంతమూ బాధించదు. అయితే నన్నయ్య శాస్త్రజ్ఞుఁడేకదా? యిట్టి "అనన్వయపు మాట నేల ప్రయోగించాఁడు?" అంటూ స్థూలదృష్టులు శంకిస్తే శంకిస్తారు. నిజానికి యిది అనన్వయపుమాట కాదు. కానేకాదు. ఆ అనన్వయం మనలోపంవల్ల కలుగుతూవుంది. లోకంలో వాళ్ళకు సర్వసామాన్యులకు సుళువుగా అర్థంకావడమేమి? యే మిడిమిడిజ్ఞానాన్నో సంపాదించుకొన్న మనకు సమన్వయంకాకపోవడమేమి? అనేవిషయం యిక్కడ బాగా గమనించవలసి వుఁటుంది.

నన్నయ్యగారు "లోకజ్ఞులు" అనేవిషయం తెలిస్తే పైశంకకు లేశమున్నూ, అవకాశం వుండదు. లోకంవల్ల సమన్వయించుకోతగ్గమాటలే కవిత్వాలలో, అందులో విశేషించి భాషాకావ్యాలలో వుంటాయి. గీర్వాణ భాషాకావ్యాలలో కూడా కొన్ని వుంటాయి గాని యింతగా వుండవు. యేక దేశాన్వయాలు వగైరా కొన్ని విషయాలకు గీర్వాణానికిన్నీ దీనికిన్నీ పూర్తిగా పోలికవుంటుంది— "అంతకకోపులైన యద్దేవపతాకినీపతుల దివ్యనిశాతమహాయుధాహతిన్" యిక్కడ "అంతకకోపులు" అన్న విశేషణం, "పతాకినీపతుల" అనే సాధ్యసమాసైక దేశంలో అన్వయించాలి. పైఁగా, యీ "పతుల" అనే పదం మళ్ళా ఆయుధాలలో అన్వయిం

చాలి. యిట్టి వింకను మఱికొన్ని కలవు. భారత విశేషాలలోఁ గొన్ని వివరించితిమి. "అడరుకురుప్రవీరుల వరాన్వయసంభవున్" అనేది దీని వలెనే సమన్వయించుకోవాలి. శంకించేవారు ఆయీ సందర్భాలు గమనించాలి. సంస్కృతము ననుసరించేవికొన్నీ తెలుఁగులో వ్యవహారా న్ననుసరించేవి కొన్నీ కాక దేన్నీ అనుసరించకుండా వున్నట్లుండేవి కొన్ని వుంటాయి. అందొకటి మచ్చుకు చూపుతాను— "తేఁజనేనిని బలు శోకవేగమున" యిందులో వుండే "ఏనిని" ప్రాసస్థానంలో వుండడంచేత దిద్దడానికి అంకదనుకుంటే వకరు నాపేర వ్రాశారు కదా ? ప్రామాణ్యజ్ఞానం అంటూ వకటి వుండాలిగాని లేకపోతే దీన్నిమాత్రం— "తేఁజనేని నిబిడ శోకవేగమున" అని దిద్దకూడదా ? అన్నారు. అప్పుడు మళ్ళా వెదికితే తిక్కన్నగారిదే— "ప్రళయమొందెనయేనిని వారని యుద్యోగంబునకు ఫలంబేమి" అనేది శల్యపర్వంలో కనపడింది. యెందుకు కనపడ దంటాను. అదేమైనా తప్పుగనకనా ? నిక్షేపంవంటి ప్రయోగమాయె. ఎన్, ఏని, ఏనిన్, ఏనిని, ఇన్నిరూపాలున్నూ సాధువులే. హరిన్ : హరిని, హరినిన్, హరినిని అనేరూపాలు లేవా ? నన్నయ్యగారివి కూడా దొరుకుతాయి కాని అవి చట్టన దిద్దితే మాఱిపోయేస్థలాల్లో వున్నాయి. పుట్టుపూర్వోత్తరాలు తెలిస్తేకాని వీనిసాధుత్వం తెలియడం కష్టం. నన్నయ్యగారు త్రొక్కిన త్రోవను వదలకుండా తిక్కనాదులు నడుస్తూ కొన్ని క్రొత్త పోకళ్ళు కనపఱచినట్లు వారివారి కవిత్వాలు పరిశీలించేవారికి స్పష్టపడుతుంది. యిది అలాటిదికాదు. అయితే నూటికో కోటికో వకరుంటారేమో ప్రయోగాలకోసం భారతం చదివేవారు. తక్కినయావన్మందిన్నీ కథకోసమే భారతం చదువుతారు. అలాటివారికి ప్రయోగాలతో అవసరమేముంటుంది ? "ఉ. అమ్మనుజేంద్రుఁడైన నలుయజ్ఞము ధర్మజురాజసూయయజ్ఞమ్ము ప్రయాగఁజేసిన ప్రజాపతియజ్ఞము" అనే పద్యంలో ప్రయాగ శబ్దాన్ని మువర్ణకంలేకుండా నన్నయ్యగారు ప్రయోగించా రనేరహస్యం పరిశీలకులైన "కైతగాళ్ళ"కు తప్ప తదితరులకు గోచరించదు. గోచరించిన పింగళి సూరన్న "గయలోఁ గాశిఁ ప్రయాగన్" అనే ప్రయో

గించు కొన్నాఁడు. "ఏనిని" అనేదాన్ని గుఱించి యిటీవలి భారతసంస్కర్తలు యింకో విశేషాన్ని టిప్పణిలో వ్రాశారు. ఆవిశేష మిది: "నేని" అని, "ఏని" కిరూపాంతరము. యీరూపాంతరాన్ని వప్పుకోవడంవల్ల కలిగిన లాభమేమిటంటే; "మదీయభాషణ మెన్నఁడున్నేని మోఘము గాదు" అనేచోట "లుక్సంశ్లేషౌ నాఽచి" అనేసూత్రమునకు వ్యతిరేకం లేకుండా సవరణ అవుతుంది. కాని అప్పకవినాఁటికి యీరూపాంతర సత్తను లాక్షణికులు గ్రహించినట్లు లేదనుకోవలసి వస్తుంది. గ్రహించి నట్టే అయితే— "ఏని" అనేదానిలో వుండే "ఏ" అనేది "నే" గా మాఱినప్పుడు నకారానికి విశ్రమం పెట్టవచ్చునంటూ లక్షణం కల్పించి ఉభయయతులలో చేర్చవలసి వుండదు. ఆరంభప్రత్యాఖ్యానాల్లో సమఫలం కనపడుతూ వుంది కనక అప్పకవికృతలక్షణం ఖండింపఁ బడ్డప్పంటికీ యిప్పటివారి వూహ తోసివేయనక్కఱలేదు.

ప్రస్తుతవాదం "ఏనిని" అనేది వుండ దనేదానికి, "నేని" అనే రూపాంతర సత్త బాధకంగాని సాధకంగానికాదు. ప్రౌఢవ్యాకరణకర్తకూడా యీ రూపద్వయసత్తాను అంగీకరించ లేదు. మొత్తం తెలుగుశబ్దాలలో యెన్నోయిట్టివికల్పాలు అనాదిగా వుంటూవున్నాయి. ఏగు ధాతువులో అఱ సున్న వున్నట్లు ప్రాచీనప్రతులలో కనపడుతుంది. యిటీవల వారు అది లేకుండానే ఆధాతువును వాడుతూవున్నారు. దీని కేవ్యాకరణమున్నూ సాధకంగాని బాధకంగాని అయ్యేది లేదు. రావుశబ్దం పరమైనప్పుడు వికల్పంగా రెండక్షరాలు మాత్రమే వున్నపూర్వపదానికి అకారాంతానికి దీర్ఘం సుబ్బారావు వగైరాలలో కనపడుతూ వుంది. రావుశబ్దం రాజశబ్దాన్నుంచి పుట్టినట్లే అనేకాధారాలు కనపడతాయి. ఆశబ్దానికే రాజుశబ్దం పరంగా వుంటే దీర్ఘం కనపడదు. సుబ్బరాజు, రామరాజు వగయిరాలు దీని కుదాహరణాలు. ఆయీ ప్రయోగాల కన్నిటికీ వ్యవహారమే ఆధారం గాని యితరాధారం కనపడదు.

దేవతా వాచకమైన గీర్వాణశబ్దానికి మువర్ణకాన్ని చేర్చి నంతలో అది భాషావాచక మవుతూవుంది. గీర్వాణ మంటే సంస్కృత భాష. ఇట్లే

మహారాష్ట్రము, ఆంధ్రము, ఆంగ్లము, లోనైనవి. ఇవి సంస్కృతశబ్దములే అయినను సంస్కృతంలో వీటి కీలాటిఅర్థం కనపడదు. ఆంగ్ల, అన్నది సంస్కృతపదం కాదంటారేమో? పోనీ దాన్ని వదలిపెట్టండి. తక్కినవాటివిషయమే ఆలోచించండి. ఆయీసందర్భంకూడా వ్యవహార బలీయస్త్వాన్ని పురస్కరించుకొన్నదే. తనమయము, మెదడుపోగ్రువుల మయము, లోనైన తెలుగుశబ్దాలకు సంస్కృతంలో వికారార్థమందున్నూ ప్రాచుర్యార్థమందున్నూ వచ్చే "మయట్ప్రత్యయం" చేయడం యేవ్యాకరణంచేత సాధింపఁబడుతుంది? అదిన్నీ వ్యవహారవ్యాకరణాన్ని పురస్కరించుకొన్నదే. కాఁబట్టి వ్యవహారంలో మాటలన్నీ గ్రామ్యాలనడం అనాలోచనపని. ప్రస్తుతం తప్పా కాదాఅని వాదించుకొనే "ఏనిని" అనేది వ్యవహారమున్నూకాదు, వ్యాకరణంచేత నిక్షేపంలాగు సాధించఁబడుతుంది. కవిబ్రహ్మగారిచే ప్రయోగింపఁ బడింది కూడాను. అందుచేత, స్వచ్ఛమైన "అమవసనిసి" పదాన్నితప్పనడం యెట్టిదో, దీన్నితప్పనడంకూడా అట్టిదే. నిఘంటులో అమావాస్యాశబ్దతద్భవ రూపాలకు దేనికిఁగాని ప్రయోగాలు యివ్వలేదు. అంతమాత్రంచేత ఆరూపాలకు ప్రయోగాలు లేవనుకోకూడదు. కొన్నిటికి అతిప్రసిద్ధాలనే హేతువుచేత కాఁబోలును నిఘంటుకర్త ప్రయోగాలు చూపలేదు. అన్నిటికీ ప్రాసస్థానంలోనున్నూ యతిస్థానంలోనున్నూ ప్రయోగాలుదొరకాలంటే దొరకనూ దొరకవు. అంతమాత్రంచేత అవి సుప్రయోగాలు కావనుకోఁగూడదు.

కోర్కెలు, అనేదానికి యిద్దఱు మహాకవులు యతిస్థానంలో వాడిన ప్రయోగాలు కనపడ్డప్పటికీ కొందఱు "పిడివాదానికి" వుపక్రమించడఁ మిక్కిలీ సాహసం. చూపఱులు, అనేదిపింగళిసూరన్నగారేకాక, సంకుసాలకవివరుఁడే కాక, తిక్కన్నగారుకూడా వాడినప్రయోగం వకటి కనపడింది

క. పెక్కండ్రు నొక్కపోరను
నుక్కఱభంజింతుఁ, జంపు టుడుగుదు, రాజుం
దక్కటిచూపఱు లెంతయు
వెక్కసపడఁ జిత్రగతుల విహరింతుఁ దగన్.

అయితే దీన్ని దిద్దివేస్తామంటారు. యీలాగే వెనక “అవల” అనేదానికి “అవుల” అనేరూపాంతరంలేదంటూ కొందఱు వాదించారు. కవులు వాడినవైతే వున్నాయి గాని అవన్నీ దిద్దడానికి వీలిచ్చేవే అవుతూ వచ్చాయి. అప్పుడు నర్సభూపాలీయంలో కాఁబోలును—“సురాద్రియౌల” అనేప్రయోగం దిద్దితే గణభంగం కలిగేది దొరికింది. “అవుల” అనే రూపం వుంటేనే “ఔల” అనేరూపం పుడుతుందిగాని లేకపోతే పుట్టదని వేఱే చెప్పనక్కఱలేదు. దానితో ఆవాదం ముగిసింది. పగుల్చు, మిగుల్చు, తగుల్చు, లోనైనవాట్లకు క్త్వార్థకంలో—పగుల్చి లోనైనరూపాలుండ వంటూ వకవాదం వెనక కాలంలో వచ్చింది— దానికి శంభుదాసుని ప్రయోగం “కుంభపీఠము పగుల్చి” అని యతిస్థానంలో దొరికింది. దానితో ఆవాదం ఆఁగింది. అప్పకవిలోనైనవారు చాలాగ్రంథాలు శోధించి కవుల కెంతవఱకు సాయపడాలో అంతవఱకున్నూ పడి పుణ్యం కట్టుకున్నారు కాని యింకా విశేషాలు యెన్నో యితరగ్రంథాలమాటల్లా వుంచి భారతంలోనే కనపడతాయి అని నేను అనుభవపూర్వకంగా తెలుసుకున్నాను. చాలావఱకు భారతంలో కృషిచేసి, యెవరో నిమిత్తమాత్రంగా ఆక్షేపకులంటూ బయలుదేఱితే ఆమిషమ్మీఁద నా అనుభవాన్ని ప్రకటించడం కూడాజరిగింది. దేవీభాగవత పీఠికలో—

ఉ. అప్పకవీంద్రుఁడున్ మఱియు నంతకుఁ బూర్వులు నవ్యులుం గృతుల్
సెప్పిరి భారతంబున విశేషములం దిలకించి వారిక
న్గప్పి విశేషముల్ శతము గన్పడు చున్నవి భారతమ్మునం
దిప్పటికిన్, సముద్రమున కెవ్వఁడు పారము నిర్ణయించెడిన్.

అని అనుభవంమీఁదే వ్రాయడం తటస్థించింది. ఆ యీసందర్భాలు యెన్నో అనుభవపూర్వకంగా అంతో యింతో తెలిసికొంటినిగాని నాకీ డెబ్బయ్యోపడిలో నొక ఆశ్చర్యకరమైనవిషయం భాషావిషయంలో తటస్థించింది. అది భాష పుట్టింది మొదలు యెవ్వరికిఁగాని తటస్థించి వుండదని ముమ్మాటికీ చెప్పఁగలను. అది యేమిటంటే: వ్రాస్తేకూడా విశ్వాసా

ర్థ్యంగా వుండదు. అపజయం పొందడం, పొందికూడా, జయం కలిగినట్లే కాక యింకా కలుగుతుందని సంతోషించినట్లు ప్రకటించుకోవడం. యథార్థము వారిఆత్మకేనా గోచరమవుతూవుందో, లేదో అని యెన్నోమాట్లు అనుకుంటాను. కాని, నిజంతెలియదు. ఆలాటిశక్తి యేం చదువుకుంటే కలుగుతుందోకూడా బోధపడడంలేదు. అన్ని విద్యలకన్న ఆవిద్యమాత్రం యెక్కువదిగా తోస్తుంది. ఆవిద్య పూర్తిగా పట్టుపడితే వకలోకంకాదు పద్నాల్గులోకాలు జయింపవచ్చునుగాని ఆవిద్య పట్టుబడడ మనేదే దుర్ఘటం. నిజంగా అది వక తపస్సువంటిది—

శ్లో. యద్దుష్కరం యద్దురాపం యద్దుర్గం యచ్చ దుస్తరం
తత్సర్వం తపసా ప్రాప్యం తపోహి దురతిక్రమమ్.

అన్నదానితాత్పర్యం యిప్పటికి నాకు పూర్తిగా బోధపడింది. యీ తపస్సులో కృతార్థులైనవారు పూర్వకాల మందున్నట్లు సాక్ష్యం లేదు. వున్నట్టయితే శ్రీహర్షుడి తండ్రి శ్రీహీరుడు తనపరాభవాన్ని వొప్పుకొని తన స్యాలకునిపాదుకలు తన దేవతార్చనస్థానంలో పెట్టుకొని వుంటాడా ? యీ కథ చాలామంది యెరిగేవుంటారు కాని చదువరుల వినోదంకోసం కొంచెం వ్రాస్తాను. సంస్కృతంలో— "నైషధం విద్వదౌషధమ్" అని పండితులందఱూ యేకవాక్యతగా మెచ్చుకొనే నైషధాన్ని రచించినమహాకవి శ్రీహర్షుడు. ఇతనితల్లి మామల్లదేవి అనిన్నీ తండ్రి శ్రీహీరుడనిన్నీ, యితడు చింతామణి మంత్రోపాసకుఁ డనిన్నీ యితడు నైషధంలోనే—

"శ్లో. శ్రీహర్షఁకవిరాజరాజమకుటాలంకార హీరస్సుతం
శ్రీహీరస్సుషువే జితేంద్రియచయం మామల్ల దేవీచయం
తచ్చింతామణి మంత్రిచింతనఫలే కావ్యే మహానైషధే"

అని వ్రాయడంవల్ల తెలుస్తుంది. శ్రీహర్షుడి తండ్రికిన్నీ మేనమామకున్నూ విద్యావాదం తటస్థించింది. రాజ్యవిషయంలో బాంధవ్యం గీంధవ్యం యేలా చూడకుండా ప్రవర్తిస్తారో రాజులు, పండితులు విద్యా

వాదంలోకూడా అంతే అని వేతే వ్రాయనక్కరలేదు. యీవాదాలు యిప్ప టివారికి రుచించడం లేదు గాని పూర్వం బాగా రుచించేవన్నందు కెన్నో సాక్ష్యాలు చూపవచ్చును. ఆవాదంలో శ్రీహీరుఁడు వోడడం తటస్థించింది. వోడినవారు జయించినవారి పాదుకలు స్వయంగా నెత్తిని బెట్టి తెచ్చికొని దేవతార్చన పీఠం దగ్గఱవుంచి పూజించడం పందెం ఏర్పరచుకొని అసలు వాదంలోకి దిగి వుండడంచేత శ్రీహీరుఁడు సత్యానికి కట్టుబడి పాదు కలు తెచ్చుకొని పూజిస్తూ వున్నాఁడు. యిప్పడొక శిరోమణిగారు పం దెం కింద కొన్ని మృదువైన మాటలు వ్రాశారు. అవి యింకా పత్రిక కెక్కలేదు. యెంతో మృదువుగా వున్నాయి. అవి చూచితీరవలసిందే. అది అలావుంచుదాం. అప్పటికి శ్రీహర్షుఁడు పుట్టి వున్నాఁడో లేక గర్భ స్థుఁడుగా వున్నాఁడో తపిసీలుగా తెలియదు. మొత్తం శ్రీహర్షుఁడు స్తనం ధయుఁడుగా వున్న రోజుల్లో, కాలం తీరడం చేతనో లేక యీ పరాభవ దుఃఖము చేతనో శ్రీహీరుఁడు స్వర్గప్రయాణం చేయవలసి వచ్చింది. శ్రీహీరుఁడికి "ఆత్మావై పుత్రనామాసి" అని వుంది. కనక తన పరాభ వాన్ని తనకొడుకు ద్వారాగా తీర్చుకోవాలని మాత్రం మనస్సులో బోలెడు కుతూహలం వుంది. వుండి మాత్రం యేం చేస్తాఁడు. పాపం? కాలం తోసుకువచ్చింది. అప్పు డేమిచేశాఁడంటే: తనకు ఉపాస్యంగా వున్న "శవచింతామణీ మంత్రాన్ని" భార్యకు సక్రమంగా ఉపదేశించి యీ మం త్రం కుఱ్ఱవాఁడికి నీవు ఉపదేశించి మంత్రసిద్ధి తుద ముట్టిన తర్వాత నీ సోదరుణ్ణి నా కొడుకుచేత సభలో జయింపఁ జేసి మళ్ళా యీ పాదు కలు అతని వతనికి వప్పఁ జెప్పేటట్టు చేసేవఱకున్నూ నా ఆత్మకు శాంతి లేదన్నాఁడు. ఆ పతివ్రతాశిరోమణి భర్తమాటలు జ్ఞప్తి యుంచుకొని పాలిచ్చే సమయంలో నాలుగో మూడో అక్షరాల కంటె ఆ మంత్రం హెచ్చుగా వుండదు గనుక ఆకుర్రవాడిచేత పలికిస్తూ వుండేది. ఆ కుఱ్ఱ వాఁడికి, అమ్మా, తాత, అనే మాటలకంటె ముందుగా ఆ మంత్రాక్షరాలే క్షుణ్ణంగా నలిగి చిలకలాగ అస్తమానం అదే అంటూవుండేవాఁడు. కాని అంతలో ఆమంత్రం సిద్ధిస్తుందా? సిద్ధించదు. అది శవంమీఁద కూర్చుండి

జపం చేస్తేనే కాని సిద్ధించదట, అందుకే దానికాపేరు వచ్చింది. దీనికి ఆతల్లి వక వుపాయం చేసింది. పదునైనకత్తి దగ్గఱ పెట్టుకొని కుఱ్ఱవాఁడి చేత హేలగా ఆమాటలు అనిపిస్తుఅనిపిస్తూ, వెనకముఖంగా కడుపుమీఁద కుఱ్ఱవాణ్ణి కూర్చోపెట్టుకున్నట్టే కూర్చోపెట్టుకొని గొంతుకు తెగ్గోసికొంది. కుఱ్ఱాఁడు మంత్రపఠనం చేస్తూనే వున్నాఁడు. దేవత వెంటనే ప్రత్యక్షమయింది. అఖండమైన జ్ఞానం వక్కుఉమ్మాటు పుట్టి ఆపళ్ళాన్ని అమ పసనిసి, పున్నమనిసిగా మాఱిపోయినట్లయింది. తల్లి మరణం గోచరించింది. దేవతా ప్రసాదం చేతనే తల్లిని బ్రతికించాఁడు. ఆశ్చర్యమేమి? వెనక పరశురాముఁడు పితృప్రసాదంచేత తల్లిని బ్రతికించాఁడా లేదా? దీన్నిఁ బట్టి చూస్తే అప్పటికి శ్రీహర్షుఁడికి వయస్సు మూఁడేళ్ళకు లోపని తోస్తుంది. పిమ్మట అయిదో యేటో లేక యేఁడో యేటో వుపనయనం తరవాయి కాస్తా తీరింది. చ్యవనుఁడు వ్యాసుఁడు లోనైన మహాఋషుల వలెనే పుట్టుకతోనే సమస్తవిద్యలున్నూ వచ్చినట్లు మనం విశ్వసించడాని కభ్యంతరం లేదు. ఎందాఁకానో ఎందుకు నిన్నమొన్నసంగతి మాపరమ గురువులు బ్రహ్మయశాస్త్రిలుగారి సమకాలీనులు శ్రీబాలశాస్త్రుల్లుగారికి యేడేండ్లవయస్సు దాఁటకుండానే వేదం సమగ్రంగా వచ్చినట్లు చూచిన వారే చెపుతారు. లేదా, కథ క్కాళ్ళేమిటి? ముంతకు చెవులేమిటి? పర్యవసానం వినండి. ఆయేడేళ్ళవయస్సులోనే తల్లిగారి ప్రేరణచేత మేనమామను వాదానికి ఆహ్వానించాఁడు. జయించాఁడు "వాదిదౌర్బల్యమే కాని వాద దౌర్బల్యం వుండదు" కనక యేవిషయంలో తండ్రి వోడిపోయినాఁడో ఆవిషయంలోనే వాదించి తండ్రి వాదాన్ని నిల్వఁబెట్టి ఆయన పాదుకలు ఆయనకు ముట్టఁజెప్పి పితృఋణాన్ని పూర్తిగాతీర్చి, పరశురాముఁడో లేక "సి. ఆర్. దాసో" పొందిన ప్రతిష్ఠను పొందినాఁడు. మనకు కావలసింది ప్రస్తుతం యింతవఱకు మాత్రమే అయినా, తరవాయి కూడా రెండుమాటలలో కథ తేల్చేస్తాను. జయమైతే కలిగిందిగాని వాదం న్యాయంగా వుండని హేతువు చేతనున్ను అందులో ఆవాదం వేదార్థం చెప్పడానికి సంబంధించిం దగుటచేతనున్నూ శ్రీహర్షుఁడికి నోటమ్మట

పురుగులు రాలడాని కారంభ మయిందంట! దానితో తల్లిగారు విచారిస్తూ అన్నగారితో— "కుఱ్ఱాండి కేదో యీలాటిరోగం మొదలు పెట్టిందిరా" అని వెళ్ళి చెప్పుతూ దుఃఖించేటప్పటికి, "అవును వీండి కీకర్మం తటస్థిస్తుందని నేనప్పుడే అనుకున్నాను, వీండు మొన్న నాతో వాదించేటప్పుడు వేదానికి అపార్థం చెప్పడంవల్ల యీకర్మం తటస్థించింది. అయితే యేమిలే నివారణోపాయం కూడా వుంది —

"శ్లో. కర్కోటకస్య నాగస్య దమయంత్యా నలస్యచ
ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనం కలినాశనం"

అని మహాభారతంలో వుంది. కాంబట్టి నలచరిత్రను కావ్యంగా వ్రాస్తే యీదోషం శాంతిస్తుం" దని చెప్పి మేనల్లుణ్ణి కూడా "నాయనా! యీలా చేయవోయీ" అని శాసించాండు. మన శ్రీహర్షుండు గారు రచన కారంభించారు. ఆరంభించి కొంత రచించేటప్పటికి వైద్యం గుణమైతే యిచ్చిందిగానీ ఆరచనమాత్రం బ్రహ్మభేద్యంగా వుంది. లేశమున్నా దానిలో ప్రసాదగుణమన్న మాటే లేదు. అంతా శబ్ద చిత్రమయంగా వుంది. వచ్చిన అక్షరమే పదిసార్లు రావడం వచ్చిన పదమే పెక్కుసార్లు వచ్చినట్లు కనబడడం యీలావుంది. విడదీసుకుంటే భిన్నభిన్నపదాలుగా మాఱామాఱతాయి, చక్కని అర్థమూ వుంటుంది. అయితేమాత్రం ఆకవిత్వం యెవరికోకాని శ్రవణ పేయంగా వుంటుందా? యెన్నో నిఘంటులు దగ్గఱ పెట్టుకొని అన్వయించుకుంటే గాని అసలు తేలనే తేలదాయె. అలాటిది యేదో కావ్యానికి పదో అయిదో తన పాండిత్యం తెలుపుడు చేసుకోవడానికి చెపితే చెప్పొచ్చునేకాని అన్నీ అలాగే వుంటే ఆకవిత్వం యేంచేసుకొనేది. అప్పుడు మేనమామగారు మేనల్లుండి అప్రాథమిక కవిత్వానికి అసమ్మతిని తెల్పక "అబ్బాయీ! యింతకన్న తేలిక పాకంలో రచన వుండాలి" అనిచెప్పి దానికి వుపాయం కొంతబుద్ధికి తీవ్రత్వాన్ని తగ్గించవలసి వుంటుంది గనుక తోబుట్టువుతో "అమ్మాయీ! వీండికి ప్రతి రోజున్నూ మినప్పిండితో యిడ్డెనలుచేసి వాట్లను బచ్చలిపాదు క్రింద కూర్చుని తినేటట్లుచేయవలసిం" దన్నాండు. ఆమె అలాగేచేసింది. దానితో

ఆయనబుద్ధికి వుండే తీక్ష్ణత కొంత తగ్గి కాస్త తేలిక శైలిలోనికి కవిత్వం దిగింది. అలా వక అర్ధమండలం రోజులు గడిచాక మేనమామగారు క్షేమసమాచారం కనుక్కోవడానికి వచ్చి— అబ్బాయీ! యేంచేస్తూ వున్నావురా? అని అడిగేడఁట. దానికి శ్రీహర్షుఁడు — "శ్లో॥ అశేష శేముషీ మోషమాష మశ్నామి మాతుల!" అని జవాబు చెప్పాఁడఁట! యీమాటకి అర్థం. యావత్తు బుద్ధినీ అపహరించే మినప కుడుము తింటూ వున్నాను మామా! అన్నమాట. గురుపులు శిష్యులకు విద్యాభ్యాసం చేసేరోజులలో బ్రాహ్మణార్థాలకు వెళ్ళవద్దని నిషేధించడం యీ కారణంచేతనే అయి వుంటుంది. ఆధోరణి విని, మేనమామ పూర్వకంటె కొంత ధారలో కస దిగినట్టు తెలిసికొని, సరే! యీధోరణిలో వుంటే లోకానికి కొంతవఱకు వుపకరిస్తుం దని చెప్పేటప్పటికి శ్రీహర్షుఁడు పిమ్మట నైషధాన్ని సంపూర్తిచేసినట్లు వినడం. యీ యితిహాసంవల్ల మనం తెలుసుకోఁ దగ్గ ముఖ్యాంశం, పరాభవ మన్నది సాధారణ మైనదికాదనిన్నీ, అది ఆజన్మ మందుమాత్రమే కాక జన్మాంతరానికూ్కడా అనువర్తిస్తుందనిన్నీ. ఆయీ పరాభవాలు కొందఱు తీరికూర్చుని తెచ్చుకుంటారు. అది మఱీ బాధకంగా వుంటుంది. యితరులను వృధాగా ఆక్షేపించడం యీతరగతిలోకే చేరుతుంది. కాని, దానిలో కృతకృత్యత్వం కలిగితే చేరదు. తప్పుకాని దాన్ని తప్పనడంలో యీచిక్కు తటస్థిస్తుంది. అచిక్కు లోకాన్ని యెంత కట్టుకున్నా యెవరో వకరు న్యాయశీలురు వుండి బయటపెడతారు గాని పెట్టకమానరు.అందుచేత అట్లాటిపనులు పరాభవాసహిష్ణువులు చేయకూడదు.

పెద్దన్నగారి "అమవసనిసి" ప్రయోగాన్ని యెవరో లాకలూకాయ తరగతిమనిషి ఆక్షేపించివున్నాఁడేమో కాని రామలింగం కాదన్నది మనం ముఖ్యంగా గమనించాలి—

మ. ఉదయం బస్తనగంబు సేతువు హిమవ్యూహంబునుంజుట్టిరా
విదితంబైన మహిన్ మహాంధ్రకవితా విద్యా బలప్రౌఢి నీ
కెదురేరీ! సరసార్థబోధఘటనా హేలా పరిష్కార శా
రద నీరూపము రామకృష్ణకవిచంద్రా! సాంద్రకీర్తీశ్వరా!

"అ మ వ స ని సి య న్న మా ట"

అన్న పద్యార్థమునకు లక్ష్యభూతుఁడైన రామలింగకవి యేమిటి? "అమవసనిసి" తప్పని పెద్దన్నగారిని— "ఎమిదిని" అంటూ గేలిచేయడ మేమిటి? యీలాటివే మఱికొన్ని పుక్కిటిపురాణగాథలు మఱికొందఱికి సంబంధించి వున్నాయి. మఱొకప్పుడు మఱొకదాన్ని గుఱించి వ్రాస్తాను.

తెలుఁగుకవుల కందఱికీ భిక్ష పెట్టిన నన్నయ్యగారి కవిత్వంలో శిరోభూషణంగా సర్వజనాంగీకారాన్ని పొందిన వొకానొక పద్యాన్నిగూర్చి నాకు తోఁచినట్లు కొంచెం విమర్శించి మఱీ దీన్ని ముగిస్తాను—

ఉ. నిండుమనంబు నవ్యనవనీతసమానము పల్కు దారుణా
ఖండలశస్త్రతుల్యము జగన్నుత విప్రులయందు నిక్కమీ
రెండును రాజులందు విపరీతము కావున విప్రుఁడోపు నో
పం డతిశాంతుఁడయ్యు నరపాలుఁడు శాపమనుగ్రహింపఁగన్.

అందఱూ యీ పద్యాన్ని మహాపొగుడుతూ వుంటారు. యిది గొడ్లకాపరులకూడా తెలిసినశైలిలో వుండడమే ఆ పొగడ్తకు కారణ మనుకోవాలి. నా బుద్ధికి యీ పద్యంలో యెన్నో అనవసరపదాలు కనబడ తాయి. "ప్రథమ కబళే మక్షికాపాతః" అన్నట్లు ముందుగా మనస్సుకు "నిండు" అనే విశేషణం యెందుకంటాను. ఆ నన్నయ్యగారు యీపద్యంలో వాఁడిన అంశాన్ని వచనంలోనే వాడేయెడల యీ "నిండు" అనే విశే షణం వేయరనుకుంటాను. "నవనీత" అనేదానికి "నవ్య" అనే విశేష ణం కూడా ఆ మాదిరిదే. అప్పుడు క్రొత్తగా పెరుగు తఱచి తీసినవెన్న అనే అర్థం రావడాని కంటారా? ఇక్కడ కావలసింది మెత్తదనం గాని అన్యంకాదు. ఆమెత్తదనం మఱికొంతసేపటికి అంతరిస్తుందని యెవ్వరున్నూ అనఁజాలరు. అసలు ఆపదం యోగరూఢం. అంటే అవయవార్థం వుండి ఆపదార్థానికి రూఢిచేత బోధించేది. కాఁబట్టి "నవ్య" అనే విశేషణాంశం కూడ దానిలో "నవ" అనేదానిలో కొంత యిమిడి వుంది. యిక్కడికి రెండు పదాలు వృథాగా పడ్డట్టు తేలింది. యీ పైని ఆఖండలశస్త్రానికి "దారుణ" అనే విశేషణం కూడా వ్యర్థమనియ్యేవే నాకు తోస్తుంది.

అయితే ఆ వజ్రాయుధం చాలా ఘోరమైనదని తెల్పడానికి అది ఆవశ్యక మంటారేమో! అప్పుడు దారుణంగాని వజ్రాయుధం యింకొకటి వుండ వలసివస్తుంది. శాస్త్రజ్ఞులేమన్నారు? "సంభవవ్యభిచారాభ్యాం స్యా ద్విశేషణ మర్థవత్" అన్నారు. యిక్కడ సర్వదా దారుణత్వం సంభవించడమే కాని వ్యభిచరించడం అనఁగా అతిక్రమించడం లేనేలేదు. కాఁబట్టి యిదిన్నీ వ్యర్థమే. అదిన్నీకాక "పలుకు" అనే రెండక్షరాల మాటకు సుమారు పదకొండక్షరాలమాటతో వర్ణించడం యెందుకంటాను. పైఁగా "జగన్నుత" అంటూ వక సంబోధన పదం యతికోసం పడ్డట్టు వప్పుకోకతప్పదు. యిదిన్నీకాక వజ్రాయుధానికి స్వల్పాక్షరాలుగల "పవి" అనే పర్యాయ పదం వుండఁగా అంతపదంవాడి స్వర్గంలో వున్న ఆఖండలుణ్ణి భూలోకానికి తీసుకురావడ మెందుకంటాను? యిదిన్నీ కాక, శస్త్రములు, అస్త్రములు, అనేవి ధనుస్సు ద్వారాగా శత్రువులమీఁదకు పంపబడేవి. వజ్రాయుధాన్ని ధనుస్సహాయంవల్ల ప్రయోగించ నక్కరలేదు. కాఁబట్టి దాని విషయంలో శస్త్రపదం వాడడం కూడా అనాలోచితమే అంటాను. పైఁగా "విప్రులయందు" అనడంకన్న యిది తెలుఁగుకవిత్వంగనక "బాపలయందు" అనడం యుక్తమంటాను. యెక్కడేనా గణభంగం వస్తుందనే చిక్కు వుంటే తత్సమపదం వాడుకోవచ్చును గాని అట్టిచిక్కులేనప్పుడు తత్సమాలు వాడుకోవడం యెందు కంటాను. మఱిన్నీ యీ పద్యంలో "నిక్కము" అన్నదికూడా అంత అవసరంగా నాబుద్ధికి తోఁచదు— "కావునన్" అనేది లేకపోయినా దాని అర్థం దానంతట అదే వస్తుంది. నాలుగో చరణంలో నరపాలుఁడు అనేది రాజు అనే అర్థమందు గదా వాడఁబడింది. అందఱు రాజులూ నరులను పాలించేవారుగానే వుంటారా? వుండరు. ప్రస్తుతవిషయమేమో బ్రాహ్మణత్వ క్షత్రియత్వ జాతులమీఁద ఆధారపడి వుండడంచేత కేవలజాతిమాత్రబోధకమైన శబ్దాన్ని వాడడం యుక్తం. "యీలాటివాదం యుక్తంగాదు, పద్యకవిత్వంలో వచన కవిత్వంలోలాగ అవసరమైనంతమాటే పడాలంటే పడ" దంటారా? ఆమాట నాకూ తెలుసును. పైవెక్కిరించు ధోరణినిగూర్చే శ్రీనాథుఁడు

"ప్రిధ్వంసాభావము ప్రాగభావ మనుచున్ దర్కింతుర్ విద్వాంసు" లని యీసడించడమున్నూ యెఱుఁగుదును. యెఱిఁగీ కూడా కొంచెఱి విమర్శన మార్గంయీలా వుంటుందని తెల్పడానికే యీ కాస్త వ్రాశాను.

పనిలో పనిగా మనప్రాచీనకవుల బిరుదాలను గూర్చి నాకుతోఁచిన మాటలు కొన్ని వ్రాసి దీన్ని ముగిస్తాను. నన్నయ్యగారికి "అష్టభాషా వాగనుశాసనుఁడు" అనే బిరుదం వుంది. సంస్కృతమున్నూ, ప్రాకృత భాషలు ఆఱున్నూ తెలుఁగున్నూ కలిసి యెనిమిదిభాషలలో వ్యాకరణము లెఱిఁగి శాసించిన మహాకవి గనుక యీయనకు యీబిరుదు సార్థకంగా కనపడుతుంది. తిక్కన్నగారికి— "ఉభయకవిమిత్రి" అనేబిరుదం వుంది. యిది అంతకన్న చమత్కారమైన బిరుదం. ఆ కాలపు సంస్కృతాంధ్ర కవులందఱూ తనకు మిత్రు లని కాని, వారందఱికీ తాను మిత్రుఁడ నని కాని, లేక రెండుకవిత్వములతోటిన్నీ తనకు మంచిసంబంధం వుందని కాని ఆ బిరుదంవల్ల తెలియఁబడుతుంది. యిఁక యెఱ్ఱన్నగారికున్న బిరుదమో "శంభుదాసుఁడు" అనేది. దీనికిన్నీ కవిత్వానికిన్నీ స్థూలదృష్టిని చూస్తే సంబంధమే కనపడదు గాని సూక్ష్మదృష్టిని పరిశీలిస్తే ఆయన కవిత్వభాగ్యం శంభుప్రసాదలబ్ధమని తెలుస్తుంది. మొత్తం కవిలోక గురువులగు కవిత్రియమువారి బిరుదములు సాత్వికా లని తేలుతుంది. తిక్కన్నగారికి సమకాలీనుఁడైన కేతన్నగారి బిరుదము "అభినవదండి" అనేది. యిది దండికృతదశకుమార చరిత్రాన్ని తెలుఁగులోకి అనువదించడంవల్ల కలిగిం దనుకోవాలి. ఇదికూడ రాజసబిరుదం కాదు. మఱిన్నీ శ్రీనాధుఁడుగారి బిరుదము మొట్టమొదటిది "సకలవిద్యాసనాధ" అనేది. ఇది నానావిద్యాప్రవిష్టత్వమును దెలుపుతుంది. గౌడడిండిమభట్టు గారిని జయించి ఆయనకంచుఢక్కాను పగులగొట్టించడంవల్ల కలిగినబిరుద మనుకుంటాను. "కవిసార్వభౌముఁడు" అనేది. డిండిమభట్టును జయించింది సంస్కృతకవిత్వవిషయంలో అయివుండాలిగాని తెలుఁగులో కాదు. సంస్కృతభాష అప్పటికాలంలో మనవారు యావత్ప్రధానభూలోకముగా తలఁచుచున్న ఆసేతుహిమాచలపర్యంతమున్నూ వ్యాపించివుండే భాష

కనక ఆసార్వభౌమబిరుదం సార్ధకం కావచ్చును. కేవలాంధ్రమునఁ గవిత్వము చెప్పువారికే అయితే దీనివిషయంలో సమర్థించడం పుస్తకాపేక్షే. యెందుచేత ? అవయవార్థం సమన్వయించకపోవడంచేత కావలసివస్తుంది. కాఁబట్టి “నేతిబీరకాయ” వంటిది. అయినప్పటికీ శ్రీ కూచిమంచి తిమ్మకవిగారికి యీ బిరుదం వున్నట్టు కనపడుతుంది. ఆయిచ్చినవారి తాత్పర్యం ఆంధ్రదేశమునకుమాత్రమే సమన్వయించుకోవలసేనా వుంటుంది లేదా అవయవార్థవివక్ష చేయలేదనేనా అనుకోవాలి. యికపెద్దన్నగారి “పితామహబిరుదము” నుగూర్చి: ఇందు లేశమును రాజసత్వం కనపడదు. ఆంధ్రప్రబంధరచనకు మార్గం తీసినవారిలో మొదట వాఁడవడంచేత నిది సార్థకమే. అయితే యీయనకు రాయలవారు తొడిగిన గండపెండేరము మాత్రము, కేవలము రాజసబిరుద మనక తప్పదు. అనేక రాజులను జయించి తత్సూచకమయిన గండపెండెరాన్ని రాయలు ధరించినట్లే తనసంస్థానకవికిఁగూడ నాబిరుదాన్ని ఆయన సామర్థ్యాన్నిబట్టి రాయలు ధరింపఁ జేసినాఁడు. అంతేకాని పెద్దన్నగారు తనకది కావలెనని రాయలను కోరినట్లాధారము లేవియును గనుపడవు. శ్రీనాథునికనకాభిషేకము “దీనారటంకాల” తో జరిగింది. పెద్దన్నపెండేరము నవరత్నములతో నిర్మింపఁబడింది. యేదోమసిపూసి నేరేడుకాయగా జరిగించుటకు వారికేమి దారిద్ర్యపీడ వుంది ? పెండెరము కాలిని ధరించడానికి వీలుగా వుంటుందనుకుందాము. కంచుఢక్కా యెందుకు పనికివస్తుందా అని నాశంక. అయితే అప్పటివాళ్ళకు ఆమాత్రం కూడా తెలియదా యేమిటి ? ఆకవిగారి ప్రయాణాలలో ఆఢక్కా వాయించఁబడడం ఆచార మనుకుంటాను. మఱివక విషయం. ఆ యీ బిరుదాలు విశిష్టాద్వైతులలోనున్నూ చాలా తీవ్రంగా కనపడతాయి. ప్రతివాదిభయంకరంవారు కవిగండభేరుఁడం వారు లోనైన మాటలు గృహనామములలోనే కనపడతాయి. మఱిన్ని కవితార్కికకేసరి లోనగునవి మిక్కిలిగా విశిష్టాద్వైతులలో కనపడతాయి. అవి కేవలంగా రజోగుణప్రధానాలని వివరింప నక్కఱలేదు. ఆ యీ రజోగుణవ్యంజకాలైన బిరుదులు తుర్యాశ్రమస్థుల కుండడం కొంత విచార్యం కాకపోదు.

కవికులగురుత్వానికి స్థానభూతుఁడైన కాళిదాసుకు "మహాకవి" అని మాత్రమే బిరుదు కనపడుతుంది. యిట్లే దండిభవభూత్యాది పెక్కు ప్రాచీనకవులకున్నూ తావన్మాత్ర బిరుదమే కనబడుతుంది. అప్పటికి యింతకన్న నధికబిరుదాలు లేనేలేవని వారివారి అభిప్రాయ మనుకోవలసి వుంటుందని దీనివల్ల మనము గ్రహించవలసి వుంటుంది. అప్పటికే కాదు, బాగావిచారిస్తే యిప్పుడుకూడ ఆబిరుదు కంటే యితరబిరుదాలలో యెక్కువ గౌరవం లేనేలేదేమో? యీలాగే కాకపోతే "కనిష్ఠికాధిష్ఠిత కాళిదాసా" అనే పేరుకు ప్రధానభూతుఁడైన కాళిదాసుకు మఱియొకబిరుద మేలలేకుం డెడిని? కాఁబట్టి రాజులకు మహారాజు బిరుదములాగు కవులకు మహాకవి బిరుదమే యెక్కువగౌరవాపాదక మనుకుంటే యుక్తమనుకుంటాను. తక్కినబిరుదాలు రాజులకు "రాయవేశ్యాభుజం" గాదికమువలెనే కవులకును వచ్చి వుంటాయి. మేము శ్రీవిజయనగరంలో "అలకాళికాదాసుఁడౌకవీ శ్వరునకే గణన కెక్కును మహాకవి పదంబు" అని వ్రాసేటప్పటికిఁగూడ మాతాత్పర్యం యిట్టిదే అని తెలియుచుండడంచేత యీ యభిప్రాయం కొత్తది కాదని చదువరులు తెలిసికోగలరు. మఱొకప్పుడు దీన్నిగూర్చి విస్తరించి వ్రాస్తాను.

---

# తెనాలిరామలింగకవికవిత్వం

ఇప్పటికి రమారమి నలభైయేళ్ళనాఁడు కాఁబోలు ప్రయోగరహస్యాలు తెలియక వృథాగా వొప్పులు తప్పులని వివరించే వారినిగూర్చి యీవిధంగా ప్రార్థించాను.

చ. పరిణతశక్తులైన యలభారతపుంగవు లట్టులుండ ము
 ష్కరుఁడనిపించుకున్న కవిసామజసింహము రామకృష్ణు వా
 గ్వరచనగూడఁ జూడుఁడు ప్రవేశఫలమ్ములు చిన్నచిన్న వ్యా
 కరణపుఁ బొత్తముల్ చదివి కయ్యము పెంచకుఁడయ్య వాగ్విదుల్.

(పాణిగృహీత)

ఇతఁడు ముష్కరుఁ డనిపించుకోవడాని క్కారణం తన సమకాలీనులలో మిడిమిడి జ్ఞానంతో ప్రయోగరహస్యాలు తెలియని కొందఱు లేనిపోని ఆక్షేపణలు చేస్తూ విసుగు పుట్టించేటప్పటికి సభలో ఘోర ప్రతిజ్ఞచేశాఁడు. ఆసమయానికి అది సముచితంగానే వున్నా యిటీవలవారికి అది కొంత వెగటుగా వుండక మానదు. చాలామంది యెఱిఁగిందే అయినా ఆప్రతిజ్ఞాపద్యద్వితయాన్ని వుదాహరిస్తాను.

చ. తెలియనివన్ని తప్పులని దిట్టతనాన సభాంతరమ్ములన్
బలుకఁగరాకురోరి పలుమారు....భావ్య మెఱుంగవు పెద్దలైనవా
రల నిరసింతురా ? ప్రగడరాణ్ణరసా ? విరసా : తుసా ! బుసా !

ఈపద్యం రెండోచరణంలో వదలినభాగం మఱీ కర్ణకఠోరంగా వుంది. ఆ ప్రగడరాజు నరసరాజుగారు యెవరో యేగ్రంథాలు రచించారో నాకు యింతవరకు తెలియదు సరిగదా ? యితరులకేనా తెలిసినట్టు లేదు. రామకృష్ణుణ్ణిగూర్చి చెప్పుకొనే వుక్కుటి పురాణగాథలలో తాతాచార్లగారు మొదలైన వారి పేర్లేగాని యీ నరసరాజుగారి పేరెక్కడా వినబడ్డట్టులేదు. రామలింగం పద్యంలో వుదాహరించడం చేత ఆనాఁటి కవులలో యీనరసరాజుగా రొకరు వుండేవారని మనం అనుకోక తప్పదు. రామలింగంవంటి వానితో కయ్యం పెట్టుకోవడంవల్ల యీయన పేరు పైకి వచ్చింది. "వరం విరోధోఽపి మహాత్మభిస్సమమ్." ప్రకృత మనుసరిద్దాం. పిశాచపుఁ బాడగట్ట, నీపలికిననోట దుమ్ముపడఁ! అని తిట్టిన రామలింగాన్ని కవిలోకం—"ముష్కరుఁడు" అనక మానదు. ఆసంబోధనతో కూడా ఇతఁడు విరమించలేదు. ఇంకా యెక్కువ దూఁకుడు చూపించాఁడు.

చ. ఒకని కవిత్వమం దెనయు నొప్పులు దప్పులు నాకవిత్వమం
దొకనికిఁ దప్పు వట్టఁ బని యుండదు, కాదని తప్పు వట్టినన్
మొకమటు క్రిందుగా దిగిచి మొక్కలు వోవఁగ నిన్పకత్తితో
సిక మొదలంటఁ గోతు మఱి చెప్పునఁ గొట్టుదు మోముదన్నుదున్.

ఆ యీ పద్యాలు యితనివి కావని కొందఱు చెపుతారు గాని ఆమాట విశ్వాస్యం కాదు. కొందఱు రామకృష్ణుఁడు వేరు రామలింగఁడు వేఱూ అని చెపుతారు. అదిన్నీ విశ్వాస్యం కాదు. విశ్వబ్రాహ్మణకవి వాకాయన రామలింగం మాకులస్థుఁడనిన్నీ ఆమాట అతఁడే "అగ్రిశాఖికా కోకిల మవు"అనే విశేషణద్వారా వ్యాఖ్యానించాఁడనిన్నీ వ్రాసినమాటలుయేపత్రిక లోనో చదివినట్లు జ్ఞాపకం. అదీ విశ్వాస్యంకాదు. అగ్రిశాఖ శుక్లయజు శ్శాఖ కాని అన్యంకాదని తెలివిడి. యితని మొదటిపేరు రామలింగ మన డానికి యేవిధమైన సంశయమున్నూ లేదు. ఆమాట యీక్రింది పద్యం రుజువు చేస్తుంది. "ఉ. లింగనిషిద్ధుఁగల్వల చెలింగని....ఆలింగనిరామ లింగ కవిలింగనికీర్తి హసించు దిక్కులన్''పాండురంగమాహాత్మ్య రచన నాఁటికి యితఁడు వైష్ణవం పుచ్చుకోవడంచేత "రమ్యగుణకృష్ణ ? రామయరామకృష్ణ"గా మార్పుచెందినాఁడు. వైష్ణవమతస్థులకు శివవాచక శబ్దా లేవీ రుచించవు. అందులో లింగశబ్దాన్ని గూర్చి చెప్పేదేమిటి ? ఆ కారణంచేతనే యీమధ్య వైష్ణవుఁడు "ఒకలింగఁడు తెగినా తెగడమే" అన్న లోకోక్తికి వుదాహరణంగా రామకృష్ణుఁడు గా మాఱిన పిమ్మట తనవలెనే వైష్ణవమత ప్రవిష్టుఁడగు శ్రీ విరూరివేదాద్రి మంత్రీశ్వరునకు శ్రీ పాండురంగ విఠలునికి సంబంధించిన యీచరిత్రమును—"పాండు రంగ మాహాత్మ్యము" అను పేరుతో రచించి కృతి యిచ్చెను. కవిపరం పర- పాండురంగ విజయము అనే దానిని రామలింగకవి లేదా ? రామ కృష్ణకవి రచించినట్టు చెప్పికోవడం నాచిన్నతనం నాఁటికి సర్వత్రా వుంది. వుండడమే కాదు. ఆగ్రంథంకోసం యెందఱో కవులు ప్రయత్నించేవారు కూడాను. అట్టివారిలో చేరినవాఁడనే నేనున్నూ. ఈమాహాత్మ్యానికే ఆపేరు పర్యాయపద మనుకోవడానికి వీలు లేకుండా కొన్నిపద్యాలు శ్రుతమవుతూ వుండేవి. ఆపద్యాలు పాండురంగ విజయంలోవని పరంపరగా జనశ్రుతి వుండేది— ౧ తే.గీ. అతివకచనాభి....ఉభయగతుల. ౨ సీ. శరదంబు జడతోడ... ౩ చ. అలఘన చంద్రబింబనిభమై .... .... ...

ఈమూడుమాత్రమే కాదు. యింకా కొన్ని కొందఱికే వచ్చును. ఆయీ పద్యాలవొకడ చాలా కష్టసాధ్యమైన కూర్పు కలిగి వుంటుంది. అందులో "తే. గీ. అతివకచనాభి" అన్న పద్యరచనావిధానము యేకవి కిన్నీ దుర్ఘటమే. ప్రస్తుతం పెట్టుకున్నపని అది కాదుకనుక ఆపద్యానికి అర్థంవ్రాయలేదు. అవకాశం వుంటే వ్యాసంతుదను వ్రాస్తే వ్రాస్తాను. ఆయీ పద్యాలలో యేదిన్నీ యిప్పుడు దొరకి అచ్చైయున్న పాండురంగ మాహాత్మ్యములో లేకపోవడంచేత, పాండురంగవిజయం అనేది వేఱే అలాయిదాగా వుందనే భ్రాంతి యింకా కొందఱికి వుండిపోయింది. ఆప ద్యాలు లేవుసరిగదా వాట్లనిపోలిన పద్యాలుకూడా స్త్రీవర్ణనలో ప్రస్తుతం వుప లబ్ధమైన"మాహాత్మ్యంలో"కనపడవు. కాని ఆగంపచిక్కురచన రామలిం గానిదేకావి, అన్యులదిమాత్రంకాదు. ప్రస్తుతం నేనుచూపఁబోయేవి ప్రయో గరహస్యాలుగాని రచనాచమత్కారాలుకావు కనుక ఆవిషయం యింతటో ముగిస్తాను. పాపం యెందఱో కవులు ప్రయోగరహస్యజ్ఞులు కాక వొప్పులు తప్పులుగానూ,తప్పులు వొప్పులుగానూ భ్రమించడం కలదు. దాన్ని(అంతా కాదు)కొంతేనా దీనిద్వారా తీర్పఁగలుగుతానేమో ? అని దీన్ని వుపక్రమిం చాను. ఇది"వార్ధకే తీర్థయాత్రా"వంటిది. చాలా కాలంక్రిందట చేయవలసిన పని అయితే ప్రత్యేకించి యితని ప్రయోగాలే యెత్తి వ్యాఖ్యానించలేదు. గాని మఱికొందఱితోపాటు యితణ్ణికూడా స్పృశిస్తూ వచ్చాను. ఆయీసం గతి మాఖండనమండనాలు చూచినవారికి విశదమే. యిఁక ప్రస్తుతానికి వస్తాను. "విరురివేదాద్రిశౌరి" ఇందులో విరూరి పదంలోవున్న దీర్ఘం హ్రస్వీకృతమయింది. అది ఊరు (గ్రామవాచకం) శబ్దంగాని ఉరు శబ్దం కాదన్నందుకు వేఱొక్కచోట యితఁడు వాడిన "విరూరిపట్టణవిభున్" అనేది సాక్ష్యం. అయితే దీన్నిబట్టి ఊరు శబ్దానికి ఉరుశబ్దం రూపాంతరం వుంటుందనుకోకూడదు. వెనకాల విరు, తిరు, చుంతు, ఏలు ఇత్యాదు లుపపదాలున్నప్పుడు—విరురు, తిరురు, చుండురు, ఏలురు అనేరూపాలు సిద్ధిస్తాయనిమాత్రమే మనం తెలుసుకోవాలి.

"భట్టరు చిక్కాచార్యుల మహాత్మ శ్రీ గురుమూర్తిన్" యీ చిక్కాచార్యులవారు మన రామలింగకవికి తిరుమంత్రోపదేష్ట. ఆ కారణంచేత గౌరవార్థక బహువచనంతో తప్ప ఆమతసంప్రదాయం యెఱిఁగిన యేకవి గాని అన్యథా వాడఁడు. కనుకనే వ్యాఖ్యాతలుగాని సంస్కర్తలుగాని— "చిక్కాచార్య మహాత్మన్" అని దిద్దుటకు సాహసించలేదనుట తెల్లము. అసలు వస్తువునందుండే గౌరవాన్ని బట్టి ఆ పేరు పెట్టుకొన్న వ్యక్తులు కూడా ఆ బహువచనంతోనే వ్యవహరించఁబడడం సర్వానుభూతమే అయినా కొంచెం వుదాహరిస్తాను.

ఆంజనేయులు, రామానుజులునాయఁడు, శ్రీరాములు, యతిరాజులు, వేంకటేశ్వర్లు, రంగనాయకులు యింకా యీలాటివి చాలా వున్నాయి చూచుకోండి. యివన్నీ గౌరవార్థక బహువచనాలే, ఆగౌరవం పేరు ధరించిన వారియందలిది కాదు. అసలు వ్యక్తినిష్ఠం. వీట్లకు విశేషణాలు వుపయోగించడం యేకవచనంలోనే. యింకోవిశేషం. స్తనశల్య పరీక్షగా పరిశీలించేవాళ్ళుతప్ప ఆయీప్రయోగాలు బహువచనాంతాలని యెఱుఁగనే యెఱుఁగరు చాలామంది; యెందుచేతంటే— శ్రీరాములను తీసుకురమ్మంటే తీసుకువచ్చేది వొక్కణ్ణేగా ? యింకో రహస్యం యిక్కడ వ్యాకరించాలి. మొగాళ్ళ పేరులున్న ఆడవాళ్ళెందఱో వున్నారు. తఱచు యీ సందర్భం క్షత్రియకుటుంబాలలో కనపడుతుంది. లక్ష్మీనరసయ్యగారు వెంకయ్యగారు, ఇత్యాదులు. అయితే యీ స్థలంలో అయ్య పదానికి అమ్మ పదం చేర్చి, నరసమ్మగారు, అని వ్యవహరిస్తేనో ? అది యిప్పటి కాలంలోనైతే యేమోగాని, ప్రాచీనకాలంలో అయితే కొంపమీఁదకి వస్తుంది. యేమంటారా ? అమ్మ అనేపదం తల్లినిగదా ? బోధిస్తుంది. తల్లి, తండ్రికి పెళ్ళాం కాక తీరదు. అంతఃపురస్త్రీలను ఆకారణంచేత అమ్మపదంతో పిలవడం పెద్దదోషంగా పరిగణించి అయ్యపదంతో వాడడం మంచిదన్నారు. యిది యేవ్యాకరణంలోనూ లేదుగాని అభిజ్ఞులవల్ల విని వ్రాస్తున్నాను. ఆయీ సంగతి యెఱుఁగని పామర్లు ఆ అయ్యపదానికి ఆగమంగా అమ్మపదాన్ని తగిలించి— లక్ష్మీనరసయ్యమ్మగారు, అని వ్యవహరించడ

మున్నూ వుందిగాని, అది యెఱిఁగి చేసేతప్పుకాదు గనుక క్షంతవ్యంగా భావించి లోపాయికారీని మందలిస్తారు. యిఁక దీనికి సన్నిహితంగా వుండే “గారు” శబ్దాన్ని గుఱించి కొంత వ్యాకరిస్తాను. యీగారు బహువచనం వంటిదే. వ్యవహారంలో, సుబ్బయ్యగారు యోగ్యులు అని వాడడమూ వుంది క్వాచిత్కంగా, సుబ్బయ్యగారు యోగ్యుఁడు అనడమున్నూ వుంది. మన రామలింగం యేలా ప్రయోగించాఁడో? చూదాం. “త్రియ్యంత వాసనాగ్రహబుద్ధి నొయ్యారి యియ్యారి రామానుజయ్యగారు” దీనివల్ల మనం యేం తెలుసుకోవాలంటే? గౌరవార్థక బహువచనానికి విశేషణాలు బహువచనంలో వాడకపోయినా తప్పుగాదనియ్యేవే. పనిలో పని యింకో దాన్నిగూర్చి ముచ్చటిస్తాను. సంఖ్యావాచకమైన శబ్దానికి “ఒక్కరు” అనే బహువచనం లేదని వ్యాకరణం స్థూలదృష్టిని శాసించిందిగాని శబ్ద రత్నాకరంలో, ఉపోద్ఘాతంలో— “ఒక్కరిద్దఱు” అని ప్రయోగించారు. ఇక్కడ ఒకఁడిద్దఱు అని యెంతమూర్ఖుఁడూ దిద్దసాహసించఁడు. ఇతరులు అని అర్థం చెపుదామంటే, సమీపంలో వున్న ఇద్దఱు శబ్దం వొప్పుకోదు. కనక గౌరవార్థక బహువచనం సంఖ్యావాచకమైన ఒక శబ్దానికి అంగీకరించక తప్పదు. ఇవన్నీ వ్యవహారంవల్లనే తెలుసుకోతగ్గవి. చూడండీ, “అయ్యా? తమరొక్కరూ వొకసారి దర్శన మిప్పించాలి.” అనే వ్యవహారంలో వున్న వొక్కరు ప్రయోగం దిద్దితే దిద్దఁబడుతుందేమో ఆలోచించండి. గౌరవార్థకం కాకుండా సంస్కృతభాషలో సామాన్యార్థకమందు నపుంసక ప్రయోగం (సామాన్యే నపుంసకం, చూ.) వాడినట్లు తెలుఁగులో వొకవిధమైన బహువచన ప్రయోగం కనపడుతూవుంది. ఎవరా వచ్చింది? నీ పేరెవరు? ఇత్యాది వ్యవహారం కలదు. అయితే యిది గ్రామ్యమంటారా? “నరునకు....చుట్ట మెవ్వరు” అని శంభుదాసుఁడు ప్రాసస్థలంలో వాడినదానికి గతేమిటి? అది కంఠం పట్టుకుంటుంది. ఆయీ గారు శబ్దాన్ని గూర్చి నేఁటికి ముప్ఫయ్యేళ్ళనాఁడు ఏదో వ్యాసం కృష్ణలో ప్రచురించాను. అది దీనికెవ రర్హులు? యెవరు కారనే విషయాన్ని గూర్చే అందులో చర్చించినట్లు జ్ఞాపకం. యిప్పుడు వ్యాకరణ

విషయమై వ్రాశాను—— "సర్వస్వశయ్యా నేఁటి అళవందారు కందాళ యప్పగారు" "కందాళయప్పగారిన్ దయాయత్త స్వాంతు" అనే ప్రయో గాలుకూడా వ్యాఖ్యానించినట్లయింది. ఆయీ స్థలాల్లో బహువచనాంతంగా విశేషణలు వేసినా తప్పులేదు. గాని అంతకన్న యేకవచనాంతంగా వుం డడమే అందం. (శయ్యా, అన్నది శయ్యలు అని మారిస్తే పూత్రిం పదడుగా వుంటుం దని తెల్విడి.) "శ్రీ యహోబల నరసింహనామకుండు" "శ్రీ యౌబళాఖ్య తిలకవతికి-" ఆయీ రెండు శ్రీశబ్దాలూ విసంధి (ఇకోయణచి చూ.) గా వుండడం స్థూలదృష్టులను భ్రమింపఁజేస్తుంది. అందుచే చూపవలసి వచ్చింది గాని లేనిచో చూపనక్కఱలేదు. యీలాటి చోట శ్రీదీర్ఘాంతంగా వున్నా తెలుఁగు మర్యాదనుబట్టి (నచైకవర్ణే) తప్పు కామగదా? ఆశ్రీకి శ్రీయుక్తమైన అనే అర్థం సమాసమనుకొన్నా వస్తుంది వ్యస్తమనుకొన్నా వస్తుంది (ఈ శ్రీశబ్దంతో వున్న సమాసం మధ్యమపదలోపమే.) ఇవి సాధ్యసమాసాలని తెలుసుకోవాలి. వీటితో పాటే శ్రీ యాంజనేయులు వగైరాలు. యింకోటి, యీలాటిచోట్ల సిద్ధసమాసాలు చేస్తే (శ్ర్యాంజనేయః) కర్ణకఠోరంగా వుంటుంది కాని సంస్కృతకవిత్వంలో (పర్జన్యవల్లక్షణప్రవృత్తిః సతుజలే స్థలేవ వర్షతి) యణాదేశం చేయక తప్పదు. యిప్పుడు నేనుచూపిన సమర్థనం తెలుఁ గువాట్లకే.

"అఖిలభూమీపాలకాస్థాన కమలాకరోత్కర తరుణసూర్యోదయుఁ డవు" యిక్కడ ఉదయశబ్దం సంస్కృతంలో పుంలింగమే అయినా తెల్గులో "ఉదయము" అని అమహత్తుగా వాడడం న్యాయం. సము ద్రుఁడు-సముద్రము, మేఘుఁడు-మేఘము అన్నట్లు దీనికి మహద్వివక్ష చేయడానికి మహత్కార్యమేదీ యిక్కడ చేయవలసిన ఆవశ్యకత కలగ లేదు. కనుక "సూర్యోదయమవు" అంటే "నచ శంకా నచోత్తరం" గా వుండేది. కాని రామలింగం అంతసరళంగా కలం నడుపుతాఁడా? యిత రులశంక కవకాశం వుండాలని చూస్తాఁడు. తరువాత సమర్థనాన్ని చూపు తాఁడు. గాఢంగా మందలిస్తాఁడు. "పూర్వపక్షపున్, గంతులకేమి? చూచె

డవుగా ? తుది నీబహుళా_ర్తిఖేదముల్" అనే వాక్యాన్ని స్మరింప చేస్తాఁడు. సమర్థనం యేలాగంటే, "ఉదయుఁడు" అంటే: అర్థం ఉదయం వంటి వాఁడు, అనికాని ఉదయమే కాదు కనక, యిప్పుడు మహత్తుగా పరిణమించినట్లయింది. కనక మహచ్చిహ్నమైన డు విభక్తికి అవకాశం కలిగింది. వాపక్షంగా సూర్యోదయమవు అని కూడా వుండవచ్చునని తెల్విడి. ఉభయవిధ ప్రయోగములకు సామంజస్యం వున్నప్పుడు శంకించడం చింత్యం కదా!

"అయ్యింతి చెక్కులఁ బోలుం దెలనాకులు" యీవాక్యంలో పోలు, అనేది తద్ధర్మవిశేషణరూపం (క్రియాజన్య విశేషణమన్న మాట) గాని తళుకు సొగసు లోనైన శబ్దాలవంటిది గాదు. ఉదంతములైన తద్ధర్మవిశేషణాలకు హల్పరకత్వమందు నుగాగమం రావడానికి సూత్రం లేదు. అచ్పరకత్వమందయితే నుగాగమం వచ్చి కొట్టు + అతఁడు, కొట్టునతఁడు అవుతుంది, అంతే కాని కొట్టు + రాముఁడు కొట్టున్ రాముఁడు అనే రూపానికి సూత్రాధారం లేదు, కాని ప్రామాణికకవుల ప్రయోగము లున్నాయి. ఆయీ గ్రంథాలు పుట్టిన కొన్నివందలయేండ్లకు రచించిన వ్యాకరణంలో యీ మాదిరి ప్రయోగాలు యెత్తి వ్యాకరించి తప్పనేనా అనవలసింది లేదా ? సమంజసములే అనియేని లిఖించవలసింది. అట్లు చేయక పోవుటచే నిటీవలికవులు వృథా వివాద పడడానికి హేతువుగా పరిణమించింది.

"బలిమి సీయని భూమి వలయపతులన్" అనే నన్నయ్యగారి ప్రయోగాన్ని బట్టి ఇచ్చుధాతువు (వ్యతిరేకార్థకంలో) దు ఈయని ఈని అని రూపద్వయాన్ని వొప్పిన బాలవ్యాకరణకర్త తిక్కన్నగారి ప్రయోగాలు "చేతురు" వగయిరాలు కనుపడుచున్నప్పటికీ తనకు పూర్వులైన మహాకవులు కవిబ్రహ్మ ప్రయోగాన్ని బట్టి ప్రయోగించుకొన్నప్పటికీ "అసాధువులు" అనడం యెందుకు ? ఆవశ్యకమైన శృంఖలాలు వుండనే వున్నాయి. అనావశ్యక శృంఖలాలు తగల్చడం అవిచారమూలకమే

అంటాను. యీ మాటని పట్టి సంస్కర్తలు భారతాన్ని దిద్ది సంస్కరించారు. కాని తక్కిన కవుల ప్రయోగాలు "మ. తనరార న్నుతిసేతు సేతుహిమ" యిత్యాదులు దిద్దితే శ్రుతిపేయత్వం చెడుతుంది కనుక అలాగే వున్నాయి. ప్రస్తుత ప్రయోగం "పోలుం దెలనాకులు" వ్యాకరణం స్పృశించనే లేదు. (మైజిగిఁ దెగడున్ బుటువగు నొక వటువు వచ్చె లోనైనవి యింకా కొన్ని కలవు. చూ.) కాని దాన్నిపట్టి సాధింప వీలైనది కాదు. వసుచరిత్రలోకూడా వొకప్రయోగం చూచినట్లు జ్ఞాపకంవుంది. మిత్రవిందా పరిణయంలోనున్నూ వుంది. చాలామంది కవులు ప్రయోగించారు. రామలింగ మంతవాఁడు "నాకవిత్వమం దొకనికిఁ దప్పుపట్టఁ బనియుండదు" అని ప్రతిజ్ఞచేసి గర్జించినవాఁడు ప్రయోగించడంకంటే మనకు కావలసిందేమిటి ? కనక "పోలుం దెలనాకులు" నిర్దుష్టమే కాని శ్రవణసుఖం చూచి మాత్రం మనం వాడుకోవడం మంచిది. యే వ్యాకరణమూ శ్రవణసుఖవ్యాకరణం తరువాతే అని నేననుకుంటాను. ఆయీ పద్యంలోనే "అయ్యువిద పల్కుల్వంటి కప్రింపుఁబల్కులు" అని వుంది. పల్కులవంటి అంటే బాగుంటుంది అని కొంద అనవచ్చును. యీ ప్రయోగం సమస్తపదంగాని వ్యస్తపదంగాదు. వ్యస్తమైతే వలె అన్నదానికి వంటి అనే రూప మేర్పడదు. నావంటి, నీవంటి వగైరాలు చూచుకోండి. యీఔపవిభక్తిక వికారాలకు వొకతోవా తెన్నూ లేదు. "లాగు" అన్నది ఔపవిభక్తికమా ? కాదా అని నా కెన్నాళ్ళనుంచో సంశయం. "ఈలాటి వాఁడు, ఆలాటివాఁడు" అని వ్యవహారం కనపడుతూ వుంది కాని కవులగ్రంథాలలో (ప్రాచీనులలో సుమండీ) మాత్రం యిప్పటికి ప్రయోగం దొరక లేదు. నవీనులలో వొకానొక వ్యావహారికభాషా వాద వ్యతిరేకి చాలా నియమనిష్ఠలతో రచన సాఁగించి బళ్ళకు బళ్ళు నడపిన కడపమాండలికకవి అసకృదావృత్తిగా ప్రయోగించడం చూచాను. యేం లాభం, దీన్ని కవులు మన్నిస్తారా ? బ్రిదికివున్నవానితుమ్ము పాటికిరాదు గదా ? భవతు. ప్రస్తుతం రామలింగం, కీర్తిశేషుఁడు మాత్రమే కాక, భాషాశేషుఁడుకూడా కనుక "పల్కుల్వంటి" అనే చోట అతఁడు చేసిన,

అకారలోపం మాననీయమే. కాని యిక్కడ వొక సందర్భం విచారించ వలసి వుంటుంది. పల్కులవంటి, పల్కుల్వంటి అనే ప్రయోగద్వయంలో యేది శ్రవణపేయంగా కనపడుతుంది? అని ప్రశ్నించుకుంటేమాత్రం అకారసహితమైన "పలుకులవంటి" అన్నదే శ్రవణహితంగా వుంటుం దనక తప్పదు. కాని ఛందోబద్ధంగా కవిత్వరచన సాగించే టప్పుడు యెంత వాఁడికేనా కొంచెంగానేనా శ్రవణకటుప్రయోగాలు తగులక మానవు. కవిబ్రహ్మకంటే కూడా నేఁటివారు శ్రవణపేయంగా రచన సాగించలేరుకదా; "చ. వినుము నరేంద్ర విప్రుఁ డలిగెన్." "క. ద్యూత క్రీడకుఁ గొండొక నేతున్"

అయీ చోట్ల యతిప్రాసలు పోతే పోతాయి గాక. విప్రుఁడలిగెన్ కొండొక నేర్తున్, అంటేనే శ్రవణసుఖంగా వుంటుందనడం సర్వసమ్మతం. ఆయీ నియమం పద్యకవికి సాఁగదు. పద్యకవిత్వం చెపుతూ కూడా శ్రవణసుఖాన్ని విశేషించి పాటించడం వల్లనే నన్నయ తిక్కనాదుల కవిత్వాలు శాశ్వతాలయి ప్రకాశిస్తున్నాయి. ఆరకం కవులలో యీరామకృష్ణకవివొకఁడనడానికి వొప్పని సహృదయు లుండరు గాని పాకంమాత్రం చాలాభాగం నారికేళపాకం, కదళీపాకంలోకూడా కొంత వుంది. ద్రాక్షాపాకంలో నడిచిన భాగం చాలా తక్కువ.

"ఉ. మాయపుబిడ్డ యీనిసువు మానిసిపట్టువు గాదు, దేవతా
నాయకుఁడో? చతుర్ముఖుఁడొ? నాభవబంధము లూడ్వనున్న నా
రాయణమూర్తియో...."

యీలాటి రచనమాత్రమే చాలమందికి నోటికి వస్తుంది.

"ఉత్తాల ఫణిభుగ్గరుత్తాలవృంతానిలాశాంత ఘర్మాంబువయ్యోమేను"
"కఠినకంఠీరవాక్షత నఖక్షత జరత్కరిశిరశ్శుక్తి శార్కరిలములు."

యీమాదిరి రచన యెవరికోగాని కంఠపాఠంగా రాదు. యేదో లెక్కకి కొంచెంగా పాండిత్య ప్రకటనార్థం యిట్టిరచన ప్రతికవికవిత్వం లోనూ వుంటుంది. కథావస్తువులో పస లేశమున్నూ లేకపోయినా మహా

కావ్యానికి కావలసిన సామగ్రి యావత్తూ సమకూర్చి సర్వతసబంధురంగా రచించడాన్ని గూర్చి యితన్ని యెంత మెచ్చినా యింకా మెచ్చవలసే వుంటుంది. ప్రస్తుతం మనకు కావలసింది ప్రయోగజ్ఞానం కావున మఱొకటి చూపుతాను. "రామకృష్ణ ప్రధాని వెలసె" ఆయీ ప్రధాని ఇన్నంత మనుకుంటే యేవిధమైన చర్చకూ అవకాశం లేదు గాని అందుకు సహృదయులు సమ్మతిస్తారని తోఁచదు. అకారాంతమైతే ప్రధానుఁడు అని కావాలికాని "ప్రధాని" అని కావడం కష్టసాధ్యం. "ప్రధానుఁడు" అనే ప్రయోగం లోకంలో యీ అర్థ మందు వినఁబడడం లేదు. "రాజూ ప్రధానీ" అంటూ వాడుకుంటూవుంటారు ఆబాలగోపాలమున్నూ; రామలింగం దాన్నిబట్టే అనుకుంటాను అసకృదావృత్తిగా "ప్రధాని" అని వాడివున్నాఁడు. యిట్లాటిదే "తాపసి" అనే తత్సమ ప్రయోగం. తాపస శబ్దం ద్వారా సాధించ తగ్గదిగానే కనపడేది యితనిదే వుంది. "అనుడు వేలుపుఁ దాపసి యా సుశీల" (టిప్పణి చూ.) దీనివల్ల కొన్ని అకారాంత సంస్కృత శబ్దాలకు తత్సమరూపం యికారఘటితంగా కూడా వుంటుందని తెల్విడి—

"నూడుకుఁ బట్టు మహోగ్రసింహమున్." ఆగమశాస్త్ర మనిత్యమని యుండుటచే నూడునకు అనక "నూడుకు" అని మన రామలింగం ప్రయోగించాఁడు. భారతంలోకూడా ఆగమవిరహిత ప్రయోగం వుంటే అది యిటీవలివారు దిద్దిరనియెఱుఁగునది. అందఱు కవులూ యీ ప్రయోగంవొప్పుకున్నారని వారివారి ప్రయోగాలు సాక్ష్య మిస్తాయి. దీనివిషయంలో నాకు మొదటినుంచీ సమ్మతి వుందిగాని తత్సమశబ్దాలకు ఆగమం తీసివేయడం హృదయంగమంగా వుండ దనుకునేవాణ్ణి. యిటీవల మహాకవుల ప్రయోగాలద్వారా ఆచేదస్తం కూడా వదలింది. కూచిమంచి తిమ్మకవిగారు భారతాన్నుంచి చూపింది "ధృతరాష్ట్రసుతుకు" అనేది. (సర్వలక్షణసారసంగ్రహం చూ.) ఆయన భారతలక్ష్యం చూపినా సరే మఱికొందఱు మహాకవులుకూడా ప్రయోగించినాసరే కాని ఈనగాగమ రాహిత్యం తెలుఁగుశబ్దాలకు శోభించినట్లు తత్సమశబ్దాలకు శోభించదు.

యింకో విశేషం, కొన్ని తెలుఁగుశబ్దాలకు నగాగమసాహిత్యం వికారంగా కూడా వుంటుందని నేనమకుంటాను. "చెట్టుకొాకరుఁడై" అనే రాహిత్య ప్రయోగానికి వున్నంత సొగసు "చెట్టునకొాకఁడై" అనే సాహిత్యప్రయోగానికి వుండదనే నేనమకుంటాను. సహృదయులు పరిశీలింతురు గాక.

" ధర యను కొల్నిలో మొలచు తామర " కొలను = చెఱువు ఈశబ్దముఅకారమధ్యం న ల డ ల మీఁదనున్న అకారానికిలోపం శాస్త్రసమ్మతమేకాని, కొన్నిచోట్ల ఆలోపం శ్రవణకటువుగా వుంటుంది. ప్రస్తుత ప్రయోగానికి ఆదోషం తగిలింది. కాని శాస్త్రసమ్మతి కనపడడం చేత పూర్వపక్షులు నోరెత్తితే రామలింగం వూరుకోఁడు. గ్రంథరచన చేసేటప్పుడు కొంత శాస్త్రాన్ని అనుసరించాలి. మఱికొంత లోకాన్ని అనుసరించాలి. యెన్నితిప్పలూపడకుండా కాపరం తుదనెగ్గదు. "నిర్వేద, పోర్మహిషున్, ఎడ్మ" యీ ప్రయోగాలన్నీ సజాతీయాలే. వొకటి రెండుప్రయోగాలలో ఉకారలోపం, మూడులో అకారలోపం, రెండులోతద్ధర్మోకారలోపం కొన్నిచోట్ల హృదయంగమంగా వున్ననూ ప్రస్తుతప్రయోగంలో కొంచెం వెగటే. "గిరివ్రజ మన్ పురంబు" ఈభారతప్రయోగము హృదయంగమం అయితే శాస్త్రాధారం రెంటికీ వున్నప్పుడు ప్రయోగించ వద్దనడానికి వీలుంటుందా? అందుకే ఆలంకారిక వామనుఁడు యీవిధంగా అన్నాఁడు.

"విచిత్రప్రకారాహి పదానాం ప్రవృత్తిః వామనయనా వామోరురితి భవతి. నతు వామచరణా వామవదనేతి."

శాస్త్రకర్తలు శాసించడానికేం శాసిస్తారు. అనియమాలతో యేకవికిన్నీ రచన సాఁగదు. "నిరంకుశాః కవయః" ప్రతీశబ్దం పరిశీలించి అష్టశుద్ధులూ చేసి ప్రయోగించడం జరగదు. ఇఁక మూడోది. " ఎడ్మ " అనేది, ఇది అకారమధ్యం. ఈలోపం శ్రవణకటువేకాని భారతసమ్మతం.

"భోరున విస్ఫులింగములు పొడ్మఁగ," (భారతం)

అందుచే బొత్తిగా నోరెత్తడానికి వల్లకాదు. యీ అకారలోపం డకారంమీఁదనే కాదు, లకారంమీఁద చేసినా హృదయంగమంగా వుండ

దని లోఁగడ వ్రాసే వున్నాను. అయితే "ప్రొల్తి" అని భారతం ప్రయోగించింది. యిందులో అకారమ్మాత్రమే కాదు, దానితోపాటు అఱసున్న కూడా లోపించింది. సహేంద్రతక్షకాయ స్వాహా. దీన్ని బట్టి "వెలఁది" అనేదాన్ని వెల్ది అనిచేసి వాడడానికైతే అభ్యంతరం వుండదు గాని శ్రవణ సుఖం చూచుకోవాలి. యెవరేనా కవిత్వం చెప్పడం యెందుకు? రసజ్ఞులు చదువుకొని ఆనందిస్తారనేకదా? ఆపద్ధతిని అన్నీ మాఱుమూల ప్రయోగాలుపయోగించి చదువరులకు యేవాన్ని కలిగించడం ఆమోదించవలసి వుండదని వ్రాయ నక్కఱ లేదు.

"వకాణించు - నిటూర్పు" ఈప్రయోగాలకు శాస్త్రంగాని, భారత సమ్మతిగాని వుందా! అంటే చూపడం కష్టంగాని, అంతమాత్రంచేత తప్పనడానికి వల్లకాదు. "పెద్దతండ్రి, పెదతండ్రి" ఇత్యాదులు నిర్దుష్ట వ్యావహారిక ప్రయోగాలు కనపడుతూన్నాయి. యేకవి కవిత్వం (తెలుఁగులో) పరిశీలించినా నూటికి యేభైపాళ్ళు వ్యావహారిక పదభూయిష్ఠమని వారివారి గ్రంథాలవల్ల అవగతమవుతుంది. కనుక యీద్విత్వలోపం శిష్ట వ్యవహార ప్రయోగాలవల్ల సమర్థనీయం. నిడుద + ఊర్పు = నిట్టూర్పు యింతవఱకు శాస్త్రం సమ్మతిస్తుంది. శేషం, నిరంకుశాః కవయః.

"కొన్ని గొణింగి కొన్గినిసి కొన్ని తుటారము లాడి" ఈ కొన్ని శబ్దంలో యికార లోపంతోపాటు ద్విత్వంకూడా యెగిరిపోయింది. ఇది వాలా సాహసప్రయుక్త ప్రయోగం. భారతకవులు గాని శ్రీనాథాదులు గాని యింత సాహసం చూపలేదనే నా తలంపు. తీరా శంకిస్తేనో? కారెత్తనివ్వడు రామలింగఁ. నలడల మీఁదవుండే యికారం శాస్త్రంవల్లనే పోతుంది గదా? యింక నకార ద్విత్వం పోవాలి. నెత్తిమీఁద అచ్చున్నప్పు డేకాని ఆ నకారానికి వుచ్చారణ పొసగదు. శాస్త్రతః యీ ప్రయోగం నిర్దుష్టమే సాధ్యమే కాని యే మహాకవిగాని సాహసించి యింతవఱకు ప్రయోగించకపోవడంచేత కొంత చర్చింప వలసి వచ్చింది. "నచ శంకా కృనో తగన్"

"వసుమతి మం దేతెంచెన్, ఉండుండి" వసుమతినుండి ఏతెంచెన్ అని రామలింగం స్పష్టంగా క్త్వార్థకయికారానికి సంధి చేసి ప్రయోగించాఁడు. (ఉండి + ఉండి యిదిన్నీ డిటో) భారతాదులలో వున్న ప్రయోగాలు విన్న మొన్న దిద్దినా అతని (లింగం) నాఁటికి దిద్దరేదుకదా. ఆకారణంచేతనే యితఁడు వొకటి రెండు మూడు చోట్ల మాత్రమే ప్రయోగించాఁడు కాని పిల్లలమఱ్ఱి మఱ్ఱివూడలమాదిరిని చాలాచోట్ల ప్రయోగించి వున్నాఁడని లోఁగడ వేదో. వ్యాసంలో వ్రాసినట్లు జ్ఞాపకం. పాపం చక్కనికవిత్వం చెప్పే చేమకూర కూడా ప్రమాణపరిమితప్రయోగాలు నాలుకలు క్రోలుతూ వుండడంవల్లనే "ఆటు చూపిటు; నిటుచూ పటు" వగైరాలు వాడుకున్నాఁడు. ఇతరులు వాడడానికీ రామలింగం వాడడానికీ చాలాతేడా వుంటుంది. వీనిప్రతిజ్ఞ "చ. ఒకనికవిత్వ మందెనయు నొప్పులు దప్పులు నాకవిత్వమం దొకనికిఁ దప్పు వట్టఁ బని యుండదు.... తన్నుదున్" అనికదా! ఇట్టిమహాకవుర్ణి నిరాధారంగా క్త్వార్థకానికి సంధి చేస్తే సమకాలీనులు తలయెత్తుకొని తిరగనిస్తారా? అఖరికి బతకనిస్తారా? అందుచేత ఆయా యీ మహాకవులవిషయంలో— "చిన్ని చిన్ని వ్యాకరణపుఁ బొత్తముల్" మహాపరాధం చేశాయని నానిష్కర్షాభిప్రాయం. లక్షణగ్రంథాలు వ్రాసేవాళ్ళు తమ కాలంనాఁటికి ప్రాచీనులైన మహాకవుల ప్రయోగాలను పరిశీలించకుండా లేనిపోని అపసిద్ధాంతాలు కల్పించకూడదు. రామలింగంకంటె పిల్లలమఱ్ఱికంటె ఆంధ్రకవిత్వానికి యెక్కువ ప్రామాణికులంటూ వుంటారని అనడానికి యేకవికి నోరు తిరుగుతుంది? అయితే వొక్కటిమాత్రం ఆలోచించాలి. ఆయీ క్త్వార్థకసంధి యెక్కడ చేస్తే హృదయంగమంగా వుండదో ఆలాటిచోట అనఁగా; "అన వలసంటిగా కెఱుఁగవా" అనే మాదిరిచోట మానవలసిందంటే; అందుకు నేనూ సమ్మతిస్తాను. ఆయీ శాసనం క్త్వార్థకసంధికేకాదు యావత్తుసంధులకూ కూడా పెట్టడం నాకు సమ్మతం. భారత సభాపర్వంలో నన్నయ్యభట్టు కొన్ని మధ్యమపురుషేకారోకారాలకు సంధి చేసిన ప్రయోగాలు కనపడతాయి. ఆచరింతె; ఉండె; వింటె, యివే అనుకోకండి యట్టి వనుకోండి.

భారతం చూచి వ్రాసేవ్రాఁత కాదిది- ఆకాశ పురాణపువ్రాఁత. కనక ఈషద్వైషమ్య మవివక్షితంగా సమన్వయించుకోఁ గోరుతాను. ఆయీ సంధి చాలభాగం సమానాచ్ఛరత్వంలో బాగుంటుంది. చూపి + ఇటు చూపిటు, కొన్ని చోట్ల అసమానాచ్ఛరత్వంలోనూ బాగుంటుంది. "ఏమనందును ముసలాపె" అని + అందును, అనందును, కాని యిక్కడ వాక సూక్ష్మాంశం వుంది. యేమిటంటే; వెనకాల ఏమి, అన్నపదం వున్నప్పుడే యీప్రయోగం హృద్యం గాని, ఆసహాయం లేకపోతే బాగుండదు. కవిత్వంచెప్పే వాళ్ళివన్నీ పెట్టుకుంటే రచన సాఁగుతుందా? యీకర్మాలన్నీ వ్యాఖ్యాతలవి. వాళ్ళపని రచన మాత్రమే. క్త్వార్థకసంధినే చేసిన రామలింగం కవిత్వంలో— "అఁకలింతయున్" వగయిరా యికార సంధు లున్నాయని చూపడం అనావశ్యకం కనక ఆగొడవ పెట్టుకోను. యింకో క్త్వార్థకసంధి చూపుతాను. "పెచ్చు పెరిఁగెట్టిదియు" పెచ్చు— పెరిగి— ఎట్టిదియు అని పదచ్ఛేదం. "సవతాలు తెలివొందె" ఇత్యాదులు కవిబ్రహ్మ ప్రయోగాలు భారతంలో చాలా వున్నాయిగదా? నన్నయ్య భట్టుకన్న "స్వతంత్రుఁడై తనదుపాండితి చూపెను" తిక్కయజ్వ, అనఁగా మనం చెప్పేది తెలుఁగుకవిత్వం కనక నూట తొంబదిపాళ్ళు తేలుఁగే వాడడం సమంజసం అని కాఁబోలు సోమయాజులుగారు తెలుఁగు నెక్కువగా వాడారు. తెలుఁగులో అపురూపమైన సమాసాలుకూడా వాడి వున్నారు. అవి దిద్దానిచోట్ల వాడడంచేత నేఁటిసంస్కర్త లిప్పటికి దిద్దలేదు.

"ఆనందపు రూపుని" శాంతిపర్వ ద్వితీయాశ్వాసంలో ఆయీ విశేషణం భగవంతునికి వాడఁబడింది. ఉపనిషత్తులలోవున్న— "ఆనందో బ్రహ్మేతి" అన్న శ్రుత్యర్థాన్ని యీవిధంగా అనువదించినట్లు తోస్తుంది. సిద్ధసమాసమైతే— "ఆనందరూపుని" అని వుండాలి. యిది యేలా కుదురుతుంది అనినేఁటివారు ప్రశ్నిస్తూన్నారు. బహువ్రీహి సమాసంచేసి సాధ్య సమాసంగా సమన్వయించాలి. ఆపక్షంలో మువర్ణకం లోపించక నిలుస్తుందా? అని శంకించేవారి శంక. లోపిస్తే సిద్ధసమాసమే అయిపోతుం

దాయె, యిక్కడ వుపపత్తి ఆలోచించాలి. కొంచెం దిద్దితే కర్మధారయ సమాసం చెప్పి సమన్వయించవచ్చునని నాకు తోస్తూవుంది. అదిద్దుఁబాటు చూపుతాను. "ఆనందపు రూపును" ఆనందాభిన్నమైన రూపు (రూపము) నామార్థయో రభేదాన్వయః, రూపం కలవాఁడంటే బహువ్రీహి చెప్పాలి గాని యిప్పుడక్కఱ లేదు. రూపత్వేన రూపించడం (తత్త్వత్వతో రభేదాధ్యవసాయః) "స రాశి రాసీ న్మహసాం మహోజ్జ్వలః, ఇతివత్" యీదిద్దుఁబాటు లోఁగడ సంస్కర్తలు చేసిన "నమ్మి పనులుగొనునది" అనే దిద్దుఁబాటువంటిది కాదు కనుక సహృదయు లంగీకరింతురని నానమ్మిక. లేదా? సరసము + పలుకులు. కలిపితే సరసపుఁ బలుకులు అయి కర్మధారయసమాసమయినట్లే అనఁగా ము విభక్తి లోపించకుండానే (సుపో ధాతుప్రాతిపదికయోః, చూ.) కర్మధారయ సమాసబిరుదాన్ని పొంది నట్లే ఆనందము రూపంగా కలవాఁడు (కలబహువ్రీహిః) అనిచెప్పి బహువ్రీహి బిరుదం దీనికియిచ్చినా తెలుఁగు భాష బాధించదు. సుబ్లోపం కర్మధారయ చెప్పినప్పు డేల రాలేదు అంటే: తెలుఁగు వైయ్యాకరణులు నీళ్ళు నమలవలసిందే. యీ మంచానికి కాళ్ళకడదిక్కూ తలగడదిక్కూ అనే యేర్పాటు ఇంతవఱ కేర్పడ లేదు. "తెలుఁగునకున్న వ్యాకరణదీపము చిన్నది" యీపద్ధతిని యేమీ దిద్దకుండానే సమన్వయ మవుతుంది. కాని దీనికి వ్యాకరణ వేత్తల సమ్మతి కావాలి. "స్థితస్య గతిశ్చింతనీయా" నాకు తోఁచినది వ్రాశాను. యిదే సిద్ధాంతం కావాలని నాకు అభినివేశం లేదు. సహృదయులు పరిశీలింతురుగాక. యీమాదిరి ప్రయోగాలు తిక్కన్నగారివి ఉగ్రపు బలులు, పేదమనుసులు, వగయిరా మఱికొన్ని వున్నట్లున్నూ చాలావత్సరాలకిందట చూచినట్లున్నూ జ్ఞాపకం. సంద్యాల స్కూలు పండితు లొకరు నిన్నమొన్న పై ప్రయోగాన్నిగూర్చి ప్రశ్నించడంచేత పనిలోపనిగా నాకు తోఁచినమాటలు కొన్ని యిక్కడ వ్రాశాను. తిక్కన్నగారు యతిస్థానంలో "అక్షోహిణీ" శబ్దాన్ని వృద్ధిరహితంగా వాడినారు. కొన్నాళ్ళు ఆయన ప్రమాదపడ్డారనుకొనేవాణ్ణి. కాదు సాధువే అని చెప్పినవారే లేరు. అలా కొన్నేళ్లు గతించాయి. యేదో వ్యాసంలో

ప్రమాదప్రయుక్తమే అని వ్రాశాను కూడాను. అంతట్లో తత్త్వబోధినీ వ్యాఖ్యానంలో ఈశబ్దంకూడా సాధువే అని సమర్థనం కనపడింది. అయితే అది సంస్కృతం కనక సమగ్రమైన శాస్త్రం దానికి వుంది. తెలుక్కో ? చేవాత్తిదీపం తప్ప గత్యంతరం లేదు. సన్నాసిపెళ్ళికి జుట్టుదగ్గిరనుంచీ యెరవే. వికారార్థమందు సంస్కృతశబ్దాల కంటే వచ్చే "మయట్ప్రత్యయాన్ని" తిక్కన్నగారు తెలుఁగులో వాడినారు. యేమీ ? ఆకవిబ్రహ్మకు యింతమాత్రం తెలియదా ? ఆమాట యెవరనఁగలరు ? శిష్టులు ఆవిధంగా వాడడాన్నిబట్టి ఆ విధంగా ప్రయోగించారన్నదే సమాధానం. సంస్కృత ప్రత్యయాల మాదిరి మత్వర్థీయ ప్రత్యయాలు గల తెలుఁగులు కొన్ని కనపడతాయి. "నల్లి" యీరూపం ఆమాదిరిదే. నల్ల అంటే రక్తం. అది కలది నల్లి. దాని శరీరమంతయు రక్తమయమే గదా ?

"నిప్పుకలు, వెలఁదుక, పొలఁతుక, ఇవి స్వార్థ క ప్రత్యయాంతములవలె నగు పడతాయి. సరే యేదో అక్షరసంధినిగూర్చి వ్రాస్తూ చాలా దూరం వచ్చాం. క్త్వార్థకసంధి బహు మహాకవిసమ్మతం కనక మనరామలింగకవి కూడా అనుమతించాఁడు గాని తెలియక ప్రయోగించలేదని సారాంశం. మనస్కరించు, అనే తిక్కన్నగారి భారతప్రయోగాన్ని గుప్తార్థ ప్రకాశిక నిరసించింది. అది నిర్దుష్టం. వ్యవహార సిద్ధం అని తెల్విడి.

"అఖమానిసాత్మ" ఇత్యాదులు (తెలుఁగికారసంధులు అఖమానిసి + ఆత్మ) చదువరులు చూచుకోండి. ఇతఁడు సంధులవిషయంలోఁ గాని యితర పదములు కూర్చడంలోఁగాని, కొంచెం పెళుసుగానే ప్రవర్తిస్తాఁడు. అందుకే అనుకుంటాను "పాండురంగవిభుని పదగుంఫనంబును" అనిమాత్రమే పేరు వచ్చిందిగాని, మృదువుగా కూరుస్తాఁడనే పేరితనికి రాలేదు. ఈవిషయ మింకాముందుముందు వివరింపఁబడును.

"వాఙ్మనోహారిణులై" ఆయీసమాసము వాగ్భిః మనోహారిణ్యః అని చెప్పుకోక స్థూలదృష్టిని కొందఱు వాక్చమనశ్చ అనివిగ్రహించుకొని అచతుర్ల సూత్రంచేత "వాఙ్మనసం" అని కావలయునని ప్రశ్నింతురు.

అయ్యాది భ్రాంతిమూలక ప్రశ్న యని తెల్పుటకే యిట నుదాహరించాను. యింకొకచోట "వాఙ్మనఃకాయ కర్మప్రవర్తనములన్" అనియున్నది. ఇక్కడకూడా పిండిలేనివారు, "వాఙ్మనస" అని కావద్దా అని శంకించడానికి అవకాశం వుంది. లోఁగడ చూపినదానికంటె యిది భ్రాంతికలిగిస్తుంది. అక్కడ వాఙ్మనశ్శబ్దాలకు ద్వంద్వం లేదు. ఇక్కడ ద్వంద్వం వుంది, కనక శంకకు పూర్తిగా అవకాశం వుంది. సమాధానం యేమిటంటే ? అచతురేత్యాదినా సంభవించే నిపాతనం వాఙ్మనశ్శబ్దాలు రెంటికి మాత్రం చేసిన ద్వంద్వానికే వర్తిస్తుందిగాని అంతకు అధికంగా యితర పదంకూడా కలిస్తే వర్తించదు. ప్రకృతంలో వాఙ్మనఃకాయ (వాక్చ మనశ్చ కాయంచ) శబ్దాలు మూడింటికీ ద్వంద్వం గనుక ఆసూత్రం దీనికి వర్తించదని తెల్విడి. ఆ యీస్థలంలో నన్ను యెవరూ శంకించలేదుగాని కొంతకాలంక్రిందట నాకే యీశంక తోఁచి చాలాకాలం నిలపలో ఉండిపోయింది. ఆరోజులలో అచ్చవుతూవున్న దేవీభాగవతంలో యీమిడిమిడిజ్ఞానం, నాల్గవస్కంధంలో "వాఙ్మనసకాయశుద్ధులకు" అని దిద్దించింది కూడాను. ఇటీవల పైనిచూపిన రహస్యం నాయంతట నాకే గోచరించిఁది. శబ్దశాస్త్రంగాని మతోశాస్త్రంగాని చదివినా తత్తద్రహస్యాలు గోచరించడానికి చాలాకాలం పడుతుంది. బాగా ఆలోచిస్తే శాస్త్రజ్ఞానం కంటె ప్రయోగ విజ్ఞానమే కవికి ముఖ్యం. కాని కేవలం ప్రయోగమాత్రశరణ్యులు వొక్కొక్కచోట చట్టన దొరకడతారు.

"శక్రాణి, చక్షుర్భ్రువము" ఇందు మొదటిది శర్వాణి అనే ప్రయోగం వుఁడిగదా ? అని చేసినప్రయోగం. లక్షణజ్ఞత్వం వుంటేనో "ఇంద్ర వరుణభవశర్వ" సూత్రంలో శక్రపదం లేదు కనక శక్రాణి (శక్రునిభార్య) తప్పు అని తెలుస్తుంది. అదేవిధంగా "చక్షుర్భ్రువము" అనుప్రయోగానికి సూత్రాధారం లేదనిన్నీ "అక్షి భ్రువము" అనేదానికి మాత్రమే "అచతుర" సూత్రం తోడ్పడుతుందనిన్నీ బోధపడుతుంది. కనక కవికి నూటికితొంభై వంతులు లక్ష్యజ్ఞానమున్నా తక్కిన పది వంతులూ లక్షణజ్ఞానమున్నూవుండడం ఆవశ్యకమని చెప్పక తప్పదు. కవి

శాస్త్రజ్ఞుఁడా కాఁడా ? అనేరహస్యం యీలాటి ప్రయోగాలు తెలియచేస్తా యని తెలివిడి. కొందఱు లక్ష్యలక్షణజ్ఞానాలు రెండున్నూ పూర్తిగా కలిగి కూడా తీరా స్వంతరచనదగ్గిఱకు వచ్చేసరికి "ఱెంకాయపిచ్చికొండ" చేస్తారు. యిందుకు ప్రథమోదాహరణం అహోబలపండితుఁడు. యీమహా కవి రచించిన కాళిందీ పరిణయం చూస్తే పైమాట స్ఫుటంగా తెలుస్తుంది. లక్షణంలో వ్రాసినదానికి భిన్నంగా యెక్కడేనా ప్రయోగించడం పాణిన్యా దులకే వుంది. అది సహ్యాం. అహోబలపతిది అట్టిది కాకపోవుటచేత ఇంతగా వ్యాఖ్యానించవలసి వచ్చింది.

"ఉరసిజాదృత వీణసరసిజానను రాణి" యీ సీసచరణం యెందుకు వుదాహరించడ మంటే ? సరసిజ సరోజ శబ్దాలు రెండూ ప్రసిద్ధాలు. చాకటి అలుక్కు, రెండు లోకంలో సమాసాలతోపాటు లుక్కు. అదే విధంగా ఉరసిజ ఉరోజ శబ్దాలలో ఉరోజానికున్న ప్రయోగబాహుళ్యం ఉరసిజ శబ్దానికి లేదనే నా అనుభూతి. యిదేవిధంగా జలేజ జలజాలు చూచుకోరాదు. యెందుచేత ? రెండూ ప్రసిద్ధాలే కనక. మఱిన్నీ జలేజ సలిలేజ పాథోజ, పాథసిజ లోనైనవి వాడుకోవడంలో ప్రసిద్ధినిబట్టి వాడు కోవడంలోనే స్వారస్యం వుంటుందని తెల్పడానికే యీవిషయం యెత్తు కున్నాను గాని లేకపోతే నచ శంకా నచోత్తరం. కాని రామలింగం పోయే పోకడ శాబ్దికంలోనేకాదు అర్థికంలోనే కాదు "మురారే స్తృతీయః పంథాః" అన్నట్టుగానే చాలాభాగం వుంటుంది. పైని చూపిన ఉరసిజ ప్రయోగం దానిలో చేరిందే. యెన్నో యింకా వున్నాయి. "మరాళ దంతావళ శిఖావళ" అంటూ రాధికాగమనమునకు ఉపమానకోటిని యేకరు పెట్టి వున్నాఁడు. ఇవన్నీ శాంతాలుగా వుండడంచేత సమాసగ్రథనం చక్కగా కుదిరింది గాని యీత్రయంలో శిఖావళాన్ని (నెమలిని స్త్రీగమ నానికి వుపమానంగా నేను చూచినంతలో యిప్పటికి కనపడ లేదు. నహి సర్వస్సర్వం విజానాతి. యిక్కడనే కాదు. యింకొకచోటకూడా యీవుప మానం రామలింగం వాడివున్నాఁడు. "మ. గతిమధ్యస్తన .... బర్హిమృ గేంద్ర" (3 ఆ. 86 వ పద్యం చూ.) కనక పూర్వు లెవరో వాడే వుంటారు.

"నన్నుఁ గన్నమీఁ దమ్మఱియున్ భయమ్మ" యిక్కడ నన్నయ్యభట్టు ప్రాసలో నకారం మకారంచేసిన ప్రయోగాన్ని ఆధారంగా చేసి ప్రయోగించినట్లు స్పష్టం. ద్విత్వాక్షర ప్రాసలలో నొక్కొక్కచోట నొక యక్షరాన్ని వదలికూడా మహాకవులు వాడి వున్నారు. ఆముక్తమాల్యదలో కాఁబోలును— "తత్క్షణ" అనేపదం ప్రాసలో పెట్టి తకారశూన్యమైన క్షకారంతో ప్రాస చెల్లించినపద్యం చూచినట్లు జ్ఞాపకం. "వాక్త్రినేత్రాంగవా" అనేపద్యంలో శ్రీనాథుఁడు రేఫవిరహితంగా శక్తులు అని ప్రయోగించి ప్రాసయతి చెల్లించినట్లు అప్పకవి వుదాహరించే వున్నాఁడు. అతఁడే "నాతో మార్కొనలేరు" అని యెత్తుకొన్న పద్యంలో నాలుగవచరణంలో "ఈత్రైలోక్యమునందు" అని వాడినాఁడు. నన్నయ్యగారు— "క్షత్రియవంశ్యులై" అని ప్రారంభించిన పద్యంలో నాల్గోచరణంలో "మాంధాతృరఘుక్షితీశులు" అని వాడినారు. దాన్నిబట్టి ఆయీ రేఫవిరహిత ప్రాసములు సమాహితాలు కావు. యేమంటే ఋకారం అకారాదులవంటి అచ్చు కాదు. ఋకారంలో రేఫకూడా శ్రితమవుతూవుంది. భాష్యకారులు "ఋకారస్యతు మధ్యే ద్వౌ రేఫౌ" అని వ్యాకరించడంవల్లకూడా ఋకారంలో రేఫ దాఁగి వున్నట్లు స్పష్టం. నన్నయ్యగారు ఆయీరహస్యం యెఱిఁగి ఆవిధంగా వాడి వుందురు. కాని పిమ్మటి మహాకవులు మఱికొంత సాహసించి, "ఈషద్వైషమ్య మవివక్షితం"గా ప్రాసవిషయంలో ప్రవర్తిస్తూ వచ్చారు. యేదో "అలంకారార్థ మక్షతైః పూజయామి" అన్నట్టుగా పుట్టిన యీయతిప్రాసలవిషయంలో చూచీచూడనట్లు పోవడమే యుక్తం గాని విశేషించి పట్టుపట్టి యీస్వల్పానికి యెంతటి మహాకవినేనా "తోఁటకూరలో పురుగుమాదిరిని" యీసడించడానికి సహృదయులు సమ్మతించరని నే ననుకుంటాను. ఋకారానికి తెలుఁగులో అచ్చుత్వమేలేనట్టు శంభుదాసుని ప్రయోగం "ఋక్షవానరవీరుల్" అనేది తెల్పుతూ వుంది. ఇంతే కాదు. "క. ఆఋషికొమ్మరుఁడు గట్టిన, చీరలు" అనే ప్రయోగంకూడా కేవలం రేఫవంటిదే తెలుఁగులో ఋకారం అని బోధిస్తూవుంది. కాని "ఋత్విజుండని విచారించి పూజించితే" అనే నన్నయ్యగారి ప్రయోగం

వల్ల కొంత అర్థ్వంకూడా వున్నట్లు తెలుస్తూవుంది. యేదో ప్రయోగాను సారంగా ప్రవర్తించవలసిందే కాని యీయతిప్రాసల విషయంలో నిష్కర్షించి లక్షణం చెప్పడం కుదరదు. రేఫ శకటరేఫలవిషయంలో నిన్నమొన్నటిదాఁకా యెంతో పట్టుదల వుండేది. అది యిప్పుడు వదలింది. సంస్కృతంలో లింగవిషయం యేలాటిదో, తెలుఁగులో యతిప్రాసలవిషయం ఆలాటిది. భాష్యకారులు "లింగ మశిష్యం లోకాశ్రయత్వా ల్లింగస్య" అని వూరుకున్నారు. దీన్నిగూర్చి వివరింపవలసివస్తే చాలా వ్రాయాలి. యెప్పుడో విద్యార్థిదశలో "కవీనాం కాముకానాం చలింగబాధా సమాస్మృతా" అని నేను హేలగా అన్నట్టు జ్ఞాపకం. ఉత్తరార్థం జ్ఞాపకంరాలేదు సమయానికి; కాని అర్థంజ్ఞాపకం వుంది. యీవుభయమున్నూ క్రోశంవల్ల నివర్తిస్తుంది అనే అర్థం కలిగి వుంటుంది వుత్తరార్థం. "తాడన వేగంబున భగ్నమయ్యెఁ గటి వేల్ల త్ఫుల్లకాశిక్యమున్"యీపద్య చరణంలో ల డ ల కు విశ్రమం స్పష్టంగా కనపడుతూవుంది."లడయో రభేదః."అని వ్యాఖ్యాతలందఱూ యేకవాక్యతగా అంగీకరించారు. ల డ ల కేకాక, వ బ లకు, శ స లకు, ర ల లకు, అభేదం సకలపండిత సమ్మతం. ఆయీరహస్యం అప్పకవి యెఱిఁగినవాఁడే. కాని యెందుకో ల డ లకు యతి చెల్లదన్నాఁడు. రామలింగమంతటి మహాకవి తనకు కొన్ని శతాబ్దాలకు ముందున్నవాఁడు ప్రయోగించాఁడన్నమాట అతనికి తెలిసినట్టు లేదు. బహుశః అతనికి పాండురంగమాహాత్మ్యం దొరక లేదనుకుంటాను. అతఁడు రామలింగని పద్యాలు వుదాహరించినట్లు లేదు. అందుచేతనే "లలితవీణారవంబుతో డక్కసరియె" అని యేసామాన్యకవిదో ప్రయోగం పూర్వలాక్షణికు లిచ్చింది చూపి ఖండించి వున్నాఁడు. రామలింగం ప్రయోగించినట్టు తెలిస్తే తప్పనడానికి అప్పకవి కెన్నివేలగుండె లున్నాయి? యీలాటివి అప్పకవీయంలో సవరించతగ్గవి యెన్నో వున్నాయి. "ఉ. ఆసతిఁబల్కు....మునీశ్వరా ఖ్యాశదురాసదంబగు మదాకృతి." ఈ శస ప్రాసకూడా అప్పకవి తోసివేశాఁడు. అప్రశస్తప్రాసలలో జమకట్టి ఆంధ్రకవిలోకానికి అపకారం చేశాఁడు. ఇటీవల యేపద్యానికి ఆపద్యంగా అచ్చువేసిన భారతంలో దిద్ది వున్నారు

గాని పూర్వపు అచ్చు ప్రతులలో "చతుర్దసుల నుభయపక్షవశత వచ్చు" అని తిక్కన్నగారి ప్రయోగం కనపడుతూ వుంది. కవిబ్రహ్మ ప్రయోగాన్ననుసరించి రామలింగమే కాదు యింకా యెందఱో యీశసప్రాసము వాడుకొన్నారు. యిప్పు డా ప్రయోగాలగతి అధోగతి కావలసి వచ్చింది. శాంతం పాపం.

"గట్టిగా వినుమధిపా!" గట్టిగా అంటే ఇక్కడ ఎక్కువ శ్రద్ధగా అని అర్థం చెప్పి తీరాలి. ఆయీ అర్థం వ్యావహారికంవల్ల రావలసిందేగాని అన్యధా రాదు. "కఠిన" శబ్దాన్నిగూర్చి భారతంలో తిక్కన్నగారు ప్రయోగించినదాన్ని వ్యాఖ్యానిస్తూ చాలావత్సరాలనాఁడు అన్యత్ర చాలావిస్తరించాను. అందుచేత యిచ్చట స్పృశించి విడుస్తూన్నాను. మాతృభాషలో కవిత్వం చెప్పేటప్పుడు తఱచు లోకవ్యవహారానుసరణమే శరణ్యం.

"సరిపోయెన్" అని యీరామలింగం లాక్షణికంగా సమాప్త్యర్థబోధకంగా ప్రయోగించాఁడు. ఆరెండుశబ్దాలున్నూ కలిసినప్పుడు పసపూ సున్నమున్నూ కలిపి పారాణిగా మాఱినట్లు ఆవిధమైన అర్థాన్ని యిస్తాయి. నిదుర అనే శబ్దానికి పోవు ధాతువుతో సంబంధం కల్పితే విద్రను అనుభవించుచున్నాఁడు అనే అర్థం వస్తుంది. యేభాషలో యిట్టి అర్థం వస్తుందంటే తెలుఁగులోనే. తెలుఁగులో వస్తుంది గదా అని తత్తుల్యములైన సంస్కృతపదాలు కల్పితే అట్టి అర్థం వస్తుందేమో! అంటే, రాదు. అది భాషాస్వభావంవల్లనే రావలసినది. యీలాటి ప్రయోగమే "పూజ్యముల్" అనేది వొకటి వుంది. దీనికి సంస్కృతభాషలో వున్న అర్థం పూర్తిగా వదలుకొని అభావం చెప్పుకుంటేకాని కుదరదు. యీ అభావార్థకత్వం జ్యోతిషం (త్యాజ్యం పూజ్యంచూ.) కనపడుతుంది. ఇవన్నీ "వ్యవహారతశ్చ" అనే దానిచేత సాధింపవలసినవే. శాబ్దబోధోపకరణములు వ్యాకరణోపమానకోశాదులు పెక్కులున్నను వ్యవహారమనేది వాటినన్నిటినీ తలదాఁటుతుందన్నందుకు ఏన్నో దృష్టాంతములు చూపవచ్చును. మేఘసందేశంలో "ఘానశ్యామాన్" అని మన ఆంధ్రలిపిలో వున్న పాఠం

వ్యవహారం బలీయమవడంచేత మార్చిందే. నాగర లిపిలో చూస్తే "శష్ప శ్యామాన్" అనే వుంటుంది. రామలింగం కవిత్వంలో నాకుఁ బోదు, తనకుఁ బోదు వగయిరా లెన్నో వ్యవహారసాధ్యప్రయోగాలు కనపడతాయి. శాస్త్రతః మంచి అర్థం యిచ్చే పదమైనా అది వ్యవహారంలో దురర్థం యిచ్చేదే అయితే కవి ఆపదాన్ని వదలుకోవలసిందేగాని కవి నివసించే ప్రదేశాన్ని బట్టి ఆయీ వ్యవస్థ చేయవలసి వుంటుంది. నన్నయ్యభట్టు "మఱవ కను ష్ఠించునది" అని ప్రయోగించాఁడు. ఆయీ ధాతువునకు నేఁడు గోదా వరీమండలములో సదర్థం లేదు. ప్రజాపతిశబ్దానికూడా దురర్థం గోదా వరీమండలమందు కలదు. నన్నయ్య నాఁటికి వుందో లేదో ఆలాటి అర్థం యిప్పుడు మనకేలా తెలుస్తుంది. ఆయన దీన్నిన్నీ (ప్రజాపతి) ప్రయోగించాఁడు. "వాఱనఁ జూచి కౌరవనృపాలుఁడు" ఆయీ ప్రయో గం తిక్కన్నగారిది. నన్నయ్య కవిత్వంలోకూడా వుండే వుంటుంది. వాకరేమిటి? మహాకవులందఱూ దీన్ని వాడే వున్నారు. ప్రాచీనలక్షణ గ్రంథాలలో- "సాధన" శబ్దానికి దురర్థప్రతిపాదక మనే హేతువుచేత నిషేధం ప్రతిపాదించారు. లోఁగడ నేను చూపినశబ్దాల దురర్థం సామా న్యులకు గోచరిస్తుంది. కాని సాధనశబ్దనిష్ఠమైన దురర్థం విఘంటు సహా యంలేనిదే గోచరించదు. పూర్వకాలంలో అట్లుకాదేమో! మెదకు దొరల్ ప్రపతులమీఁది పొరల్, అంటూ వాకకవి నైజాంరాష్ట్రంలో వుండే మెదకుపట్టణపరిపాలకులను తిట్టివుండడంవల్ల ఆశబ్దం దురర్థాపాదక మని వేఱే చెప్పనక్కఱ లేదు. కాని వాకమండలంలో యేదో అర్థం యిచ్చే పదం యింకో మండలంలో అట్టిది కాకపోవడమున్నూ వుంది. గద్వాలప్రాంతంలో "చీకటీఁగలు" అని వాడతారు దోమలనడానికి. మండల భేదాలనిపట్టి యీలాటి సందర్భాలు చాలా వున్నాయి. "గర్భా ధానానికి" గోదావరీమండలంలో కొంత గోప్యంగా వుంటుందని పునస్సం ధానమని కాని శోభనమని కాని వాడతారు. నైజాంలో "ప్రయోజన" మని వాడతారు. అద్దికానికి "తిథిప్రయోజన" మని గోదావరీ ప్రాం తంలో వాడుక వుండడంచేత పరమశుభప్రదమైన దాంపత్య మహోత్స

వాన్ని అమాంగళికమైన పదంతో వాడడానికి సమ్మతింపరని వ్రాయ నక్కఱలేదు. ఆయీచర్చ "పూజ్యముల్" అనే రామలింగంగారి ప్రయోగాన్ని పట్టి ప్రసక్తమయింది. గ్రాంధికంగా ఆయీ పదానికి అభావార్థకత్వం లేకపోయినా వ్యవహారంలో వుండడంచేత శిరసావహించక తప్పదు. కొన్ని స్థలాల్లో పూజ్యశబ్దానికి అభావార్థకత్వం చెప్పడంవల్ల అసలు దానికి వున్న అర్థం పోతుందని పొరఁబడరాదు. అదీ వుంటుంది. ఆ అర్థం చెప్పేచోట యీఅర్థమున్నా ఇది చెప్పేచోట అదిన్నీ చెప్పి లేనిపోని శంకలు చేయడం సహృదయ సమ్మతం కాదు. సంస్కృతంలో లేని అర్థాలు తెలుఁగులో వస్తాయి. శోభనం (గర్భాధానం) వగయిరాలు ఆయీ సందర్భానికి వుదాహరణం. కృష్ణరాయలు ఆముక్త మాల్యదలో "దర్భపోటు" అని వ్యావహారికంలో వున్న ఆభ్దికార్థంలో ప్రయోగించాఁడు. యింకా యీలాటివెన్నో వున్నాయి. 1. మొదలనుండియు నీవు దామోదరుఁడవె 2. సామ్రాజ్యవధూటి చేరఁజనునే? నిర్భాగ్యదామోదరున్.

నిక్షేపంవంటి దామోదర శబ్దానికి (దామ = వనమాలా, ఉదరే. యస్య) పట్టిన దుర్గతి చూస్తే వ్యావహారికానికి వున్న బలం తెల్లమవుతుంది. యింతదాఁకా యెందుకు? "ఇంద్రాణీవాఽవిధవా" అనే వైదిక పరిభాషను పట్టి చెడిపోయిన ఇంద్రాణి పదాన్ని ఆశీర్వచనాదులలో వాడడం సంశయగ్రస్తమే. యావల్లోకమూ కాకపోయినా ఛాందసలోకం ఆపదానికి అమంగళార్థాన్ని వాడుతూన్నప్పుడు తద్ద్వారాగా విన్నవారు శంకించకపోరు. శాస్త్రజ్ఞులపరిభాషలలోకూడా (శశ్ఛోటి. కశ్చన) లోనైనవి వున్నాయి. ఇవన్నీ భాషాకవిత్వాలలో నిరాఘాటంగా వాడుకోవలసినవే. "రాజై పుట్టుట రశ్మిమాత్రఫలమే" ఆయీ వసుచరిత్రలోని రశ్మికి కిరణార్థకత్వమేగాని సంస్కృతంలో లాభా (రాఁబడి) ర్థకత్వమున్నట్లు నే నిప్పటికి చూడలేదు. వ్యాఖ్యాతైనా వుంటే నిఘంటు వుదాహరించేవాఁడు. వూరికే అర్థద్వయమున్నా వ్రాసి వూరుకున్నాఁడు. పోనీ, ఆ"రశ్మి" లాభార్థకమైనప్పుడు తెలుఁగుపదమనుకుందామా? ఆపద్ధతిని సిద్ధసమాస ఘటితం కాకూడదు. ఉభయార్థాలయందు సంస్కృత పదమే అయితీరాలి.

రెండుభాషలకూ అవకాశం వుండడంచేత తెలుఁగుకవిత్వానికే యెక్కువ చిక్కు. కేవల సంస్కృతకవిత్వానికైతే యింత చిక్కు లేదు. ఆ భాషలో చక్కని ప్రవేశం వుంటే సరిపోతుంది. "ఇద్దానికో? రెంటఁ దగుల వలయు" అని (పాణిగృహీత చూ) వ్రాయడాని క్కారణం సహృదయు లకు గోచరమే కనుక యీచర్చ యింతతో ఆఁపుతాను.

---

# యెంకిపాటలను గూర్చి

## 1

నేను ఈమధ్య చెన్నపురికి వెళ్ళినపుడు గ్రంధకర్తగారిని సందర్శించినాను. నాకుఁ గల సంశయములను గూర్చి వారితో మనవి చేసికొంటిని. వారు ఈపాటలను సమర్ధింపఁ గలవారుగా నాకు తోఁచలేదు. పిమ్మట ఈ పాటలకు పీఠిక వ్రాసిన బ్ర॥ శ్రీ॥ ఆదినారాయణశాస్త్రిల వారిని సందర్శించికొన్నాను. నా సంశయములను మనవి చేసికొంటిని. వారును తమ ఉపోద్ఘాతమును సమర్ధింపఁ బ్రియత్నింపరైరి. ఇటులుండఁగా 6 మార్చి 1926 సం॥ కృష్ణలో విశ్వనాధ వెంకటేశ్వర్లుగారు పైపాటలను సమర్ధించుచు వజ్రాయుధమును ఖండించుచు వ్రాసిన వ్రాఁతను నేఁడు చదివితిని. ఆ సమర్ధనమునకు సంతోషించుచున్నాను. ఏమనఁగా గ్రంధకర్త సమర్థింపలేకున్నను ఉపోద్ఘాతకర్త తూష్ణీంభావమును వహించినను వీరు దానిని సమర్ధించుట కడుంగడు శ్లాఘనీయముకదా? అదిగాక సమర్థన మన్నప్పుడు గ్రంధకర్తల నెత్తిమీఁదనే యుండదు. కావుననే

"శ్లో. కవిః కరోతి కావ్యాని లాలయత్యుత్తమో జనః
తరుః ప్రసూతే పుష్పాణి మరు ద్వహతి సౌరభం."

అని పెద్దలు వక్కాణించి యున్నారు. నేను గూడ పైపాటలను మెచ్చుకొనువాఁడనే కాని నా మెచ్చునకును వీరి మెచ్చునకును జాలభేదము

కలదు. అధికారి నిర్ణయములో మే మిరువురమును భిన్నాభిప్రాయుల మగుచున్నారము. ఇదియిటులుంచి ప్రస్తుత సమర్ధకు లుదాహరించిన ప్రమాణోక్తు లనఁగా— "ఒక్క శబ్దంయొక్క అర్థాన్ని సరీగ్గా గ్రహించి దాన్ని సరీగ్గా ప్రయోగిస్తే యిహపరసౌఖ్యాలు కలుగుతా యన్నాడు విశ్వనాధకవిరాజు" అను నర్థముగల ప్రమాణోక్తిని ప్రకటించిన విశ్వనాధ కవిరాజు మాటలను ఉదాహరింపవలసిన దనియుఁ బిమ్మట మీతో నేకీభవించుటయో ! విడిపోవుటయో ! నిశ్చయించికొని వెంటనే ఆ యంశమును పత్రికా మూలమునఁ బ్రకటించుకొందు ననియు మనవి చేసికొనుచున్నాఁడను. మఱియు—

"........జననాంతర సౌహృదాలు మనసునకు తగిలి సుఖిమైన మనుజుడుగూడా పర్యుత్సుకు డౌతా డని కాళిదా సన్నాడు"

ఈ యర్థము నిచ్చెడి కాళిదాసుని వాక్యములను గూడ నుదాహరింపఁ గోరెదను. పిమ్మట వీరు చూపిన యభియుక్తోక్తులను ప్రస్తుత సందర్భమునకును "కుర్వీత బుధసోమయోః" అన్నట్లుండునో లేక సరిగా లగించునో ? విచారించి నా శక్తివంచనలేక ప్రస్తుతమును గూర్చి చర్చించి యేదో మతములోఁ జేరఁదలఁచి యీ అక్కరములను లిఖించితిని.

## 2

### "సహసా విదధీత న క్రియాం"

అయ్యా ? నా వ్యాసములో మీకు సమాధానము వ్రాయవలసిన వాక్యమేలేదా ? అక్కటా ? నేనేమి మనవిచేయుదును. ప్రతిపర్ణమును సమాధానమిచ్చి తీరవలసినవియే. పోనిండు, తుదకు విశ్వనాధకవిరాజు గారి వాక్యమును మీరు ప్రమాణముగా పట్టియున్నారు కదా. వారి వాక్యమునకు మీరు వ్రాసిన నవీనభాషా వ్యాఖ్యానమేల. వా రేయక్షరములను వ్రాసియున్నారో ఆయక్షరములనే లిఖింపుఁడు. ఆపిమ్మట నేను వ్రాయ

వలసిన యక్షరములను వ్రాయుమను. మనము నిజము కనుగొనుటకు యత్నింతము. నిజముగా మన ప్రాచీనులకు, ఇట్టి పాటలయెడల, ఇట్టి పాత్రముల యెడల, ఇట్టిభాష యెడల సమ్మతియే యున్నచో మనకు మాత్ర మట్టి సమ్మతి యేల యుండదు. దయచేసి తాము కనిపెట్టిన ఆ యమూల్యమైన ప్రమాణమును ఉన్నది యున్నట్టులు లిఖింపుడు. చిత్తగింపుడు.

## 3

శ్రీ వెంకటేశ్వర్లుగారు నాకోరికమీద నెట్టకేలకు విశ్వనాధకవిరాజు గారి వాక్యమును, కాళిదాసుని శాకుంతల శ్లోకమును గూడ నుదాహరించిరి. శాకుంతల శ్లోకము ప్రస్తుతమున కుపకరింప దని వారే యొప్పుకొన్నారు. కాని విశ్వనాధుని వాక్య ముపకరించు ననుకొని దానిపైఁ బ్రాచీనుల వ్యాఖ్యానపు బంక్తుల నుదాహరించి వాని మూలమునఁ దా మిది వఱలో వ్రాసిన— "ఒక్క శబ్దం యొక్క అర్థాన్ని సరీగ్గా" గ్రహించుటను గూర్చి విస్తరించినారు. విశ్వనాధకవిరాజ్ ఈ యర్థమును మహాభాష్యము నుండి సంగ్రహించి యున్న మాటను దెలియ నేరక యిది వేదవాక్య మని వ్రాసినారు. అది వారు తెలియక వ్రాసినను భాష్యము కన్నను వేదము పరమ ప్రమాణము గనుక ప్రస్తుతము విప్రతిపత్తి కలుగ నేరదు. వారట్లు పొరఁబడుటకుఁ గారణము కలదు. అవసర మైనపుడు దానిని విస్తరింపఁ దలఁచి ప్రస్తుత ముపేక్షించుచున్నాను. భాష్యకర్త యీ వాక్యము నే సందర్భమున లిఖించెనో మన కిట ముఖ్యముగా విస్తరింపవలసి యున్నది. కాని యట్లు విస్తరించినచోఁ జదువరులకు విసువు గలుగును. కాన సజ్జోలికిఁ గూడఁ బోక భాష్యకారుని "ఏకశ్శబ్దః" అనువాక్యమును గైకొని వ్యాఖ్యాన మొనర్చిన విశ్వనాధకవిరాజు తాత్పర్యము ప్రస్తుతకవిత్వమునకు లేశమును సమన్వయింపదని తెలుపుచున్నాను. ప్రాకృత కావ్యములపేళ్ళు కొన్ని యుదాహరించి తన్మూలమునఁ బ్రస్తుతమును వేంకటేశ్వర్లుగారు సమర్థింపఁ గడంగిరి. ఆభాషలకును బ్రస్తు

తమునకును లేశమును సంబంధము లేదు. కావున నదియును సాహస మాత్రమే ఇఁక

"శ్రీశాస్త్రిలవారి వంటివారు సుముఖులైతే లక్షణగ్రంధాలు చెప్పిన మాట వినవా?"

"మన అంధ్రవైయాకరణులు పాణిని పతంజలుల వంటివాళ్లైతే మన తెలుఁగుభాష ప్రకృతి అయితే యీ యెంకిపాటలలో వుండే భాషల వంటి భాషలు తత్సమాలు, తద్భవాలు దేశ్యాలు అవుతాయి"

ఈరెండు వాక్యములును బ్రస్తుతమున కుజ్జీపకములుగా నున్నవి. కాని యిట్టి ప్రయత్నమున కిదివఱకే కవులు గాని యేల పూనుకోలేదో విచార్యము. ఇపుడేల మనము పూనుకోరాదు? పూనుకొంటిమే యను కొందము. యెంకి నాయుడుబావల క్రీడాసల్లాపములను బట్టి వారిరువురను నికృష్టజాతి మిధునముగాఁ జూపట్టుచున్నారుగదా? అట్టిమిథునమును గవి వర్ణించినపు డౌచితికై కదా యీ యపభ్రంశభాషను గైకొని దానినిఁ బోషించి యున్నాఁడు. తచ్చరిత్రను బఠించువారు వేర్చికోఁ దగిననీతి యెట్టిది యగునో రసజ్ఞులకుఁ దెలియదా? కావ్యమున నాయకుఁడుగా నుండఁదగిన పూరుషుఁ డెట్టి మహానుభావుఁడుగా నుండవలయునో నే నిట విస్తరించి గ్రంథము నేల పెంచవలయును? ఇది సర్వవిదితము. అది యటులుంతము. నే నిదివఱలో "అధికారి నిర్ణయములో మే మిరువుర మును భిన్నాభిప్రాయుల మగుచున్నారము." అని వ్రాసియున్నాఁడను. అధికారి పదమునకు వేంకటేశ్వర్లుగారు "అబ్రవీత్పురాణార్థమును" వ్రాసి యున్నారు. అధికారి యనఁగా, అనుబంధ చతుష్టయములో నొకఁడు. ప్రతి గ్రంధారంభమునకును అనుబంధ చతుష్టయ ముండి తీరవలెను. ఈ విషయము బందరులోని పండితుల నడిగి వారు తెలిసికొందు రని నే నిట విస్తరింపక విడిచితిని. ప్రస్తుత మధికారి యనఁగా? ఈ యెంకి పాటలను చదివి యానందింపఁ దగినవా రెవరు? పదపలు లాగుకొను వారు, ఏతము తోడుకొను వారు, నాటు నాటుకొను వారు, లోనగు వారు.

వీరు తఱచు నికృష్టజాతులకుఁ జేరినవారే. వీరు గ్రంథములలో నాయకత్వమును గైకొనఁ దగినంత కాదు గదా కొంత యేని నాగరికత కలవారుగాఁ జూపట్టుట యరుదు. అట్టి నాగరికత యెట్టకేలకు లభించు నెడల నిట్టి భాషను మాటాడరు. వేయేల? "నీ భార్యపే రెవరనిన—యెంకి" అనియే కాని వెంకి యని కూడఁ బ్రత్యుత్తర మిచ్చుటకు నోరు తిరుగని నాయఁడుబావ నాయకుఁడా? ఔచిత్య పోషణమునకుఁ గవిత్వ మెల్లఁ దజ్జాతీయ మగు నపభ్రంశ వాఙ్మయమా? దానిని సమర్థించుటకై మహామహు లగు లాక్షణికాగ్రగణ్యులను రంగస్థలమున కీడ్చుటా? వారి వాక్యములకును, వారి వ్యాఖ్యానములకును దోఁచినట్లుగా నర్థ తాత్పర్యములు లిఖించుటా? ఔరా! సాహసము. ఇదివఱ కీయెంకిపాటల వంటి పాటలే లేవా? పాడువారే లేరా? వినువారలు లేరా? ఆనందించు వారలు లేరా? ఇందఱును నుండిరి కాని యిట్లు సమర్థింపఁ బూనువారు మాత్రము లేరు. ఇవి యెక్కడ నుండవలయునో అక్కడనే యుండెడివి కాని ఇపుడు ముద్రాయంత్ర కారణమున సర్వత్ర సంచరింప వీలు కలిగి. శ్వపచులకు రైలు వలనఁ గొంత యస్పృశ్యత తొలఁగినట్లే యివియును దమ యస్పృశ్యతను మెల్లమెల్లన వీడుచున్నవి.

"చ. మనువు మహాకవీంద్రులు సమున్నతరీతి నొనర్చు కబ్బముల్
వినుతికి నెక్కెఁగాని యవివేకుల కూఁతలు తాటియాకులం
దునె నశియించె నోటఁబడు తుంపురులేనియు నిప్పు డచ్చువ
చ్చినకతనన్ జగాన విలసిల్లెడి మేటి కృతుల్ నశించెడిన్."

దాని నటులుంతము—

"యన్నింబానాం పరిణతఫలస్ఫీతి రాస్వాదనీయా
యచ్చైతస్యాః కబళనవిధౌ కోవిదః కాకలోకః"

అని పండితరాయ మహాకవి వ్రాసి యున్నాఁడు. వేపపండ్లు తినఁగలిగినవియే యైనచోఁ దినుటకుఁ గాకవులను భగవంతుఁడు వానితో పాటు సృష్టించియే యున్నాఁడని దాని తాత్పర్యము. అగుచోఁ బండితు

లగు బ్రి॥ శ్రీ॥ ఆదినారాయణ శాస్త్రిల వారేల పీఠిక వ్రాసిరో విజ్ఞు లగు వేంకటేశ్వర్లుగారేల మెచ్చుకొనుచున్నారో, తెలుపవలసి యున్నది. శాస్త్రిలవారు వారి హృదయమును మెల్లగ జారవిడిచినారు. చూడుఁడు.

"అందుఁ గల భాష కొంచె మంత తక్కువ శాఖకు చెందిన దన్నంత మాత్రమును పురస్కరించికొని"

ఈ వాక్యమును బట్టి శాస్త్రిలవారి కీ భాషయందలి గౌరవము స్పష్ట మగుచునే యున్నదికదా, మఱియు నీ వాక్యమును వారెంతో జాగ్రత్తగా వ్రాసియున్నారు కాని యేమైనను ఇందు—— కొంచెము అనునది తీసి వేయక తప్పదు. యెంకిపాటలలోని భాష పూర్తిగా నపభ్రంశమేకదా ? శాస్త్రిలవారి యాశయము క్షేత్రయ్య పదములు. లోనగు పదకవిత్వము లలోఁ గూడ నక్కడక్కడ గ్రామ్యపదములున్నవి. ఉన్నను వానిని రసజ్ఞు లాదరించుచున్నారు. ఇందంతకన్న నెక్కుడుగా గ్రామ్యపదము లున్నవనుకొనుఁడు, లేదా సర్వమును గ్రామ్యభాషా మయమే యను కొనుఁడు. అయినను రసము చిప్పిలు చుంటచే వీనియెడల బండితులం దఱును బరమాదరమును జూపవలయు నని పొడకట్టుచున్నది. వీరింకను రస స్వరూపమును విస్తరించి లోకమునకు బోధించి దాని కీపాటలను బ్రిథమోదాహరణముగ సమన్వయించు నంత పూనికతో నున్నట్లు వారి వ్రాఁతలోని యక్షరముల వలన ధ్వనించుచున్నది. నిజముగా శాస్త్రిల వారు రసస్వరూపవిదులే యైన యెడలఁ బ్రిస్తుతమగు శృంగార రసమున కాలంబన విభావ సామగ్రియగు యెంకి నాయఁడుబావల యందు, లాక్ష ణికులు వ్రాసిన మహాకులీనత్వాదిసంపత్తి నెట్లు సమర్థింపఁగలరో చూచి యానందింపవలె నని యున్నది. పూర్ణసామగ్రి రామాదులయందుఁ గూడ దొరకకపోవచ్చును. అట్లని సర్వశూన్యముగ నాలంబనవిభావమును గైకొని వితండవాద మొనర్చు టిదియేటి సహృదయత్వము ?

"సాక్షరా విపరీతాశ్చే ద్రాక్షసా ఏవ కేవలమ్"

కొంద ఱీయెంకి స్వీయయా ? పరకీయయా ? సామాన్యయా? యని వాదోపవాదము లొనర్చుచున్నారు. నే నీచర్చకు సమ్మతింపను.

యెంకి మహా పతివ్రతాశిరోమణి. నాయఁడుబావ యేకపత్నీవ్రతుఁడు, అగుచో లాభమేమి? వారలయెడఁ గవి యుపయోగించిన భాష వారి నథోగతి కీడ్చుచున్నది. "చండాలు వాకిట వండుకొన్నది యంబలాయెనే మతిరసా లాయెనేమి" మంచిభాషలో నుత్తమనాయికానాయకుల నధికరించి వ్రాసియైనను రసము స్ఫురింపఁజేయనికవులకవనములు మాత్రము గ్రాహ్యములా? యని పైవాక్యములలో నక్కడక్కడ ధ్వనించుచున్నది. నిస్సంశయముగా నవియును గ్రాహ్యములు కావు గాని ఈకవికిని వారికిని జాలభేదము కలదు. వారు

"శ్లో. స్పృహణీయగుణై ర్మహాత్మభి
శ్చరితే వర్త్మని యచ్ఛతాం మనః
విధిహేతు రహేతు రాగసాం
వినిపాతోపి సమ స్సమున్నతేః"

అను భారవి కవీంద్రుని వాక్యమున కుదాహరణమై యిపుడు కొంత సన్మానమునకుఁ దగి జన్మాంతరము నందేని యుత్తమకవిత్వ రచనా సమర్థులై కృతార్థత నందగలరు గాని ప్రస్తుత కావ్యకర్తకుఁ గల్గిన యూహయే నికృష్టమగుటచేత ముందుఁగూడ నీయన కవనమున కౌన్నత్యము కలుగదేమో యని విచారింపవలసియున్నది. ఆదినారాయణ శాస్త్రిలవారు లోనగు వారిందు రసము సాధింతుమని యనుచున్నను ఖాత్రములను బట్టి యిట సర్వథా రసాభాసమే నాకు గోచరించుచున్నది.

"తిర్యఙ్మ్లేచ్ఛగతోపివా" మ్లేచ్ఛ, అవ్యక్తేశబ్దే, మ్లేచ్ఛులనగా సర్వసామాన్యముగా మనవారు వ్యవహరించుచున్న తురుష్కులు మాత్రమే కారు. అవ్యక్తమగు భాషను మాటలాడు ననాగరికు లెల్లరును. అగుచో సంస్కృతేతర భాషలన్నియు మ్లేచ్ఛ భాషలే కావలయును. సందేహమేమి? మ్లేచ్ఛభాషలే! అగుచో నన్నయ తిక్కనాదుల కెల్లరకును నీ దోషము సమన్వయించు చున్నదే? నిక్కముగా సమన్వయించును. అగుచోగతి యేమి? ఇదియే గతి. ఏది యందురా? సంస్కృతభాషలో బలె వ్యాకర

ణాది సంస్కారములకు లోఁగి రచియించినచో దానిని బ్రాహ్మణులు సమ్మ తించిరి. అక్కడికిని గొందఱు కేవల గీర్వాణ భాషాభిమానులు సమ్మతిం పనే లేదు. చూడుఁడు.

"శ్లో. ఆంధ్రభాషామయం కావ్య మయోమయ విభూషణం
గీర్వాణారణ్య సంచారి విద్వన్మత్తేభ శృంఖలమ్."

ఇట్టి వివాదములకుఁ గారణమేమి? మన నిర్దుష్టాంధ్రముకూడ విజ్ఞులకు మ్లేచ్ఛ భాషగా గనుపట్టుటయే. దీనింబట్టియే యిప్పటి కింకను ఈ భాషకు సమగ్రమగు కట్టుబాటు లేర్పడలేదు. అక్కాలమునసే ప్రాచీన మహాకవి ప్రయోగరహస్యముల నెఱుఁగని కొందఱు పిన్నలు సుప్రయో గముల నప్రయోగములని యపలపించుటయు నట్టిపట్టున వెంకటశాస్త్రి గారు పూర్వ ప్రయోగ రహస్యములను దెల్పి స్వకవిత్వమును సమ ర్థించు కొనుటయు, అట్టిపట్టున లక్షణ గ్రంథకర్తల యెడ నేమేని వైరస్య మున్న దానిని గూడ దగినంత ప్రమాణమును జూపి ఖండించుటయు దటస్థించినది. కాని లాక్షణిక సమయము నుల్లంఘించి తోఁచినట్లెల్ల సమర్థింపఁ బూనలేదు. ఆ యీ యంశమును బోధించునవియే "వ్యాక రణమొక్క తోవ, మహాకవులొక తోవ" లోనగు పద్యములు. అవి ప్రస్తుతమునకు లవమును నుపకరింపవు. మన మాతృభాష యగు నాంధ్ర మునే మనవారు మ్లేచ్ఛ భాషలలోఁ జేర్చినపుడు షేక్స్పియరు భాషను వేద భాషగా నంగీకరింతురా! కావున నిం దా ప్రస్తావన నెత్తనక్కఱలేదు. అగుచో నన్నయాదులతో పాటుగా షేక్స్పియరు మహాకవితో పాటుగా ప్రస్తుత గ్రంథకర్త గారికి భాషాప్రపంచమున స్థాన మేర్పడిన దని సంత సింతురా? సలక్షణమగు విభావ సామగ్రియు నట్టిభాషయు నిందుండెనేని యపు డా విషయము చర్చనీయ మగుఁ గాని యిపు డాప్రశఁసయే లేదు గదా? ఇవి పామరుల మెచ్చుకొఱకుఁ గవి రచించె నందురా? సమ్మ తమే. దాని కింత ప్రయత్న మెందులకు? లోకోభిన్నరుచిః కనుక గ్రంథకర్తగారికి నీచాతి నీచపాత్రముల శృంగార మెట్లు రచించిన నది

యౌచిత్య భంజకము గాక యుండునో యట్లు రచింపవలయు నని యూహ కలుగంబోలు ! దానింబట్టి వారు తమ రచన నట్లు వినియోగించిరి. దీని కింత వాదప్రతివాదము లెందులకు ? గురుశిష్య భావము లెందులకు ? అవినయా లెందులకు ? క్షమాపణ లెందులకు ? ఎవరి చిత్తము వచ్చినట్లు వారు రచించుకొందురు. వారి నెవ రాఁగగలరు ? ఆగుట కధికార మెక్కడిది ?

శ్లో. స్వాధీనో రసనాంచలః పరిచితా శ్శబ్దాః కియంతః క్వచిత్
క్షోణీంద్రో ననియామకః పరిషదశ్శాంతా స్వతంత్రంజగత్
తద్యూయంకవయో వయం వయమితి ప్రస్తావనాహుంకృతి
స్వచ్ఛందం ప్రతిసద్మగర్జత వయం మౌనవ్రతాలంబినః.

వేంకటేశ్వర్లుగారేమి, ఆదినారాయణ శాస్త్రిలుగారేమి ప్రస్తుత మందితరసామగ్రి లేదని యొప్పుకొను చుండియు దఱచుగా రసము అని ఘోషించుచుందురు. ఇది యేటికర్మము ? "సాధ్యోహి రసో యథా తథం కవిభిః" అనురస మిట్టివిధమున సాధింపఁదగినదియే యగునోటు?

"కవినా ప్రబంధ ముపనిబధ్నతా సర్వధా రసపరతంత్రేణ
భవితవ్యం। తత్ర యది రసాననుగుణాం స్థితిం పశ్యే త్తాం భం
క్త్వాపి కథాంతర। ముత్పాదయేత్ నహీతివృత్త నిర్వహణేన
కవేః కించిత్ప్రయోజనం। ఇతిహాసాదేవ తత్సిద్ధేః"

ఈః ధ్వన్యాలోక కారకుని రసపరతంత్రత్వమునకు మనవా రిద్దానినే యుదాహరణముగాఁ గైకొందురోటు ? "ద్విత్రాఏవకవయః ద్విత్రాణ్యేవ కావ్యాని" అనుగణనలోనికిఁ బ్రస్తుతగ్రంధమును రచయితయును జేరుదు రని వీరి యాశయమొకో ? వీరివ్రాతలయర్థమువలన వీరి కింత కోరిక యున్నట్లు స్ఫురించుచున్నది. ప్రత్యక్ష దర్శనమొనర్చినపుడు శాస్త్రిల వారికిని నాకును జరిగిన ప్రసంగమునుబట్టి శాస్త్రిలవా రీ పీఠికను వ్రాయు టకుఁ గారణము సమర్థనీయము గానియట్లే వారొప్పుకొన్నట్లు తేలినది. అట్లొప్పుకొనుటకు నా యాగ్రహమునకు జంకుటగా వేంకటేశ్వర్లుగారు

సమర్థింపబూనిరి. దీని కుపోద్బలకముగ శ్రీశాస్త్రిలవారు "రస స్వరూపమును చదువరులకుఁ జవిచూపి" అని యేయో వ్రాయ మొదలిడినారు. ఇతరులేల చవిచూపవలెను? వానిని పరమోన్నత స్థానమున కెక్కించి వృథాగా బత్రికలకుఁ బని గల్పించుచున్న శాస్త్రిలవారే చవిచూపి ఇది రసాభాసముకాదు అని నిర్ణయించుట యుక్తము. వేంకటేశ్వర్లుగారు గ్రంథకర్తగారి యనుమతిని సంపాదించి వారి యుత్తరములను గూడఁ బ్రకటించి లోకము నారాధించుట యుక్తము. ఇది రసాభాస మన్నంతనే దీని కొక పెద్దలోపము లేదు. ఆద్యంతములు సర్వమును రసాభాసమే యనుటచే నిది కడుంగడు హేయము, యత్కించిద్రసాభాసమునకు మహాకవులొక్కింత యవకాశము నిచ్చుచునె యున్నారు. పోనిందు పూర్తిగా రసాభాసమే యైనను సంతసింపవచ్చును, ఏమందురా? దానికిం దగినసామగ్రిని చక్కఁగా సేకరించి యుండుట చేత. అగుచో నిఁక వాచమెందులకు? దానిని విమర్శకు లన్యథాగా నపవదించి పూర్వలాక్షణిక సమయముల నిందు సమన్వయింప నెంచి యేవేవియో పౌరోభోక్తలు ప్రకటింపఁ బూనుటచే నింతగా వ్రాయవలసివచ్చిన దని ప్రాజ్ఞలోక మెఱుఁగుఁగాక. అనుక్తమన్యతో గ్రాహ్యం.

---

# కవితా విప్లవం

విప్లవ శబ్దానికి సంస్కృతభాషలో సుప్రసిద్ధంగావున్న అర్థమేమో ఉపద్రవమనేది. కాని యిప్పుడు ఈ విప్లవశబ్దానికి హూణభాషా నిష్ణాతులు వాడుకునే అర్థం మార్పుఅనేది. ఆర్థికంగాగాని శాబ్దికంగాగాని మార్పు కలిగించిన కవులను విప్లవకారులని వాడతారు. పూర్వకవులు నగరార్ణవాది వర్ణనలు చేస్తూ యేదో యిష్టమైన కథను పుచ్చుకొని రచించేవారనిన్నీ ఆలా యావన్మందిన్నీ రచిస్తే అందులో మొట్టమొదటివేవో కొన్ని ఆదరణీయాలుగా వున్నా, తక్కినవి లోకంలో వూరూ పేరూ లేకుండాపోతాయ

నిన్నీ ఆలోచించి, యిప్పుడిప్పుడు యువకవులు కొందఱు యీ విప్లవ (మార్పు) విధానాన్ని అవలంబించి, రచనసాగిస్తూ వున్నారు. పూర్వులు పట్టణవర్ణనానికి వుపక్రమిస్తే మేడలు వగైరాలున్నూ, చాతుర్వర్ణ్యమున్నూ, వేశ్యలున్నూ, పుష్పలావికలున్నూ, పూవులతోటలున్నూ, వర్ణ్యాలుగావుండేవి యిప్పుడో, ఆరీతికి కొంత మార్పుకనపడుతూవుంది. వొక ముసాలివృద్ధురాలు అంధురాలు దైవవంచితురాలు దిక్కుమాలినపక్షి అదుగామడగా ముష్టి యెత్తుకోవడానికి బయలుదేఱి "మహారాజులు తల్లి! అన్నంలేనిదాన్ని మీబిడ్డలు చల్లగుండాలి, కామాక్ష్మతల్లీ! మీబిడ్డలపున్నెం తల్లీ" అంటూ విఘేవిరామమూ లేకుండా వాపోవడాన్ని ఒక యువకవి విన్నాఁడు. అతగాడి మనస్సు కరిగిపోయింది. పూర్వం ఆదికవి వాల్మీకి "మానిషాద ప్రతిష్ఠాంత్వ మగమ శ్శాశ్వతీ స్సమాః" అని గానంచేసినట్టే ఆయీ యువకవికూడా ఆముసలిదాని వాపోవటాన్ని వొకగేయంకింద అనువదించాడు. అది లోకాదరణ పాత్రమవుతుందని ఆయన విశ్వాసం. దానికి తథ్యంగా యింకో యువకవి విని, చాలా బాగావుందని ప్రోత్సహించాడు. దానితో ఆగేయకర్త దాన్ని మహాసభలలో కూడా వినిపించడానికి ఆరంభించాడు. ఆగేయకవి గాత్రం సన్నవిడిగా తాంబురాతీగెలా వుంటుంది: చదివేది తెలుఁగే అయినా, వేదంలాగ వుదాత్తానుదాత్త స్వరిత ప్రచయాలతో మధ్యమధ్య సన్నాయినొక్కులతో ఆయన చదవఁగలఁడు. పైఁగా తదనుగుణమైన అభినయంకూడా అప్రయత్నఁగా ఆచదవడంలో ప్రతిబింబిస్తూ వుంటుఁది. యిఁక చెప్పేదేమిటి? సర్వులూ ఆనందించడానికితగ్గ సామగ్రి సంపూర్తిగా కుదిరిందన్నమాటే. ఆసభలో నేనూ వున్నాను; విన్నాను, నామనస్సుకుమాత్రం యేకొంచెమూ ఆనందంకలిగిందికాదు, యెందుచేత కలగడంలేదని చాలా ఆత్మపరీక్ష చేసుకొన్నాను. కారణం గోచరించింది కాదు. ఆగేయకర్తయం దేదేనా వ్యక్తిగతంగా ద్వేషంవుందా? శివ శివా? అట్టిదిలేదు. అయమయమితి ప్రత్యభిజ్ఞగా వొకరిని వొకరం యెఱగంకూడాను. యిది అమంగళాశ్లీలంగా వున్న విషయం, కనక ఆనందదాయకంగా తోఁచలేదేమోనని అనుకున్నాను, కాని

అదీనిలిచింది కాదు. రఘువంశం యెనిమిదో సర్గలో అజమహారాజు భార్యా మృతిని గూర్చి యేడ్చినయేడ్పునున్నూ, కుమారసంభవంలో రతీదేవి భర్త్ర మరణాన్ని గూర్చి యేడ్చిన యేడుపున్నూ, చంద్రమతీ హరిశ్చంద్రులు పుత్రవియోగాన్నిగూర్చి యేడ్చినయేడుపున్నూ గ్రంథకర్తలు అనువదించారుకదా? అందులోమాత్రం అశ్లీలంలేదా? దాన్నిఆమోదించినప్పుడు దీన్నెందుకు ఆమోదించగూడదని తర్కించడానికి ఆరంభించాను. కాని, దీనికీ దానికీ పోలిక సుతరామూ లేనట్టే అంతరాత్మకు తట్టింది. "ఎగ్జాంపిలు"గా పుచ్చుకున్న మూడింటిలో మొదటిరెండున్నూ విప్రలంభ శృంగారంకిందకివస్తాయి. మూడోది కరుణ(దుఃఖ)రసంకిందకి వస్తుంది. ప్రస్తుత వృద్ధురాలి మొఱ్ఱ యేరసంలోకి వస్తుంది? అని మళ్ళామళ్ళా చర్చించుకున్నాను. యేమీ బోధపడిందికాదు. యెంతో ప్రయత్నించి దీన్ని యేదో రసంలోకి జమచేస్తే అది లాభకారిగాదు. వివరించవలసి వస్తే చాలా వ్రాయాలి. తుట్టతుదకి యీలాటి కవిత్వాస్వాదనానికి అలవాటు పడకపోవడంచేతనే యీచిక్కు తటస్థమయిందనిన్నీ క్రమంగా అలవాటైతే, యితరులు కొందఱు రసికులతోపాటు (నస్యం మొట్టమొదట పీల్చినవాళ్ళకి తుమ్ములు వస్తాయి, అలవాటయితే, యెంతపీల్చినా తుమ్మురానేరాదు) ఆస్వాదించేశక్తి కలుగుతుందనిన్నీ సమాధానం చెప్పుకున్నాను. కొందఱితో దీన్నిగూర్చి ముచ్చటిస్తే వారన్నారుగదా: యింగిరీషులో కొందఱు కవులు యీలాటివి రచించివున్నారు. యీయువకవితల్లజుని రచన దాన్ని ఆదర్శంగా పెట్టుకొని బయలుదేఱిందన్నారు. వోహో? యిది మనకు ఆభాషలో బొత్తిగా ప్రవేశంలేని కర్మంచేత కలిగిన యేవగింపు కాఁబోలు ననుకున్నాను. యేమంటే యూరోపియనువారి దేశాన్నుంచి తెప్పించుకొనే వెన్నడబ్బాలు విడగొట్టేటప్పటికల్లా బయలుదేఱే సువాసన మనదేశపు అనాగరికులు సమేతు నిమిషకాలంకూడా భరింపలేరనిన్నీ అట్టిపదార్థాన్ని వారు అమృతప్రాయంగా భుజింపగలుగుతారనిన్నీ వినివున్నాను. దీనిక్కారణం అలవాటేకాని మఱొకటి కాదని తేల్చుకోవడమైతే జరిగిందిగాని యింకా దీన్నిగుఱించి శంకా సమాధానాలు మనస్సులో కుప్పతిప్పలుగా బయలుదే.

ఉతూనే వుండడంచేత అయ్యా? యిది యింగిలీషుకవిత్వాన్ని ఆదర్శంగా పెట్టుకుని బయలుదేఱిన కవిత్వమన్నారు గదా? నేనొక పద్యం చదువు తాను దీన్నిమీరు ఆమోదిస్తారో? యేవగించుకుంటారో? నిష్కపటంగా తెల్పవలసిందని ఈ క్రిందిపద్యం తాత్కాలికంగా రచించి వినిపించాను.

ఉ. కొందఱు సోదరీమణులు కొప్పులు మల్లెసరాల వాసనల్
చిందగ రోడ్డుపక్క నునుచీకటియే తెరచీరగాగ నం
దందున నీళ్ళచెంబులిడి, యందఱు బం క్తిగ గూరుచుండి మ
మ్ముం, దఱికేగఁజూచి పెడమోమయి లేచిరి గుడ్డివెన్నెలన్.

యిది యింగిలీషు కవుల రచనకు మించిన పంథాలో వుందనో? యేమో? ఆయనవిని కొంతయేవాన్నే కనపఱిచారు. మొట్టమొదట చెప్ప డంమాత్రం కవికి తనజీవితంలో జరిగిన యావద్విషయమూ వర్ణనీయమే అవుతుందని చెప్పివున్నారు. యీవిషయం మాత్రం ఆయనకి అసహ్యంగా కనపడింది. వొకమహాకవి శ్రీకృష్ణుని బాల్యచేష్టలు వర్ణిస్తూ నీదేహాన్ని "లసత్పరిమళామహందదే" అని శ్లేషగా వొకగోపికతో మాట్లాడి అముగ్ధ అందులోవున్న శ్లేషార్థాన్ని గమనించక సమ్మతిని కనపఱిచేటప్ప టికి యేవంబుట్టే పదార్థాన్ని ఆగోపిక శరీరంనిండా పామినట్టు (పరిమళాం పరితః మలం యస్యాస్తాం, పరిమళాం. లళయో రభేదః) వర్ణించాడు. యిది వొకటేకాదు, ఇంకా యింకా యీలాటివీకావు ఛీట్లతాతముత్తాతలుగా వుండేవి శ్రీకృష్ణుని బాల్యచేష్టలక్రింద వర్ణించడం జరిగింది. యిదియింగి లీషు కవిత్వాన్ని ఆదర్శంగా పెట్టుకొని రచించిన రచనగాదు. వొకవిధ మైన ప్రమాదం (ప్రమాదో ధీమతామపి-అప్యేవకారార్థకః)అసలు సంస్కృ తభాగవతంలోవున్న దెంతపఱికంటే యీవిషయంలో "మేహనాదీని కురుతే" యింతేవుంది. మేహనం అంటే! సేచనం మూత్రోత్సర్జన మిటియావత్. గోపికలు యశోదదగ్గిఱికివచ్చి. "అమ్మా? నీబిడ్డడు మాయిళ్ళకువచ్చి మేముపరిశుభ్రంగా అలికి ముగ్గుపెట్టుకొన్నయింటిలో మూత్రోత్సర్జనాదులు చేసి కరాబు చేస్తున్నాఁడు" అని యింతమాత్రమే

చెప్పుకున్నారు. యిందులో వున్న ఆదీని అనేపదాన్ని ఆధారంగా పెట్టుకొని ఈసూత్రానికి మహాభక్తలోకశిఖామణి పోతనగారు "ఎబ్బెట్టా" పెద్దభాష్యం రచించి పామరలోకానికి సంతోషం కలిగించారు. ఆపద్యాలు భాగవతంలో అందఱూ చదివే వుంటారు. క్రైస్తవులు వగైరా విమతస్థులు మనం భగవంతుఁడుగా పూజించే శ్రీకృష్ణుణ్ణి ఆయాపద్యాలలోవున్న అంశాలు వుటంకించి ఈసడిస్తూ వుంటారు. కొంచెం వుదాహరిస్తాను.

(1) చన్నాడిసిపట్టి చీరెను జిన్నికుమారుండె.

(2) కెమ్మోవి గఱచి వడిఁజనె.

(3) నాతో వచ్చెదవా ? యనియన్నాఁ డిచ్చిఱుతఁడు

(4) తమ్మ మగనిగా గైకొనినన్ గొడుకులు గలిగెదరని పైబడినాఁడిది వినుము శిశువుపనులే ? తల్లీ !

(5) పీతలగిన చో పెయ్యది యని తలయూచె న్నీసుతుండు.

(6) చూలగుటకు నేమూలంబు చెప్పుమనె నీబాలుఁడు.

(7) నెఱిగట్టిన వలువ విడిచి నేఁడొకతేలుం గఱపించె.

(8) వెనుక గదిసి మగువ ! నీసుతుండు మగపోడుములు సేయసాగినాఁడు.

ఇవన్నీ పోతరాజుగారు — ఆదీని అనే వ్యాసులవారి సూత్రానికి భాష్యీకరించినవే గాని శ్రీకృష్ణభగవానుఁడు చేసినచేష్టలు కావు ముమ్మాటి కిన్నీకావు. ఈ పోతరాజుగారిని బట్టె అనుకుంటాను.

క. లోలయగు లోలలోచన
వాలుంజనుదోయి కేల పడిఁబట్టుక "ఉ
య్యాలో జంపాలో" యని
వ్రేలిన్ గృష్ణుండు సఖులు వికవిక నవ్వన్.

ఈపద్యం యిప్పటికి యేభై యేళ్ళకిందట బ్రౌనుదొరగారి నిఘంటులో చూచాను. (కవిపేరు జ్ఞప్తిలోలేదు) యిటీవల లోలభట్టు వీరరాఘవులు అనే భట్టుమూర్తి గేయకవిత్వంలో పోతరాజుగారు చూపిన విశేషాలు విస్తరించాడు. విస్తరభీతిచే వాట్లను వుదాహరించలేదు. యెవరికో చెప్పలేనుగాని, వాకకీర్తన చిన్నతనంలో విన్నది కొంచెం జ్ఞప్తిలోవుంది.

ఆనందభైరవి — ఆటతాళం

అంటున్నారు, అంటున్నారులే గోపాలకృష్ణ ॥అంటు॥
అంటున్నారు అంటున్నారు జంటలేక యింటింటికి
వొంటిపాటున నేగి కాంతల చంటిపై చెయివేశావని ॥అంటు॥

చాలును. తరువాయి జ్ఞాపకంలేదు. యివన్నీ వ్యాసభాగవతంలో వుండే "ఆకీని" అన్నదానికి చిలవలూ పలవలూగాదేఱిన బాపతే. యిందులో యెక్కువ హేయంగావున్న దేదంటే? మొట్టమొదటచూపిన లసత్పరిమళాం అన్నదియ్యేవే. అందఱికీ సుబోధంగా వుండని సంస్కృతంలో వుండడమే కాకుండా, శ్లేషగర్భితంగా కూడావున్నా యూరపుఖండాన్నుంచి రవానా కాఁబడి విడఁగొట్టఁబడ్డ' వెన్నుడబ్బాలాగ పైవాక్యం యేహాన్ని కలిగిస్తూ వుంది. తక్కినవి అంత హేయంగా లేవు. కనకనే పరమపవిత్రమైన భాగవతంలో యింతకాలం నిల్చి వుండగలిగాయి. ఆయీ కృష్ణచర్యలను వరవడిగా బెట్టుకొనే అనుకుంటాను అట్లతద్దిరోజున తెల్లవాఱుజామున ఆడుకునే ఆడపిల్లలను మొగపిల్లకాయలు దూలగొండ వగయిరాలతో అల్లరిచేయడం నాచిన్ననాటికి యింకా వుండేది. (యిందులో కొందఱు యువకులు కూడా చేరేవారు. పెళ్ళిళ్ళలో నాగవల్లిరోజున బుక్కాబగ్గుండలు చల్లుకోవడాల్లో కూడా చాలా మోటుసరసాలు వుండేవి. అవన్నీ యిటీవల నాగరికతలో పూర్తిగా తగ్గినందుకు నవనాగరికతను యెంతేనా అభినందించవలసివుంటుంది. ఆరోజుల్లో వుండే మేనత్తమేనమామల కూతుళ్ళేమి? కొడుకులేమి అన్యోన్యమూ చేసుకొనేహాస్యాలు లేశమూ దురుద్దేశపూరితాలు కాకపోయినా, యిప్పుడు అసలు లేకపోవడమే సంఘానికి గౌరవప్రద మని నే ననుకుంటాను. ఆయీ వుపకారంమట్టుకు పాశ్చాత్యవాసనవల్లనే మనకు కలిగింది.

మొట్టమొదట యెత్తుకొన్న "మహారాజులుతల్లి" అనేది కూడా కవిత్వములో యితివృత్తం కావడంకూడా ఆ వాసనవల్లనే మనకు సంఘటించింది. యిట్టి కవిత్వాన్ని అభినందించేయోగ్యత కూడా, ఆవాసనవల్లనే

